# ఉత్తరాలు

## హమేషా తమాషా

క వె రా. గారి సూక్తులు ఆలోచిస్తేగాని అవగాహన కాలేదు. కాకా పట్టడం చేతగానివారిని సానుభూతితో చూడటం లేకపోగా, పొగరుమోతులనంగా పరిగణిస్తున్నా రధికారులు. కాకమ్మే నయం కాకా అనకపోయినందుకు అనుమానించకుండా కోయిల పిల్లలకు మేలేస్తుంది.

కష్టజీవు లుత్సాహంతో కృషిసల్పి సంపాదించిన ఫలితం, కలవారి విలాసంపు విందులకేగా వినియోగ మగుచున్నది పుంజు నిజం చెప్పినది

శ్రీరామ్ (బందరు)

## మ స రా ష్ట్రం

ఆయుర్వేద విద్యార్థులను గూర్చి శ్రీ కౌండిన్య గారు వ్రాసిన వ్యాసాన్ని, దాన్ని విమర్శిస్తూ వ్రాసిన శ్రీ ద్వి సూ మూర్తిగారి ఉత్తరాన్ని పూర్తిగా చదివి అర్థం చేసుకున్నాను. ఈ వారం (25—10—61) శ్రీ ఎస్. వి రామ్మూర్తిగారు పై విమర్శ అయోమయంగా ఉందన్నారు. 'ఆ కళాశాల రెండు సంవత్సరాల క్రితమే శుద్ధ ఆయుర్వేద కళాశాలగా మారింది' అన్న విషయంలో ఏమర్థం గాలేదో తెలియలేదు. అంటే ఇప్పుడు ఆ కళాశాలలో మొదటి రెండు సంవత్సరాలలోనూ ఉన్న విద్యార్థులు శుద్ధ ఆయుర్వేదాన్ని అభ్యసిస్తున్నారు. చివరి రెండు సంవత్సరాలూ చదువుతున్న విద్యార్థులే పమ్మెను కొనసాగిస్తున్నట్లు తెలుసుకోవటం ఎంతైనా అవసరం. "ఫార్మకాలజీ" వంటి ఇతర ఆధునిక సబ్జక్టులు ఈమధ్య చేర్చినా ఆ విద్యార్థులు మొదటి సంవత్సరంనుంచే ఆధునిక వైద్యశాస్త్రాలు చదువుతూ "ఆధునిక వైద్యం"లో ప్రవేశం ఇమ్మని కోరటంలో తప్పేమీ కనబడటంలేదు. పైగా వారి పాఠ్య ప్రణాళికలో కూడా "గుంటూరు", "బెజవాడ" లలో ఉన్న ఆయుర్వేద కళాశాలలో వలె కాక, కొన్ని అల్లోపతి వైద్యశాస్త్రాలు ఉండటం గమనించవలసిన విషయం. ముఖ్యంగా ప్రభుత్వం ఈ విద్యార్థుల కోర్కెలు తీరుస్తామని చెప్పడమే దీనికి ప్రత్యేక నిదర్శనం.

రాజేశ్వరరావు (యలమంచిలి)

## పక్షపాతమా?

ఎప్పుడు మేము ఉత్తరాలు వ్రాసినా వేయక పోవడానికి కారణం? కేవలం మీకు బాగా పరిచయస్థులు, మీకు నచ్చినవారు పంపినవి తప్ప మరొకరివి ప్రచురించరా? ఇది చాల అన్యాయము. దయచేసి ఇకముందు మేము పంపే ఉత్తరాలను ప్రచురింప ప్రార్థన.

'జగత్' డి (బరంపురం)

## అగ్గిరాముడు

"ప్రతివారము మా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికయందు ప్రచురించుచున్న బి. వి సత్యమూర్తిగారి బొమ్మల కథ 'అగ్గిరాముడు' చాలా బాగుంది. అప్పుడప్పుడు ప్రచురించుచున్న సత్యమూర్తిగారి కార్టూనులు కూడా చాలా బాగున్నవి

దుర్భా సూర్యసుబ్రహ్మణ్యం (పూన)

* * *

"అగ్గిరాముడు" చిత్రకథ చాల రసవత్తరంగా సాగుతోంది. మా యింటిల్లిపాదిని చాలా ఆకర్షిస్తోంది.

టి. కల్యాణలక్ష్మి (ఎర్రగుంటపల్లి)

## ఎప్పుడూ ఇంతే

ఎప్పుడూ యింతే 99 వ కార్టూన్‌పై శ్రీమతి విశాలాక్షి, లక్ష్మణరావుగార్లు చేసిన విమర్శ సరియైనది కాదు. ఇప్పుడు మార్కెట్లో పిల్లలు ఆడుకొనే ప్లాస్టిక్ కళ్లజోడులు అమ్ముతున్నారు. ఆ కళ్లజోడుకే మీసాలు కూడ అంటించే ఉంటాయి. అందువల్ల అన్నివిధాల ఈ కార్టూన్ సరైనదే. ఇటువంటి మంచి కార్టూను అందించిన ఆంధ్ర సచిత్ర వారపత్రికకు నా అభినందనలు.

పి. రాజగోపాల్ (విజయవాడ)

## చదువుల్రావు

చదువుల్రావు'అనే బొమ్మలకథ తోడ్ స్లైడ్ రోమియోల కొక గుణపాఠం (చెప్పుదెబ్బ). ఇటీవల నా మిత్రుడు ఒకరు బందరు నుండి తిరుపతి వెళ్తూ ఈమాదిరిగానే బోల్తాపడ్డానని నాతో చెప్పాడు.

రామారావ్ మాండలే (టి. టివి)

* * *

25—10—61 ఆంధ్రపత్రిక"లో 24 వ పేజిలో సినీతార జమున చిత్రం "పెళ్ళికానిపిల్లలు" లోదా? "పెళ్ళింతాంబూలం" లోదా?

డి. సరస్వతీదేవి (అమనాం)

పెళ్ళికాని పిల్లలు'లో జమున.

## ఆదర్శాలు-ఆంతర్యాలు

"ఆదర్శాలు—ఆంతర్యాలు" సీరియల్ నవల చాలా రసవత్తరంగా నడుస్తున్నది. ప్రతివారం పత్రిక, ఎప్పుడొస్తుందా అని ఎదురు చూచేటట్లు చేస్తున్నది. ముఖ్యంగా రాబోయే ఎన్నికల దృష్ట్యా నవలలోని ఎన్నికల వాతావరణం ప్రబోధాత్మకంగా ఉన్నది. వాస్తవానికి అతి దగ్గరగా పాత్రలను కథా గమనాన్ని చిత్రిస్తున్న రచయిత సింగరాజు లింగమూర్తిగారికి మా అభివందనములు.

మురహరి లక్ష్మన్‌రావ్, వై. ఎల్. నరసింహం (భిలాయ్‌నగర్)

## కథ

"దారితప్పినా మాటతప్పినా" అనేకథ చాలా బాగుంది ఆకథ చదువుతున్నంతసేపు నవ్వు ఆపుకోలేకపోయాము. ముందు ముందు కూడా ఇటువంటి మంచి కథలనువేసి మాకు ఆనందం కలిగిస్తారని ఆశిస్తున్నాము.

కల్హారి సరస్వతీ విశ్వనాథం (విశాఖపట్నం)

# నికో

## సంపూర్ణ చర్మ ఆరోగ్యమునకు నివారణము – సౌందర్యమునకు మొదటి మెట్టు

ఇది మీ చర్మమును శుభ్రపరచుటయేగాక, మీ చర్మమునకు సౌందర్యమును కూడ నిచ్చును. నికో మురగ, రోమాంకురములకు చెంది శుభ్రపరచెడి గుణము, మరియు క్రిమి అభివృద్ధి నివారణ గుణము కలిగినదిన్ని, అది మీ చర్మమును శుభ్రపరచి మొటిమలు, కురుపులు మొదలైన అంటు వ్యాధులను రాకుండ కాపాడును.

పదిహేను దినములకొక పర్యాయము నికో సబ్బుచే మీ తలను రుద్దుకొనిన యెడల, అది చుండును రాకుండా కాపాడును. నికోను దిన సరి క్రమముగా వాడిన సౌందర్యమునకత్యావశ్యమగు, శుభ్రమైన, మృదువైన మరియు ఆరోగ్యవంతమైన చర్మమును మీకు నొసగును.

ప్రతిదినము నికోను వాడండి మీ యొక్క...
మీ కుటుంబీకుల యొక్క...
చర్మ ఆరోగ్యమునకు అనుగుణ్యమైన సబ్బు

**నికో దినసరి వాడుకకు స్వచ్ఛమైన క్రిమిహరణ సబ్బు**



బుధవారం : 8-11-61

ప్లవ సం॥ ఆశ్వయుజ బ॥ అమా॥

సంపుటము : 54 సంచిక : 9

స్థాపితము:

1908

*

ముఖ్యసంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి : 25 న. పై

సంవత్సర చందా : 13-0-0 రు.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము

7, తంబుచెట్టివీధి, మద్రాసు-1

★

## లోకంపోకడ



అమెరికాలో రెండు తలల పాము కనిపించింది—వార్త.

"భారత, పాకిస్తాన్ దేశాలపట్ల అమెరికా అనుసరిస్తున్న ద్వంద్వ విధానానికి చిహ్నం కాబోలు!"

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : సాధన



### శ్రీశైల ఆలయ ఉద్ధరణ నిధి

'ఆంధ్రపత్రిక' సేకరిస్తున్న శ్రీశైల భ్రమరాంబా మల్లికార్జునస్వామివారి ఆలయ ఉద్ధరణ నిధికి అక్టోబరు 28 వ తేదీనాటికి రు. 69,231-01 వసూలు అయింది. యథాశక్తి విరాళాలు ఇచ్చి ఈ పవిత్రమైన కార్యక్రమాన్ని జయప్రదం చేయవలసిందని ప్రజలకు, ప్రజాసంస్థలకు విజ్ఞప్తి చేస్తున్నాము. విరాళాలు 'ఆంధ్రపత్రిక' కే గాని, ఆంధ్ర సచిత్ర వారపత్రికకు పంపరాదని మనవి చేస్తున్నాము.

## ప్రమాదకరమైన ఆట


















దేశంలో ప్రబలమవుతున్న నియంతృత్వాన్ని గురించి రాజాజీ హెచ్చరించారు.

శ్రీకృష్ణ

# అభ్యర్థుల ఆస్తులు ఆరా తీస్తే, కాంగ్రెసు మార్కు సామ్యవాదం!!
# భారతదేశం నడిబొడ్డులో మరో పాకిస్తాన్

మన ప్రధాన మంత్రి ఎప్పుడూ కొత్త విషయాలు మాట్లాడుతూనే ఉంటారు. ఇటీవల ఒక బహిరంగ సమావేశంలో ప్రసంగిస్తూ పెట్టుబడిదారీ విధానాన్ని విమర్శించారు. పెట్టుబడిదారీ సమాజం, దురాశాపూరిత సమాజమని అభివర్ణించారు.

ఈ ప్రకటనలు పెట్టుబడిదారీ విధానాన్నిగూర్చి పెద్ద పరిశోధనచేసి చెప్పిన వనటానికి వీలులేదు. ఆస్తి సంపాదనేదేకదా పెట్టుబడిదారీ విధానానికి ముఖ్య ప్రాతిపదిక. అయితే రెండు ప్రశ్నలకు మాత్రం సరైన సమాధానం రాలేదు. పెట్టుబడిదారీ సమాజాన్ని విమర్శిస్తూ ప్రధాన మంత్రి రూపురేఖలు తీర్చిదిద్దగల ఆ 'కాంగ్రెస్' సమాజ స్వరూపమేమిటో? ఈ మారు జరుగనున్న ఎన్నికలలో పోటీ చేసే ప్రతి కాంగ్రెసు అభ్యర్థికి, 1947 ఆగస్టు 15వ తేదీనాటికి, అతడి పేరు మీదగాని, అతడి భార్యాబిడ్డల పేర్ల మీదగాని ఉన్న ఆస్తి వివరాలు, 1961 ఆగస్టు 15వ తేదీ నాటికి ఉన్న ఆస్తి వివరాలు తెల్పుతూ వార్తా పత్రికలలో కాంగ్రెసు పార్టీ ప్రచురిస్తే ఇందుకు సమాధానం లభిస్తుంది. ప్రతికాంగ్రెస్ సభ్యుడు త్రికరణశుద్ధిగా సామ్యవాది గనక ఆస్తిపాస్తులు ఉండేవీలులేదు. ఒకవేళ ఏవైనా ఆస్తులు గత పదునాల్గేళ్లలో సంపాదించినా, ఆ ఆస్తులు ఎలా సంపాదించింది కాంగ్రెస్ ఎన్నికల సంఘం వివరించాలి. ఇవి సామ్యవాదం అనుసరించడంవల్ల ఏర్పడ్డాయా లేక, పెట్టుబడిదారు దురాశవల్ల ఏర్పడ్డాయా అనేది కూడా తెల్పాలి.

ఇక రాబోయే రెండో ప్రశ్న అతి ముఖ్యమైంది, సామ్యవాదానికి సంబంధించినదీను. గత 5 సంవత్సరాలుగా ప్రధానమంత్రి ప్రజలకు సామ్యవాద మహాయోగాన్ని ప్రబోధిస్తున్నారు. ఇంతవరకు సాధించిందల్లా ఏమన్నా ఉంటే అది ప్రజాసోషలిస్టుపార్టీని విచ్ఛిన్నంచేయడమే. అయితే ఈ ప్రజాసోషలిస్టుపార్టీ పతనం పొందటం, తగిన నాయకుడు లేకపోవటమువల్లనా లేక ప్రధాన మంత్రి దండయాత్రల వల్లనా, అనేది ఇంకో పెద్ద చర్చనీయాంశం. అసలు విషయమేమిటంటే భారతదేశంలో సామ్యవాదం ఉపన్యాసాల్లో తప్ప ఎక్కడా అంతగా కన్పించదు. ఈ సందర్భంలో వర్తకుల ఆస్తుల వివరాలు సేకరించటం కూడా అవసరం. 1947 ఆగస్టు 15వ తేదీ నాటికి, 1961 ఆగస్టు 15వ తేదీ నాటికి వారి ఆస్తుల వివరాలు అంచనా వేయవలసిందని రిజర్వు బాంక్‌ను అడిగితే, ఇప్పుడవి సుమారు 2000% వరకు పెరిగాయని తేలుతుంది.

* * *

ఉత్తరప్రదేశ్‌లో హిందూ—ముస్లిం సంఘర్షణలు అలీఘర్ విశ్వవిద్యాలయాన్ని మళ్లీ ఒకసారి వేలెత్తి చూపించాయి. భారతదేశం నడిబొడ్డులో ఇంకో పాకిస్థాన్‌ను కాంగ్రెస్ ఏర్పాటు చేసేందుకు సిద్ధపడితే తప్ప, అలీఘర్, బెనారస్ విశ్వవిద్యాలయాలను మరామత్తు చేయటానికి ఇది తగిన సమయం. అలీఘర్ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు శ్రీ జైదీ అత్యుత్తమ జాతీయవాది. ఆ విశ్వవిద్యాలయం అధ్యాపకులలోను, విద్యార్థులలోను ఏ ఏ మత వర్గానికి చెందిన వారు ఎంతెంత మంది ఉన్నదీ, ఎంత మంది పట్టభద్రులు నేటా పాకిస్తాన్‌కు తరలి వెడుతున్నదీ వారు ప్రకటిస్తే బాగుండును. అలీఘర్

(62-వ పేజీ చూడండి)

## పెద్ద టపాకాయ

దీపావళికి ముందుగానే టపాకాయల మోతలు వినిపిస్తూ ఉంటాయి. ఈ సంవత్సరం దీపావళికి ఇంచుమించు ఊహాకే అందని పెద్ద టపాకాయ ఒకటి పేలింది; రష్యా ఉత్తర ధ్రువం దగ్గర ఏభైమెగాటన్నుల బాంబు పరీక్ష కోసం పేల్చినట్లు సోవియట్ రక్షణశాఖమంత్రి శ్రీ మాలినోవ్‌స్కీ ప్రకటించారు.

ఈ పరీక్ష పరిణామాలు ఇంకా సరిగ్గా తెలియవు. దాని వల్ల ఏర్పడిన 'ఫాల్ అవుట్' (రేడియో ధార్మికశక్తి కలది) ఏడు సంవత్సరాలవరకూ తీవ్రముగా ఉంటుందని కొందరి అంచనా. ఆస్ట్రియా దేశం వాతావరణంలో రేడియో ధార్మికశక్తి మామూలుకన్నా సుమారు 80 రెట్లు ఎక్కువగా ఉన్నదని తెలుస్తున్నది. 'ఫాల్ అవుట్' ఎక్కువగా రష్యా మీదనే ఉంటుందని కొందరు నిపుణుల అభిప్రాయం. బ్రిటిష్ ప్రభుత్వం ఏడాదికి లోపుగా ఉన్న పిల్లలకు పొడి పాల సరఫరాకు ఏర్పాట్లు చేస్తున్నట్లు వార్త వెలువడింది.

మన ప్రధానమంత్రి ఈ పరీక్ష ఘోరమైనదని విమర్శించారు. ఐక్యరాజ్యసమితిలో మాత్రం భారతదేశం ప్రతిపాదనలు రష్యాను ప్రత్యేకంగా ఖండించక అణ్వస్త్రాలు ఉన్న అన్ని దేశాలనూ మందలిస్తున్నాయి. [రష్యా ఒకవైపు అణ్వస్త్రపరీక్షలనిలుపుదల కోసం సంప్రదింపులు జరుపుతూ, హఠాత్తుగా పరీక్షలు ప్రారంభించిన తర్వాతే అమెరికా కూడా అనుసరించింది. అంతేకాక రష్యా అణ్వస్త్రాలను భూమి మీద పేలవటం వల్ల 'ఫాలవుట్' ప్రమాదం అధికంగా ఉన్నది. అమెరికా పరీక్షలన్నీ భూగర్భంలోనే జరుపుతున్నవి.] తటస్థ దేశాల అభిప్రాయానికి ఎంత విలువ ఉన్నదో బెల్‌గ్రేడ్ సభ జరుగుతూ ఉండగానే తెలిసిపోయింది. సమితిలో ప్రతిపాదనలు సాధించేది ఏమిటనేది ఆలోచించవలసి ఉంటుంది.

[ఒక "మెగాటన్ను" బాంబుపదిలక్షల టన్నుల టి. యన్. టి. కి సమానం. హిరోషిమామీద వేసిన బాంబు 1/50 మెగా టన్ను శక్తి కలది.]



నాలుగున్నర' అంది నా గడియారం.

''బాబూ, ఎవరండి హనుమప్పురం, దిగండి సార్'' అన్నాడు కండక్టరు. బస్సు పెద్ద కుదుపుతో ఆగింది. మేము ఆరుగురం సామానులు చేతో పట్టుకుని బస్సు దిగాము. దుమ్ము లేపుకుంటూ బస్సు వెళ్ళిపోయింది.

హనుమప్పురం—బస్సు స్టాండు నుంచి రెండు మైళ్ళ దూరం. 'ఈ రెండు మైళ్ళూ కాలవ గట్టున నడిచి వెళ్ళాలి'' అనే విషయం చుట్టుపక్కల భోగట్టా చేసి నడక ప్రారంభించాము. ఇసకను కాళ్ళతో తన్నుకుంటూ, సరుకుచెట్ల మధ్య నడుస్తూ జరుగుతున్న' జరగబోతున్న మా పిక్నిక్‌ను గూర్చి మాట్లాడుకోసాగాము. హనుమప్పురం పిక్నిక్‌కి తీసుకొచ్చినందుకు 'బట్టు' నన్ను అభినందించింది.

వేళ్ళాడే సంచులతో, జీరాడే శరీరాలతో ఆ రెండు మైళ్ళూ నడిచి వూళ్ళోకి చేరాము. ఆ వూళ్ళో ఎటువంటి వసతి సౌకర్యాలు లేవని అధికారరీత్యా తెలుసుకుని పరస్పరం తిట్టుకుంటూ అవూరి కరణంగారింటికి వెళ్ళాము. కరణంగారు మా కథ యావత్తూ విని వూరికి 'ఉత్తరంగా', కొంచెం దూరంలో తన యిల్లొకటి ఉందనీ, కావలిస్తే ఆ యింట్లో ఎన్నాళ్ళయినా ఉండవచ్చునీ చెప్పాడు. అంతకన్నా కావల్సిందేమీ లేనందువల్ల మేము ఒప్పుకున్నాము. కరణంగారు చుట్ట విసిరేసి, లోపలి కెళ్ళి 'పురికొస' కు కట్టిన వో తాళం చెవుల గుత్తి పట్టుకొచ్చారు. వెనువెంట 'ఒరే ఎవ్రరా అక్కడ ? వారిగా, వీరాయ్' అని కేకేశారు. ఆ కేకకి సమాధానంగా ఒక అరవై ఏళ్ళ వృద్ధుడు వచ్చి, ''నేనండి బాబయ్యా'' అన్నాడు. కరణంగారు మీసాలు సరిచేసుకుని అదోలా అతని కేసి చూసి, ''మన యిల్లు లేదు—అల్ల యిల్లు—ఆ తాళా లివిగో—వీళ్ళు వూరు చూడ్డాని కొచ్చారట. అందులో ఉంటా నన్నారు. తాళాలింద—బిందె, చెంబూ, చాప చుట్టలూ పట్టుకెళ్ళు—వూ'' అన్నారు. ఆ వ్యక్తి కొంచెం తటపటాయించి, లోపలకెళ్ళి సరంజాముతో చక్కా వచ్చాడు. కరణంగారికి ఆరు నమస్కారాలూ పెట్టి అతని వెంట బయల్దేరాము.

మరో అరమైలు నడిచి ఆ యింటికి చేరాము. కరణంగారి పాలేరు తాళాలు తీసి లోపల అడుగు పెట్టాడు. వెనువెంట మేమూ అతన్ని అనుసరించాము. పాలేరు వరసన తలుపులన్నీ తీసి, ''బాబూ, దొడ్లో నుయ్యి ఉంది. స్నానాలు చెయ్యొచ్చు—నేను వెళ్ళిరానా'' అన్నాడు.

''అది సరేకాని, నీపే రేవిటోయ్'' అన్నాడు మా శేషగిరి.

''రామయ్యనండి బాబూ'' అన్నా డతను.

''సరేకాని రామయ్యా, యీ యిల్లు యింత దూరంగా కట్టే రెందుకోయ్! ఎవరూ ఉండటం లేనేం'' అన్నాడు శేషగిరి అనుమానంగా.

''మారాజులు బాబూ! వెళ్ళ. ఏదైనా చేస్తారు—సరి. నే మళ్ళా వస్తా—స్నానాలు చేసి ఉండండి బాబూ!'' అన్నాడు రామయ్య. మేము స్నానాలు చేయడానికి లేచాము. రామయ్య వెళ్ళిపోయాడు.

* * *

స్నానాదులు ముగించి, వూరు చూడ్డానికి బయల్దేరాము. మరో పావు గంటకు వూరు చుట్టూ తిరిగి చివరకు చేరాము. ఇంకా చీకటి పడనందువల్ల, దూరంగా కనుపిస్తున్న కొండలవైపు నడక ప్రారంభించాము. దాదాపు ఒకమైలు దూరం నడిచేసరికి ఎవరితోనో మాట్లాడుతున్న రామయ్య కనుపించాడు. మమ్మల్ని చూస్తూనే, ''ఏం, బాబూ, కొండలు చూడ్డానికా'' అన్నాడు. 'మరే నోయ్' అన్నాను నేను.

''నే సాయం వస్తా పదండి'' అన్నా డతను.

ఏడుగురం నడక ప్రారంభించాము. చీకటి పడుతోంది. రైతులు పొలాలనుంచి వస్తున్నారు. కట్టెపుల్లలు మోసుకుని లంబాడీలు చకచకా వెళ్ళిపోతున్నారు. పాలేరు కుర్రాళ్ళు గేదెలమీద కూర్చుని హాయిగా గానం చేసుకుంటూ పోతున్నారు.

మా శేషగిరి మౌనాన్ని భరించలేక కబుర్లు ప్రారంభించాడు. కబుర్లనుంచి తను నానా కష్టాలూ పడి నేర్చుకున్న పక్షుల కూతలూ, జంతువుల అరపులూ, సినిమా పాటలూ ప్రారంభించాడు.

మేము అప్పటికి పొలాలూ గట్లూ దాటి ఒక 'చిన్న కోనేరు' లాటి మడుగు దగ్గరి కొచ్చాము. శేషగిరి కాలితో వో రాయి తీసి, నీళ్లలో విసిరాడు. 'బుడింగ్' మని శబ్దం వచ్చింది. ఆ శబ్దాన్ననుసరించి, అనుకరించి, శేషగిరి కూడా 'బుడింగ్' అన్నాడు. మడుగులో కప్ప బెకబెక లాడింది. 'రెర్రే' అని అరుస్తూ శేషగిరి 'బెక్‌బెక్' అని గోల సాగిం



వాడు. రామయ్య తలపాగా సరిచేసుకుని 'అబ్బాయి గారు మా చక్కా అరుస్తున్నారే' అన్నాడు. శేషగిరి ఉత్సాహం దాంతో ద్విగుణీకృత మయ్యింది. పేరు ప్రఖ్యాతులు గల పక్షుల, జంతువుల అరపులన్నీ ఏకరువు [illegible]రిచి వినిపించాడు. మా నడక సాగు తూ [illegible]ంది.

[illegible]రికి మేము ఒక కొండదగ్గిరికి వచ్చాము. సూర్యుడు పడమటి కొండలలోకి దిగజారి పోయాడు. ఇంక పైకి ఎక్కడం మంచిదికాదని, కొండ కిందున్న రాళ్ళమీద కూర్చుని కబుర్లు ప్రారంభించాము.

*　　　*　　　*

మరో అరగంట దాటింది. రామయ్య నెమ్మదిగా లేచి, ''బాబూ మీ రిక్కడేవుండండి. నే వెళ్ళి ''గులాబ్ జామకాయలు పట్టుకొస్తా'' అన్నాడు. ''గులాబ్ జామకాయలేమిటి?'' అన్నాడు శేషగిరి నవ్వుతూ.

''పట్టుకొస్తా చూద్దురుగాని'' అంటూ వెళ్ళి పోయాడు. మేము కబుర్లు చెప్పుకోసాగాము.

పక్కనున్న చెట్టుమీంచి గుడ్లగూబ ఎగిరివచ్చి మా పక్కన వాలింది. శేషగిరి గుడ్లగూబనుచూస్తూ, దాని అరుపు అరిచాడు. అది మళ్ళీ అరుస్తూ ఎగిరి పోయింది. మేము సంతోషంతో చప్పట్లు కొట్టాము.

ఇంతలో వో తమాషా పిలుపు ఒకటి కొండ ల్లోంచి సన్నగా వినబడింది. ''ఏవిట్రా అది!'' అన్నాడు శేషగిరి. చుట్టూ ఎగిరెగిరిచూశాము. కానీ, మా కంటికి ఏవీ కనబడలేదు. మళ్ళా కబుర్లల్లోకి దిగాము. ఈసారి ఆ కేకలాంటిది మళ్ళీ వినపడింది. ''ఏవిట్రా ఆ కూత?'' అంటూ శేషగిరి ఒక బండఎక్కి చుట్టూ చూశాడు. ఏవీ కనుపించలేదు.

మళ్ళీ వినపడింది ఆ కేక.

''ఓహ్హో'' అని చాలా సన్నగా వినపడింది [illegible]

''అదేవిట్రా? పక్షి అరుపే...'' అన్నాడు. శేషగిరి నాకేసి చూస్తూ.

''పక్షికూతే అయివుండచ్చేమో'' అన్నాను నేను.

''ఈసారి వినపడనియ్యి. చూద్దాం'' అన్నాడు. శేషగిరి. ఈలోగా మళ్ళీ ఆ కేక వినపడింది. శేషగిరి ఆ కేకను అనుకరించడానికి నోరు చాచాడు. కానీ ఎదురుగా కనుపించిన దృశ్యానికి అరవక అట్టేవుండి పోయాడు.

రామయ్య మాకేసి పరిగెట్టుకుంటూ వచ్చాడు. వస్తూనే అమాంతం శేషగిరి నోరు రెండు చేతుల తోనూ మూసేసి, ''ఈ వరకా అరుపరిచారా'' అన్నాడు రొప్పుతూ. మేము విశ్చేష్టులమయిపోయాము. రామయ్య నెమ్మదిగా శేషగిరిని వదుల్తూ, ''ఆ అరు పరవలేదుగదా'' అన్నాడు. బిక్కచచ్చిన శేషగిరి 'లేదు' అని తల ఆడించాడు.

''ఏం రామయ్యా. ఏం'' అన్నాను నేను.

''అరిస్తే —ఏం?'' అన్నాడు శేషగిరి మెడ సరిచేసుకుంటూ.

రామయ్య నేలమీదున్న కర్రతీసి చేత్తో పట్టు కున్నాడు. తలపాగా సరిచేసుకున్నాడు. మేము ఆత్రంగా అతనికేసి చూడసాగాము.

''ఇంటికెళ్ళాక చెప్తా బాబూ, చాలా పెద్దపురాణం. విన్నట్టు యిప్పటికి నాలుగుసార్లు కదూ, ఆ కేక వినపడింది. ఇంకోరెండుసార్లు వినబడుతుంది. జాగ్రత్తగా వినండి. మీరు మాత్రం అరవద్దు—అవతల— ఇంటికి వెళ్ళాక చెప్తా'' అన్నాడు. వూ అనడానిక్కూడా మాకు భయంవేసి తలలు వూపాము. ఎక్కడ వాళ్ళం అక్కడే కూర్చున్నాము.

ఒక్క నిముషం గడిచిందో లేదో ''ఓహ్హో'' అన్న కేక వినపడింది మళ్ళీ. రామయ్య మా అందరి కేసీ చూశాడు. మరో నిమిషంలో ఇంకోసారికూడా

(౫౯–వ పేజీ చూడండి)



# కథ కాని కథ

## తాదాత్మ్యం

### (మొదటి బహుమతి రు. 10 లు)

ఒకరోజున మా ఊర్లో ఒక హరిదాసుగారు హరికథ చెప్పేందుకు వచ్చారు. 'శ్రావణ విజయం' కథ చెప్తున్నారు. కథా సందర్భంలో దాసుగారు "ఆ దశరథ మహారాజు బుడ బుడ అనే శబ్దము విన్నవాడై తన శబ్దభేది అనే విద్యవలన బాణాన్ని ఆ శబ్దం వచ్చిన వైపుకు ఉంచి వారిని ఆకర్ణాంతంలాగి వదిలాడు" అంటూ చేతిలో ఉన్న రెండు చిడతలలో ఒక దానిని ధనస్సులాగా మరోదానిని బాణంలాగా చూపిస్తూ చెవిదాకా లాగి (దశరథుని లాగే) వదిలివేశాడు. అది కాస్తా చేతిలోంచిజారి ముందు వరుసలో కూర్చున్న మావూరి కరణం గారి తలకు తగిలింది. దానితో ఆయన కాస్త వయసులో ఉన్నవాడేమో "అమ్మా చచ్చాన్రోయ్" అన్నాడు. దానికి దాసుగారు అన్నారు కదా "అయ్యో మానవకంఠంలా ఉందే" అనవసరంగా చంపేశాను."

కరణంగారికి ఒళ్ళు మండి హరిదాసుగార్ని కథ ఆపమన్నారు.

ఎస్. వి. ఎస్. మూర్తి (విశాఖ)

* * *

## 'ఆ' తర్వాత 'ఇ'

### (రెండవ బహుమతి రు. 5 లు)

ఈ వేసవి సెలవులకు ముందు మా వూరి ప్రాథమిక పాఠశాల వార్షికోత్సవ సందర్భమున మేమంతా అతిథులుగా ఆహ్వానించబడ్డాము. ఆనాటి కార్యక్రమము ప్రకారము అన్ని పనులు సక్రమముగానే జరిగిపోయినవి. సాయంత్రము పెద్దల ఉపన్యాసములు, బహుమతులు పంచు కార్యక్రమము మిగిలినవి. కార్యక్రమము ప్రకారం అందరము నియమిత స్థానములలో ఆసీనుల మయితిమి. పిల్లలందరు తరగతుల ప్రకారము, అనగా 1వ గ్రేడు నుండి, 5వ గ్రేడు వరకు వేదిక ముందుభాగములో క్రింద కూర్చొని ఉండిరి. అధ్యక్షుని ఎన్నిక అయిన తరువాత ఉపన్యాసములు ప్రారంభమైనవి. ఒక ఉపాధ్యాయుడు వేదికపైకి వచ్చి ఉపన్యాసము ఇచ్చుచు మధ్య మధ్య ముందు కూర్చొన్న పిల్లలవైపు, ప్రక్కగా కూర్చొన్న మావైపు చూచుచు, ఠీవిగా నిలబడి ఏకధాటిగా పది నిముషాలు మాట్లాడెను. ఉపన్యాసము చివరకు వచ్చింది. ఉపాధ్యాయునికి ఇక మాటలు దొరుకక ఆ .... తర్వాత .... ఆ ... తర్వాత .... అనుచు పిల్లలవైపు చూచుచుండెను. ఆ తర్వాత, ఆ తర్వాత అని ఉపాధ్యాయుడు బాధపడుట గమనించి ముందు వరుసలో ఉన్న 1వ గ్రేడు విద్యార్థి లేచి అమాయకంగా ఆ ..... తర్వాత .... ఇ—సార్ అని చప్పున కూర్చున్నాడు. అంతే అక్కడ కూర్చున్న పెద్దలతో సహా పిల్లలు ఒక్కసారే గొల్లుమన్నారు.

వరెడ్ల చంద్రయ్య (వెంకటాపురము)

* * *

## మామయ్య వారసత్వం

### (రెండవ బహుమతి రు. 5 లు)

అది నేను రెండో సంవత్సరం యం. బి. బి. యస్. చదువుతున్న రోజులు. మానవుని ఎముకలు గురించి చదవటం "అనాటమీ" అన్న సబ్జక్టులో ఒకభాగం. పరీక్షలు దగ్గరపడుతుంటే, ఒకనాడు కొన్ని ఎముకల గురించి చదువుదామని నా దగ్గరఉన్న ఎముకలపెట్టె తెర్చి ఆ ఎముకల కోసం వెదుకుతున్నాను. ఇంతలోనే నాకు తెలిసిన ఒకాయన వచ్చాడు. ఆయన నన్నూ, ఎముకలను చూసి ఆశ్చర్యపోయాడు. ఇవి "నీ కెక్కడివిరా" అని అడిగాడు. నేను వెంటనే "అవి మా మామయ్యవి" అనిచెప్పి, నా పనిలో నిమగ్నమయ్యాను. ఆయన ఆశ్చర్యపోయి "మీ మామయ్య వంటామేమిటిరా? వెధవా? ఆయన బ్రతికేఉంటేనూ? నీకు మతి పోయిందేమిటి? ఇవెవరివిరా? నీ కెట్లావచ్చాయి." అని నన్ను చివాట్లు పెట్టాడు. అపుడు నా కసలుసంగతి జ్ఞాపకం వచ్చి నా జవాబుకు నాకే నవ్వు వచ్చింది. తర్వాత ఆయనతో "అది కాదండీ" మా మామయ్య పోయిన సంవత్సరమే డాక్టరుకోర్సు పాసయ్యాడుకదండీ! అందుకని నేను మరల కొన నవసరంలేకుండా ఆయన పుస్తకాలు, ఆయన చదువుకొనేందుకు కొన్న ఎముకలపెట్టె నా కిచ్చాడు. అందుకని నేను అలవాటులో పొరపాటుగా ఆ ఎముకలు నేను కొనలేదన్న అర్థంలో ఆయనవే అన్నానండీ" అని చెప్పాను. అంతటితో ఆయనకు నవ్వు ఆగిందికాదు.

ఎస్. మారుతీసూర్యారావు (గుంటూరు—2)

* * *

## 'ఇంకా లేవలేదా!'

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా సైన్సు మాస్టారు చమత్కారంగా మాట్లాడి అందర్నీ నవ్విస్తూ ఉండేవారు. అయితే ఆయన చమత్కారంలో ఒకటి ఉండేది. పిల్లల్లో ఒకణ్ణి ఎరగా పెట్టి, మిగతావాళ్లని నవ్వించేవారు. ఈవిధంగా దాదాపు అందరూ ఆయన 'చమత్కారా' నికి గురి అయినవాళ్ళే. కాబట్టి అందరికీ ఆయనంటే కాస్త కూస్త మంట ఉండేది. ఒకరోజున ఆయన క్లాసుకువచ్చి నిద్రతో జోగుతూ పాఠం చెబుతున్నారు. మధ్యలో ఒకసారి ఆయనకి తెలియకుండానే చేతిలోంచి పుస్తకం జారి కింద పడ్డది కూడా. ఆయన సర్దుకొని, చిన్నగా నవ్వుతూ "నేను నిద్రపోయి పదిరోజులైంది" అన్నారు 'చమత్కారం' గా. వెంటనే వెనక బెంచీలోంచి మా స్నేహితుడు ఒకడు 'ఇంకా లేవలేదా సార్' అన్నాడు. సీమ టపాకాయల్లాగా మోగాయి మా నవ్వులు.

ఆర్. రామకృష్ణ (విజయవాడ)

* * *

## ఖాళీ లేదు

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా కాలేజీలో టీపార్టీ జరుగుచుండుటచేత అప్పటికే ఆలస్యమయిందని ఎవరికి వారు త్వరగా వెళ్ళుచున్నారు. అదే సమయములో ముగ్గురు విద్యార్థులు ఒకే సైకిలుపై వస్తూవుండటము పోలీసు చూసి "ఆపండి సైకిలు" అని అనగానే వారిలో ఒకడు "యిప్పటికే సైకిలు హోవర్‌లోడ్ అయింది. ఇంక ఖాళీలేదుసార్, చాల లేటయింది వస్తాం" అని అనగానే, అక్కడున్న వాళ్ళు, పోలీస్‌కి నవ్వాగింది కాదు.

మోహన్ శైకుమార్ (బాపట్ల)



**ఎస్. వి. రామారావు**

# ఆంధ్రుల చిత్రకళ



బెస్తపడుచులు

చిత్రకారుడు: కె. శ్రీనివాసులు.

చిత్రకళమీద వ్యాసంవ్రాస్తే ఎంతమంది చదువుతారు (విద్యావంతులనుకునేవారి సంగతి, మిగిలినవారిసంగతి సరేసరనుకోండి) అనేది సమస్య అయింది యిప్పుడు. ఏ సినిమా నటుడో, నటీమణో వారింట్లో బల్లిగురించో, బాండ్రుకప్పగురించో వ్రాస్తే ఆఫీసు టైములో ఎమర్జెన్సీ ఫైల్స్ మధ్య వుంచుకొని, పత్రికలు చదివే ఈ రోజుల్లో కష్టమే మరి కళపై వ్యాసాలు వ్రాయడం. అయినా తెలుగువారిలో కళాతృష్ణ యింకిపోలేదనే నమ్మకంతో అప్పుడప్పుడు బహుకొద్దిమంది చిత్రకళపై వ్యాసాలు వ్రాస్తుండడం జరుగుతున్నది. ఈమధ్య ఆంధ్ర లలితకళా ఎకాడమీ వచ్చేముందు, వచ్చిన తరువాత న్యూస్ పెద్దగా పేపర్లలో వచ్చింది. ఈ సమయంలో దాదాపు అన్ని తెలుగు దిన పత్రికలలో చిత్రకళపై చిత్రకారులపై వ్యాసాలు రావడం, కొంత అలజడి కలగడం జరిగింది. మన ఆంధ్రులలో ఏది వచ్చినా విజృంభణగా ప్రళయరూపంలోనే వుంటుంది. ఇలా ఒక్కసారిగ ప్రజల దృష్టిని కళపై కేంద్రీకరించడానికి కారకులైన వ్యాసరచయితలకు తెలుగు కళాభిమానులు ఎంతో కృతజ్ఞులు.

నిజానికి ఆంధ్రులు ఎంత కళోపాసకులో, తెలియాలంటే లేపాక్షి, అజంతా, సాంచి చెపుతాయి బలంగా. ఆంధ్రత్వము నూటికి నూరు పాళ్ళు నిండిన మన చిత్రకళలోని సునిశిత పనితనం, సోయగం, లావణ్యం, రంగుల పొందిక, ఉన్నతభావం అమరత్వం పొందాయి. యుగయుగాలు చెదరక నిలచిన అమరావతి, నాగార్జునకొండ, హంపి, గోలి, వరంగల్లుల శిల్పాలు ప్రపంచ శిల్పకళకే మకుటాయమానాలు. ఎంత కాలంనుండి ఎంతమంది దేశీయ, విదేశీయ ప్రజలు ఆశ్చర్యంతో వినమ్రులు కావడంలేదు ఈమన కళలముందు! మననుండి దొంగలించిన చిత్రశిల్పకళాసంచయములను విదేశీయులు పలు మ్యూజియములలో భద్రపరచుకున్నారంటే, మన ఆంధ్రకళకు, ఆంధ్రులకు అంతకంటె గౌరవం గర్వకారణం వేరొకటి వుండదు.

కాని నేటి పరిస్థితిచూస్తే విషాదకరం. రాజకీయాలమీద, సినిమామీదవున్న మోజు ఎందువల్లనో సృజనాత్మక కళలపైలేదు మనఆంధ్రులకు. కళల ఔన్నత్యాన్ని పూర్ణరూపానచూచి ఆనందించగల అలనాటి తెలుగువారు ఈనాడు కరువయ్యారు. అటువంటప్పుడు సృజనాత్మకమైనదేకళైనా ఎలా నిలుస్తుంది వూపిరితో. మాసిపోయిన మాచెర్ల కళాకేంద్రం, మచిలీపట్నం జాతీయ కళాశాల (చిత్రకళా విభాగం)లే నిదర్శనాలు మన కళాభిమానానికి.

మన తృష్ణ యిలా యిగిరిపోవడానికి ఎన్నో కారణాలు వున్నాయి. బ్రిటీషు పాలన వచ్చిననాటినుండి మన దేశీయులలో భౌతికవాదం, పాశ్చాత్యుల పద్ధతులపై మోజు పెరిగి, భారతీయ సంస్కృతి మరుగుపడింది. ముఖ్యంగా మన తెలుగువారిది "చూచిన పాముమ కంతను పోనిచ్చే" తత్వంగాదు. అందుకే ఎంత క్రొత్తదైనా చటాలున గ్రహిస్తాం. [illegible] కాదిన బౌద్ధమతం అమరత్వం పొందింది తెలుగుదేశంలోనే. బ్రహ్మ సమాజ మతాన్ని విస్తృతంగా స్వీకరించింది మనవారే. స్వదేశీయ ఉద్యమంతో ముందడుగు మనదే. దీనివల్ల మంచి చెడూ రెండూ జరిగాయి. చిత్రలేఖనాన్ని దృష్టిలో పెట్టుకొని వచ్చిన మార్పులను వివరిస్తాను.

తెలుగువారిలో కే. శీ. రాజా రవివర్మ, కనూదేశాయిల చిత్రాలు ఎరుగనివారు అరుదు. వీరి తరువాత దేశంలో ఎంతోమంది చిత్రకారులు విభిన్న పద్ధతులలో ప్రశంసాపూర్వక కృషి చేసినా యింకా మనవారు రవివర్మ, కనూదేశాయి చిత్రాల మత్తులోనే వున్నారు. ఏ రిద్దరి చిత్రకళమీద విభిన్నాభిప్రాయాలు లున్నాయి. రాజపుత్ర, మొగల్, దక్కనీ చిత్రకళల ఔన్నత్యాలను, దేశీయతను మరచిపోయిన మనకు ఒక క్రొత్తవింతగా కనిపించింది రవివర్మ చిత్రకళ. ఆధ్యాత్మిక దృష్టికల భారతీయులమీద రవివర్మ కళ ఒక పెను తుఫాను. క్రొత్త రకం చిత్రకళకావడం, ఆయన కాలంలో అలావేసే మరో పెద్ద చిత్రకారుడు లేకపోవడం, ఆబాలగోపాలానికి సులువుగ తెలిసేటట్లు నున్నగా చిత్రించడంవల్ల ప్రజల్లో ఆకర్షణ పెరిగింది. దైవభక్తిపరాయణులైన నాటి ప్రజలకు, ఆయన చిత్రించిన లక్ష్మీ, సరస్వతి, శకుంతల చిత్రాలు ఎంత నచ్చుతాయో వూహించవచ్చు. ఆయన చిత్రాలకు నీటైన ముద్రణ, మైసూరు మహారాజా ప్రాపకం ఆయన కీర్తికి మరింత దోహదం చేశాయి.

అందుకు ఆయన ప్రశంసనీయుడు. ఒక్కసారిగ ప్రజల్లో చిత్రకళపై మమకారాన్ని రెచ్చగొట్టాడు. చిత్రకళకు వారి హృదయాల్లో చోటు కల్పించాడు. ఏ చిత్రాన్నైనా రవివర్మ చిత్రాలతోపోల్చి చూచే స్థాయికి వచ్చారు ప్రజలు. కాని నిశితంగా చూస్తే ప్రజల్లోవున్న పేరునుబట్టి చిత్రకారుడి శక్తిని నిర్ణయించలేం. ప్రజలకు బాగా నచ్చేవిధంగా వేసిన సినిమా బ్యానర్లను ఉత్తమ కళాఖండాలనలేం. భావాన్ని ఏ విధంగా చిత్రకారుడు రంగుల రూపంలో ప్రదర్శిస్తున్నాడు అనేది అతని నైపుణ్యాన్ని, భావ విస్తృతిని, సాధననుబట్టి వుంటుంది. ఇవి నిర్ణయించవలసినవారు చిత్రకళామర్మములను ఎరిగిన విమర్శకులు, చిత్రకళలో సాధన చేసిన చిత్రకారులుగాని, మామూలు ప్రజలుగాదు. ఈవిధంగాచూస్తే ఆయనకు సృజనాత్మక చిత్రకారుల స్థాయిలో స్థానంలేదు. పాశ్చాత్య పద్ధతిలో చిత్రించినా, పాశ్చాత్య చిత్రకారులస్థాయికి అందుకోలేదు వీరి కళ. చాలమంది ప్రముఖ విమర్శకుల, చిత్రకారుల అభిప్రాయం కూడా ఇదే.

(55-వ పేజీ చూడండి)


ఏమిటి చెప్మా


లోపలికి వచ్చేస్తున్నాడేమిటి?


ఏమండోయ్ - ఓసారి ఇలా రండి వీడెవడో లోపలికి వచ్చేస్తున్నాడు... భయంలేకుండా, వినకుండాను..


ఎవడ్రా వాడు డేమ్‌ఫూల్ ?!!!
నేను నాన్నా, ఈవేళ మా కాలేజీలో ఫేన్సీడ్రెస్ పోటీలలో నాకే ఫస్టు ప్రైజ్ వచ్చింది మీకే వేషం చూపెం
చాలని ఇలా వచ్చేశాను



తాడికొండలో సుమారు 60 వేల రూపాయలతో శ్రీ మిద్దెకోటి రత్నం నిర్మించిన ఆస్పత్రి భవనానికి గుంటూరు వైద్యకళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ డి. జగన్నాథరెడ్డి ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు.

మనమూ-మనరాష్ట్రం

కౌండిన్య

# ఆంధ్రప్రాజెక్టులకు గుల్హాతీసంఘం చుట్టే పగ్గానుస్వారం:
# తెలంగాణా భూముల కొనుగోలు బిల్లు పరిణామాలు

ఆంధ్ర ప్రాజెక్టులకు సున్నా చుట్టడానికి గుల్హాతీ సంఘం గూడుపుఠాణి చేస్తోందని, ప్రభుత్వము ప్రజానాయకులు భయపడుతున్నారు అదినుంచి ఏం జరుగుతున్నదో తెలిసి కూడా ఇప్పుడు క్రొత్తగా ఈ భయాన్ని నటించడ మెందుకో తెలియదు కృష్ణా, గోదావరి నదుల్లో ప్రవాహం లెఖలు తిరగ తోడటానికి రాజకీయమైన వత్తిడికి లొంగి పోయి గుల్హాతీ సంఘాన్ని కేంద్రప్రభుత్వం నియమించినప్పుడే ఈ గూడుపుఠాణికి బీజం పడింది ఆనాడు తమ అనుమతి లేకుండా, అఖరికి తమను సంప్రదించకుండా, ఆ సంఘాన్ని నియమిస్తే కిమిన్నాస్తిగా ఉన్న రాష్ట్రప్రభుత్వం ఈ నాడు ఆందోళన పడినా లాభమేమిటి ?

ఆంధ్రకు అన్యాయం జరిగినా సరే మైసూరు మహారాష్ట్రలకు కావలసిన నీరును కృష్ణా, గోదావరి నదులనుండి మళ్ళించాలన్నది కేంద్రప్రభుత్వ ఉద్దేశ్య మైనట్లు కన్పిస్తూనె ఉంది మిగులు నీరుంటే సరేసరి లేదా ఆంధ్ర ప్రాజెక్టులలో కొన్ని మినహాయించి, ఆ రాష్ట్రాలకు నీరు లభింపచేయాలనే ఈ సంఘాన్ని నియమించిన కారణం అయినప్పటికీ పోచంపాడు, శ్రీశైలం వెంటనే మంజూరు అవుతాయని, నాగార్జునసాగర్‌కు ధోకాలేదని మన మంత్రులు చెబుతున్నారంటే, ప్రజల్ని మభ్య పెట్టడమైనా కావాలి, లేదా అమాయకత్వంతో కూడిన ఆత్మవంచనైనా అయిఉండాలి. ఈ ప్రాజెక్టులు ఆగవు అని వీరికి హామీ యిచ్చిం దెవరు, అటువంటి నమ్మకం వారి కెలా కలిగింది గుల్హాతీ సంఘాన్ని నియమిస్తూ కేంద్ర ఇరిగేషన్ ఉప మంత్రి శ్రీ హాథీ పార్లమెంటులో ప్రకటన చేసిన సందర్భంలో ఒక ఆంధ్ర సభ్యుడు లేచి "కృష్ణా, గోదావరి నదులపై ప్రస్తుతానికి కొత్త పథకాలు మంజూరు చేయరాదని కేంద్రప్రభుత్వం ఉద్దేశిస్తున్నదా అని అడగ్గా మంజూరైన ప్రాజెక్టులను కొనసాగించడం జరుగుతుంది. కొత్త పథకాలను మంజూరు చేయడ మన్నది, లభ్యం కాగల నీటిని బట్టి ఉంటుంది" అని ఆయన జవాబు చెప్పారు మంజూరై అమలులో ఉన్నవి నాగార్జునసాగర్ ప్రథమదశ, తుంగభద్ర హై లెవెల్ కెనాల్ ప్రథమ దశ ఈ రెండింటి, రెండవ దశలు, శ్రీశైలం పోచంపాడు ప్రాజెక్టులు మంజూరు కాలేదు ఇది గుల్హాతీ నివేదిక వచ్చేదాకా మంజూరు చేయడమన్నది లేదని శ్రీ హాథీ చెప్పనే చెప్పారు అంతేగాక 'లభ్యమయ్యే నీటినిబట్టి' కొత్త పథకాలను మంజూరుచేయడం జరుగుతుందని ఆయన చెప్పిన జవాబుకు అర్థం. నీరు తగినంత లేనట్లు గుల్హాతీ సంఘం తేల్చితే ఇవి శాశ్వతంగా మంజూరు కావనే 1951 ఒప్పందం ప్రకారం మాకు కేటాయించిన నీటితోనే ఈ కొత్త ప్రాజెక్టులను నిర్మించుకుంటాం అని ఆంధ్ర ప్రభుత్వం చెప్పినప్పటికీ, గుల్హాతీ సంఘం నివేదికకు,

(54 వ పేజీ చూడండి)

# మనమూ మనదేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## జఠరాశయము: దాని విధులు

జఠరాశయములో ఫండస్ అనీ, పైలోరస్ అనీ రెండు భాగములున్నవని యిదివరకే తెలుసుకున్నాము. జఠరాశయం పరిమాణంలో ముప్పాతిక భాగం ఫండస్ భాగమే. ఈ ఫండస్ అనే భాగం ముఖ్యంగా రెండు ప్రధాన ధర్మములు నిర్వహిస్తున్నది. ఈ భాగం అవసరమైనకొద్దీ సాగి 1½ లీటర్లు, అంటే సుమారు పెద్ద హార్లిక్సు సీసాన్నర పరిమాణం కలదై, జఠరాశయంలో ప్రవేశించిన ఆహారమును నిలవ చేయటానికి ఉపకరిస్తుంది. జఠరాశయంలో ప్రవేశించిన ఆహారం ప్రవేశించగానే జీర్ణంకాదు. అది కొంచెం కొంచెంగా జీర్ణం కావాలి. అంతవరకు, ఒకవంక జీర్ణక్రమం జరుగుతూవుంటే మరొకప్రక్కన అది నిలవ ఉండాలి. ఫండస్ రెండవ ధర్మం ఆహారమును జీర్ణంచేసే అనేక రసములలో చాలా వాటిని స్యంధించడం.

జఠరాశయంలో ఆహారం ప్రవేశించినకొద్దీ, ఫండస్ సాగుతూ ఉంటుంది. మ్రింగిన ప్రతి ముద్దా ఫండస్‌లో ఉన్న ఆహారం మధ్యలోకి పోయి, అంతకుముందు అక్కడ ఉన్న ఆహారాన్ని అన్నివైపులా దూరంగా నెట్టుతుంది. ఇందువల్ల ముందు తిన్న ఆహారం క్రమంగా ఫండస్ గోడకు అదమబడుతుంది. జఠరాశయం గోడలోపలి వైపున ఉన్న మ్యూకస్ పొరలో జీర్ణ రసములను ఉత్పత్తిచేసే గ్లాండులు ఉన్నవి. ఈ మ్యూకస్ పొర నునుపుగా ఉండక ముడతలుగా ఉంటుందని యిదివరకే తెలుసుకున్నాము. ఈ ముడతల వల్ల, జీర్ణరసములను స్యందించే ప్రదేశం వైశాల్యము చాలా అధికమవుతోంది. కొత్త ముద్ద కడుపులోకి పోయినకొద్దీ పాత ఆహారం జీర్ణ రసములను స్యందించే భాగానికి అదమబడి, వాటి ప్రభావంవల్ల కొన్ని రసాయనిక వికృతులు పొందడానికి అవకాశం కలుగుతుంది. ఫండస్‌లోకి పోయిన ప్రతి ముద్దా జీర్ణరసములను స్యందించే ఫండస్ గోడను సమీపించడానికి సుమారు 40 నిముషములు పడుతుంది. ఇది మితంగా తిన్నప్పుడు, అతిగా ఆహారం కడుపులో కుక్కినప్పుడు జీర్ణం మరింత ఆలస్యంగా జరుగుతుంది.

ఆహారం నోటిలో నమలబడుతున్నప్పుడు అక్కడ ఉండే ఉమ్మినీరు (లాలాజలం)లో ఉండే టయలిన్ (Ptyalin) అనే రసాయనిక పదార్థ ప్రభావంవల్ల ఆహారంలో ఉండే పిండి పదార్థం, కొన్ని మార్పులు చెందుతుంది. ఈ ఉమ్మినీటితో మిళితమై, ద్రోముగా ఉన్న ఆహారం అర్ధద్రవరూపంలో జఠరాశయంలోకి వెళ్తుంది. ఈ టయలిన్ ఒక జీర్ణకారక వస్తువు. ఇది ఒక ఎంజయము (Enzyme). తాముగా ఏమార్పు చెందకుండా, తమ ప్రభావానికి గురి అయిన వస్తువులలో అతి శీఘ్రంగా రసాయనిక వికృతులను కలిగించే వస్తువును ఎంజయములు అంటారు. జీర్ణాశయంలో ఇటువంటి ఎంజయములు చాలా స్యందింపబడతవి. టయలిన్ ప్రభావము వల్ల పిండిపదార్థం నోటిలోనే కొన్ని వికృతులు చెందుతుంది. నోరుదాటి ఆహారం ఫండస్‌లో ప్రవేశించిన తరువాత కూడా దాని ప్రభావం ఫండస్‌లో వున్న ఆహారం మధ్య భాగంలో పని చేస్తూనే ఉంటుంది. ఇందుకు అనుకూలంగా ఫండస్ గుండ్రంగా తిత్తిలాగా, సాగేదిగా నిర్మించబడింది. ఈ టయలిన్ క్షార గుణం కలది (Alcaline). అమ్లగుణం (Acid) వున్న వస్తువులతో ఇది పనిచేయదు. జఠరాశయం రసములలో హైడ్రోక్లోరిక్ ఏసిడ్ అనే ఆమ్లపదార్థం స్యందింపబడుతుంది. అయినా లాలాజలంలో టయలిన్ నశించకుండా దాని పని అది చేయడానికి ఫండస్ నిర్మాణం తోడ్పడుతుంది. ఈవిధంగా ఫండస్‌లో, ఆహారంలో ఉన్న పిండి పదార్థంలో నూటికి అరవైపాళ్ళు మారిపోతుంది.

ఫండస్‌లో యీ మార్పులు జరిగేక ఆహారం క్రమంగా పైలోరస్‌లోకి పంపబడుతుంది. ఈపని జఠరాశయంలో ఉండే కండరముల సంకోచ వ్యాకోచముల వలన ఏర్పడిన తరంగ చలనం (Peristatysis) ద్వారా జరుగుతుంది. ఈ తరంగచలనం సవ్యమైనప్పుడు అధోముఖంగా హృదయ ముఖద్వారం దగ్గర ఆరంభించి పైలోరస్ ద్వారం వైపుగా వెళ్తుంది. అపసవ్యమైనప్పుడు పైలోరస్ ద్వారం దగ్గర ఆరంభించి వెనక్కు వెళ్లి హృదయ ముఖద్వారం దగ్గర ఆగిపోతుంది. ఒక్కొక్కప్పుడు అల్లా అగక పైన ఉన్న యీసాఫెగస్‌లోకి పోయి, నోటిదాకా వెళ్తుంది. అప్పుడు వాంతి అవుతుంది.

ఫండస్ గోడలో అనేక ప్రదేశములనుంచి యీ తరంగ చలనం పైలోరస్ వైపుకు ఆరంభిస్తుంది. కాని పైలోరస్ ప్రదేశంలో ఉండే తరంగచలన శక్తి కంటె ఫండస్‌లో ఉండే తరంగచలన శక్తి దుర్బలమైంది. జఠరాశయంలో ఆహారం ఎంత అధికంగా ఉంటే యీ తరంగ చలనం అంత దుర్బలంగా ఉంటుంది. పై విషయములను అర్థం చేసుకొంటే మితంగా ఆహారం తీసుకోడం ఎంత అవసరమో తెలుస్తుంది. ఈ తరంగచలనం, జఠరాశయం కండరముల మధ్యన ఉన్న అనిచ్ఛాదీన నరాంతముల ద్వారా, మెదడు పంపే ఆదేశములవల్ల జరుగుతుంది. ఈ ప్రదే [illegible] లాగా ఏర్పడి ఉంటవి. ఇందువల్లనే ప్రతి కండరము స్వయంగా సంకోచ వ్యాకోచములు చేయగలిగిన శక్తి కలిగివుంటుంది. ఈ కండరముల చలనాలు అన్నీ ఒక సమన్వయంతో ఒక క్రమంలో జరగాలి. అనేక మనోవికారములతో మనస్సు వ్యాధిగ్రస్తమైనప్పుడు, మెదడునుండి వచ్చే ఆదేశములు ఎగుడు దిగుడై తరంగచలనం ఒక ప్రదేశంలో సవ్యమూ, మరొక ప్రదేశంలో అపసవ్యమూ అయి, కడుపులో పోర్లు ఏర్పడుతుంది. ఆహారంలో హానికరపదార్థములున్నా యింతే జరుగుతుంది. జీర్ణాశయంలో ఉన్న యీ నరముల వలకూ, మన స్థితికీ, ఉద్రేకాలకూ చాలా సంబంధం ఉన్నది. మానసిక వ్యాధులు అధికమవుతున్న యీ నాగరిక యుగంలో ఏర్పడే అనేక రకములయిన జీర్ణాశయ వ్యాధులు అర్థం చేసుకోవాలంటే యీ నరములను గురించి సమగ్రంగా తెలుసుకోవాలి. అది ఆ వ్యాధులను గురించి చర్చిస్తున్నప్పుడు వివరిస్తాను. జఠరాశయం ఉబ్బిపోయేటట్లుగా తిన్నప్పుడు ఈ నరములవల్ల నొక్కబడి మెదడునుంచి వచ్చే ఆదేశములను సరిగా కండరములకు అందజేయనందున కూడా తరంగచలనం దుర్బలమైపోతుంది. జఠరాశయం ఖాళీగా ఉన్నప్పుడు యీ చలనం హృదయద్వారం దగ్గరనుంచి ఆరంభిస్తుంది. నిండుగా ఉన్నప్పుడు ఫండస్ మధ్యనుండి ఆరంభం అవుతుంది. ఖాళీగా ఉన్నప్పుడు ఈ తరంగచలనం బలవత్తరంగా ఏర్పడుతుంది. అప్పుడే మనకు ఆకలి వేస్తుంది. ఆకలి వేయడం అనేది ఒక మానసిక అనుభూతి. జఠరాశయంలో ఆహారం అంతా డుయోడినంలోకి పోయిన తరువాత ఈ తరంగచలనం మరీ అధికంగా ఉండి, నెప్పి కూడా ఏర్పడవచ్చు. ఆ స్థితిని "ఆకలి నొప్పులు" అంటారు. సాధారణంగా ఆఖరు భోజనం తీసుకున్న తరువాత 18 గంటల తరువాత ఈ ఆకలి నెప్పులు అధికంగా ఆరంభిస్తవి. శరీరధాతువుల్లో జరిగే కార్యక్రమం అంతా, రక్తంద్వారా సరఫరా అయ్యే గ్లూకోజు అనే శర్కరాద్రవ్యం, ప్రాణవాయువు సంపర్కంతో దగ్ధమైనప్పుడు ఉత్పత్తి అయ్యే ఉష్ణశక్తివల్ల జరుగుతుంది. రక్తంలో గ్లూకోజ్ లేకపోతే మరణమే సంభవిస్తుంది. అందువల్ల రక్తంలో గ్లూకోజు తగ్గినా, మధుమేహం వంటి వ్యాధుల్లో, ఆ గ్లూకోజు అధికం ఉన్నప్పటికీ శరీరం అది వినియోగించుకోలేకపోయినా 'ఆకలి' అధికం అవుతుంది. శరీరానికి కావలసిన ఆహారం సమయానుకూలంగా అవసరాన్నిబట్టి సరఫరా చేయడానికి ఆకలి అనే అనుభూతి అత్యవసరం.

జఠరాశయంలో ఆహారం ద్రవరూపంలో పొందినప్పుడే, ఫండస్, దాని క్రిందవున్న పైలోరస్ భాగంలోకి పంపుతుంది. లేకపోతే పంపక జీర్ణక్రమం ఆలస్యం అవుతుంది. ఆహారం పూర్తిగా నమలక, గబగబా మ్రింగేవారు, నోటితో తేలికగా శీఘ్రంగా జరగవలసిన పనిని, జఠరాశయంచేత చేయించి ఆ ఉపాంగాన్ని వ్యాధిగ్రస్తం చేసుకుంటారు.

(సశేషం)




# సాందీపనిపర్వం - 34

సాందీపని పాఠమును ముగించెను. శిష్యులు శాంతి పాఠములను పఠించిరి. మహానందుడును వారితో ఆ శాంతిపాఠములను పఠించెను. సాందీపని తన ఆస్తరణమునువీడి, అగ్ని గృహములోనికి పోబోవుచుండెను. అప్పుడు మహానందు డాయనను సంబోధించినాడు.

"సాందీపనీ!"

"ఏమిరా! మహానందా!"

"సాందీపనీ! నేడు నేనొక పనిచేసినాను. అది చెడ్డదియో, మంచిదియో తెలియలేదు. నీవేమందువు?"

"చేసిన పని యేమియో చెప్పుము! నన్ను ఏమన మందువు?"

అందరును నవ్విరి. మహానందుడును నవ్వెను.

"సాందీపనీ! నీవు నన్ను అపహాస్యము చేయుచున్నావు. చేయుము. నేను చేయుపనియు అట్టిదిగానే యున్నది. పౌండ్రకుడు నీ శిష్యరికమునుకోరి వచ్చెను. నీవు తిరస్కరించితివి. వాడునన్ను గురువుగా వరించెను. నేనేమి యంటి ననుకొంటివి?"

"మహాప్రసాదమని అంగీకరించితివి. అవునా" అని వాడు సాందీపని.

"అచ్చముగా నా పనియే చేసినాను. నాకు అతని వాలకమంతయు నవ్వులాటలకువలెనుండినది. నన్ను అడుగుటయు నవ్వులాటలకనియే అనుకొన్నాను. నవ్వులాటలకుగా అంగీకరించినాను. ఆలోచించగా ఇది నా కంఠమునకు పోసికొనిన త్రాడువలె కన్పించుచున్నది. అది విన్నడుగుచున్నాను."

సాందీపని తీక్ష్ణుడయినాడు. ఇట్లనినాడు: "మహానందా! ప్రపంచములో నేదియు నవ్వులాటలకుగా జరుగదు. అంతయు ఒక క్రమము ననుసరించి, ఒక ఋతముననుసరించి జరుగుతున్నది. పౌండ్రకుడు నా దగ్గరకు వచ్చెను. నేను వానిని తిరస్కరించితినా! సంవత్సరము శుశ్రూష చేయుమంటిని. వానికి అది ఇష్టముకాలేదు. నేను తన్ను తిరస్కరించితి ననుకొన్నాడు. నిన్ను గురువుగా వరించినాడు. వాని భావ మేమనగా, తనకు గురువు కాగలవాడు, తన ఇష్టము చొప్పున వుండవలయునని. అందుకు నిన్ను చూచికొనినాడు. ఇందులో క్రమముకానిదేమున్నది? అతడట్లనే చేయుడు. అతని జీవితమట్లు నడచ వలయునని యున్నదిగో! ఎంతమంది క్షత్రియ కుమారకులు విద్యల నభ్యసించుటలేదు! వీనికే అట్టి బుద్ధి ఏల పుట్టవలెను! అన్నచో ప్రత్యుత్తరములేదు. అది వాని జీవితమున వ్రాసియున్న పద్ధతి. మరియు నీవు ఇప్పుడు వానిని తిరస్కరింతువుపో! వాడు నిన్ను వదలిపెట్టడు. మరి నన్నేల వదలిపెట్టెను? నిజము చెప్పుమందువా? నేను వానికి తగిన గురువుకాను. అది అతడు గ్రహించెను. మహానందా! వాడు కుశాగ్రబుద్ధి. ఉత్తమక్షత్రియుడు. కాశీ మహారాజునకు కాబోవునల్లుడు. వాడు నన్ను గురించి యన్నమాటలు విన్నావుగదా! వాడు నన్ను కాశినుండి వెడల నడపును. వానిమాట జరిగి తీరును. కాశిని వదలుట ఎట్లు! నా జీవితమంతయు నింత వట్టు నిక్కడ నడిపితిని. నా ముఖమున కాశికా విప్రయోగము వ్రాసివున్నది. అందువలన వానినోట నట్టిమాట వచ్చినది. అగస్త్యునంతటివానికి కాశికా వియోగము తప్పలేదు. నేనెంతవాడను. అది అటులుంచుము. ఇప్పుడు నీవు వాని శిష్యరికము నంగీకరించితివి. ఈ అంగీకరించుట అలవోకగా జరిగినది. నీవు ఇది బంధమనుకొనుచున్నావు. మహానందా! నీవు మనస్సన్న్యాసివి. నీకు బంధమేమిటి? నీవు అనుకొనుచున్నది. యేమనగా స్వధర్మము గూడ బంధమని అది నా భావముకాదు. ఎవడు తన్ను తాను ఎరుగుకొనెనో, వానికి ఏదియు బంధముకాదు. వాడు స్వధర్మము నాచరించుటయు బంధముకాదు. వాడు కాక మరియెవ్వడు స్వధర్మమును ఆచరించును. లోకములో నున్నంతవరకును ఆ ఆచరణము తప్పదు. మరియు నీవు బ్రాహ్మణుడవు. ఉత్తముడవు. ఉపాధ్యాయుడవును కాదగినవాడవు. నీవు లోకవృత్తము తిరస్కరించరాదు. తన్ను తానెరిగిన వాడెవడును తిరస్కరించడు. కర్మమును, ధర్మమును పరిత్యజించుట పరివ్రాజకులపని. మరి నీవు గృహస్థుడవు. అకామహతుడవు. నీవు పౌండ్రకునకు గురుత్వము నెరపుటయే ధర్మము."

ఇట్లు వన్యసించి సాందీపని శ్రీకృష్ణదేవుని దిక్కు చూచెను. శ్రీకృష్ణదేవుడు మందహాసము చేసెను. సాందీపని మరల ఇట్లనెను: "ఇక నేను అగ్ని కార్యమును నిర్వర్తించవలసియున్నది. బ్రహ్మచారులును భిక్షకు పోవలసియున్నది" అని ఆయన అగ్ని గృహమున ప్రవేశించెను.

మహానందునకు అప్పుడు ఏమి యనవలయునో తోచలేదు. తాను మనస్సులో ననుకొన్నమాటలనే సాందీపనియు చెప్పినాడు. ఆచార్యాణియు అట్లులనే చెప్పినది. ఆమె అట్లు చెప్పుటసరియే! పిల్లకు సంబంధము గూడ కుదిర్చినదట. ఆమె తన్ను బాగుగా గ్రహించినది. తాను ఏమియు పట్టనివాడు. అది తెలిసినవాడు. సాందీపనియు "మహానందుడా! నీవు గృహస్థుడవురా" అనినట్లు హెచ్చరించినాడు. ఆయనకు ధర్మమునందు మమకారముపోలేదు. తనకు పోయినది అనుకున్నాడు మహానందుడు. అతడు శ్రీకృష్ణదేవుని వంకచూచినాడు. శ్రీకృష్ణదేవుడు తక్కుంగల బ్రహ్మచారులతోగూడ భిక్షకు బయలుదేరగా ఆయత్తమగుచున్నాడు. ఆయనతో తాను గూడ భిక్షకుపోయినచో! ఈ కృష్ణునిచూచి నతి మొదలు తనకేమో తెలియని ఆనందము కల్గుచున్నది. తనకు ఒక్కనికే ఇట్లున్నదా! ఆశ్రమమున నందరకును అట్లనే వున్నది. కాశికు గూడ అట్లులున్నది, పౌండ్రకునకు కున్నదా! వానికు వాడు దేవుడు. వానికిలేదు. లోకమునకు వాడు విరుద్ధుడు వలెనున్నాడు. వానికి తాను గురుత్వమును నెరపవలయును! నేనును లోకమునకు విరుద్ధుడను. అందుచేతనే నా యీ గురుత్వము, అతని శిష్యరికము అనుకున్నాడు మహానందుడు.

"మహానందా!"

మహానందుడు తన్ను పలుకరించిన దెవ్వరాని చూచెను. ఆ చూపులలో శ్రీకృష్ణదేవుని మంగళవిగ్రహము నిండియుండెను.

"మహానందా!"

"శ్రీకృష్ణా!"

"ఆశ్రమ మృగము పౌండ్రకుని రథముక్రింద పడినదటగదా!"

మహానందునకు ఆశ్చర్యమయ్యెను.

"శ్రీకృష్ణా! నీకు ఎట్లు తెలియును!"

"నేను చూచినానయ్యా! వామాక్షి కడు విచారించినది. అలేడి బ్రతుకును. దానిని పౌండ్రకుడు తెచ్చియిచ్చును అని చెప్పదమనుకొన్నాను. వాడు ఎట్లులును తెచ్చియిచ్చును. ఇప్పుడు చెప్పుట యెందులకు అనుకొన్నాను."

మహానందుడు మాటలాడలేదు. అవును. శ్రీకృష్ణుడు కాశికకురాగా, పరమశివుడు ఆయనను ఘనముగా సన్మానించెను. అట్టివాడు చూడనిది యేమి? తెలియనిది యేమి?

"మహానందా!"

"శ్రీకృష్ణా!"

"నేను గురుకులమును వదలిపెట్టెడిలోగా వామాక్షికి వివాహము చేయింతును."

ఇదియు నతనికి విచిత్రమనిపించినది. శ్రీకృష్ణదేవునకు వామాక్షి యేమగును! ఆయన ఆమె నని చూచిన వరుడెవ్వడు? తన యీ ఆలోచనములేమి? తాను వద్దనుకొన్న ఆలోచనలు. తన సంగతియేమో తనకు పట్టదు. మరి తాను కనిన పిల్లల సంగతి యెట్లువట్టును! ఎందుకు పట్టవలయునని గూడ ఆతడనుకొనెను. ఎవరు ఎందుకు పుట్టిరో, అందుకు పుట్టిరి. అందుకు పెరుగుచున్నారు. అందుకు చనిపోవుచున్నారు.

"మహానందా!"

"శ్రీకృష్ణా!"

"నాతో గూడ వత్తువా!"

"తప్పకవత్తును"

"ఒక్క ప్రశ్నవేయుదునా!"

"అభ్యంతరములేదు"

"చనిపోవునది యెవరు?"

మహానందునకు మరల ఆశ్చర్యమయ్యెను. అతడు శ్రీకృష్ణదేవుని కన్నులతో కన్నులుంచిచూచెను. బ్రహ్మచారులు భిక్షలకు జోలెలతో బయలుదేరుచున్నారు. శ్రీకృష్ణుడును, మహానందుడును వారికి కొంచెము దూరముగా నడచుచున్నారు. మహానందుడనివాడు.

"అవును చనిపోవుచున్నది యెవ్వరు? ఎవ్వరును చనిపోవుటలేదు. వచ్చుచున్నారు. పోవుచున్నారు. ఈ వచ్చుటను, పోవుటను మాన్పుకొనవలయునని యీ

(53–వ పేజీ చూడండి)



# [illegible]

రంగభాషి

మూర్తి స్వతహాగా చాలామంచివాడే. చాలా తెలివైనవాడనికూడా చెప్పవచ్చు. అతనితో కాస్సేపు మాట్లాడిన వాళ్ళెవరైనా అతను చాలామంచివాడనే అభిప్రాయానికి సులభంగా వస్తారు. అతనికి చాలా విషయాల్లో తెలుసు. భక్తి, వేదాంతం మొదలైన వన్నీ అతనికున్నాయి. సంగీతాన్నానందిస్తాడు. సాహిత్యాన్ని విమర్శిస్తాడు. రాజకీయాల గురించి కూడా మాట్లాడుతాడు. ఎదుటివారి మనస్తత్వాల్ని తెలుసుకొని, వారికనుగుణంగా మాట్లాడుతాడు. కాని అతనిలో ఎక్కడ లోపముందోగాని, అతను నిలకడగా ఒక సంవత్సరం ఒక ఉద్యోగంలో వుండలేడు. అతని బంధుమిత్రులెవరికీ అతనంటే గౌరవంగాని, విలువగాని లేదు. ఆఖరికి అతని అత్తవారు కూడా అతనొక వ్యర్థుడనీ, అసమర్థుడనీ నిర్ణయించారు.

పెళ్ళవనంతకాలం మూర్తికి జీవనయాత్ర కొనసాగించడం అంత ఇబ్బందనిపించలేదు. అతని పెద్దన్నగారు పోస్టల్ డిపార్టుమెంటులో ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తున్నాడు. తల్లిదండ్రులు పోయిన దగ్గర్నుంచి మూర్తిని తానే చేరదీసి స్కూలుఫైనలుదాకా చెప్పించాడు. రెండుసార్లు దండయాత్రకొట్టి మూడవసారి అతికష్టంమీద అత్తెసరు మార్కులతో స్కూలు ఫైనలు అయిందనిపించాడు మూర్తి. అప్పటికి అతనికి ఇరవై ఏళ్ళు. మునిసిపల్ ఆఫీసులోనూ, జిల్లా పరిషత్తు ఆఫీసులోనూ, అక్టింగ్ ఉద్యోగాలు రెండు మూడు చేసి మానేశాడు. తరువాత టీ కంపెనీలోను, కంట్రాక్టర్లదగ్గరా కూడా కొన్నాళ్ళు ఉద్యోగాలు చేశాడు. ఒక్కటీ నిలకడగా చెయ్యలేకపోయేవాడు. కొన్నాళ్ళు చెయ్యడం, పై ఉద్యోగస్థుడు మంచివాడుకాదనో, పని చాలా కష్టమనో, ఏదో సాకు పెట్టి మానేసేవాడు. అలా దగ్గర దగ్గర పాతికేళ్ళ వయస్సు వచ్చేదాకా గడిపేసాడు. కొందరు బంధువులు మూర్తి అన్నతో మూర్తి గురించి మాట్లాడారు.

మూర్తి ఈవిధంగా సరియైన ఉద్యోగం లేకుండా వుండడం బాగులేదన్నారు. ఒకింటివాడైతే అతనే దార్లోకి వస్తాడన్నారు. పెళ్ళయితేనేగాని బాధ్యత తెలియదన్నారు. మూర్తికి పెళ్ళి చెయ్యవలసిన బాధ్యత అతని అన్నగారిమీదేవుందన్నారు. చివరికి మూర్తిచేత మూడు ముళ్ళూ వేయించారు.

వివాహమైన రెండు మూడు నెలలుదాకా మామూలుగా సరదాగానే గడిచింది. కాని తరువాత కొన్ని సమస్యలు ప్రారంభమయ్యాయి మూర్తికి. మూర్తి భార్యకి పద్దెనిమిదేళ్ళుంటాయి. ఆ అమ్మాయి వెంటనే తనని తీసికెళ్ళి కాపురం పెట్టమనిభర్తకు చెప్పసాగింది. మూర్తి మామగారు, అల్లుడు వెనక కొన్ని ఉద్యోగాలు ప్రయత్నించి విడిచిపెట్టేశాడని తెలుసుకున్నారు. ఏదైనా మంచి ఉద్యోగం వేయించి కూతుర్ని దగ్గరలో వుండేట్టు చూద్దామని ప్రయత్నించాడు. ఆ వూళ్ళో ఒక హైస్కూలుంటే, అందులో గుమస్తాగా వేయించాడు. మూర్తి పని జీతాలు కట్టుకొని రశీదు లివ్వటం. ఒక సంవత్సరం తిరిగేసరికి, అనేకమంది కుర్రాళ్ళు కట్టిన జీతాలు పుచ్చుకుని, మూర్తి జేబులో వేసుకొన్నాడనీ, రశీదు లివ్వడం మానేశాడనీ రిపోర్టువచ్చి మూర్తి ఉద్యోగానికి వుద్వాసన అయిపోయింది.

అయితే ఈ అపహరించిన సొమ్ము ఏంచేశాడో ఎవరికీ తెలియదు. ఎందుకంటే మూర్తి ఇంటికింద ఒక నయాపైసాఅయినా ఎక్కువ ఖర్చు పెట్టలేదు. అదీకాక మూర్తికి ఒక్క బీడీ కాల్చడం తప్ప మరే దుర్వ్యసనాలూలేవు. పోనీ ఆ డబ్బు ఎవరికైనా ఇచ్చాడా? అంటే అదీ కన్పించదు. మొత్తానికి డబ్బు విషయంలో మూర్తి ప్రమాదకరమైన వ్యక్తి అని అతని మామగారు గ్రహించారు.

మళ్ళీ రెండు మూడు నెలలు ఖాళీగా కూర్చున్న తరువాత మూర్తి వుద్యోగ ప్రయత్నం ఆరంభించాడు. అతని అన్నగారికి తెలిసిన ప్లీడరొకాయన రాబడి బాగా వుండడంవల్ల మునుపు ఒక గుమస్తా వుంటే ఇప్పుడు ఇద్దరు గుమస్తాలు వుండడం అవసరమని ఎవరినైనా చూసిపెట్టమని అతని అన్నగారి నడిగాడు. ఆయన ఎలాగా మూర్తి ఖాళీగా వున్నాడుకదా అని ఆయన దగ్గర మూర్తిని జేర్చాడు.

ఆ ప్లీడరుగారిపేరు సత్యానందంగారు. ఆయన మంచిపేరుగల ప్లీడరే. అయితే ఆయనకు ఐహికాని కన్నా ఆముష్మికంమీద దృష్టి ఎక్కువ. ఎవరైనా వేదాంతం మాట్లాడితే వాళ్ళని నెత్తిమీదపెట్టుకుంటాడు. సన్యాసులూ, సాధువులూ కన్పిస్తే వాళ్ళతో ఏవో నాలుగు మంచి ముక్కలు మాట్లాడందే వదలడు. ఇంట్లో దేవతార్చనా, పూజా వగైరాలేమీ లేకపోయినా, ఆయన అల్లాటి కర్మలకు ప్రాధాన్యం ఇవ్వకపోయినా, వేదాంత విషయాలు ఆయనకు తెలిసినంత మరెవ్వరికీ తెలియవు. అప్పుడప్పుడొకరిద్దరు సన్యాసులు వచ్చి రోజులకొద్దీ ఆయనింట్లో మకాం వేస్తుంటారు. సత్యానందంగారికి, ధ్యానం, ప్రాణాయామం వగైరాలు చెయ్యడానికి తీరుబాటు లేకపోయినా, ఆయనకు కలిగే అనుభవాలూ, స్వప్నాలూ ఆయన్ని చాలా పెద్ద స్థాయీ సాధకుల్లో ఒకరిగా చేర్చాయని ఆయన గురువుగారి నిర్ధారణ. గురువంటే, ఈ సన్యాసుల్లో ఒక సన్యాసి. ఆయన వచ్చినప్పుడల్లా, పాలూ పళ్ళూ విపరీతంగా ఆయనకి సరఫరా అవుతూండడం, ఆయన సత్యానందంగారికి జ్ఞానామృతాన్ని సరఫరా చేస్తూండడం మామూలు.

సత్యానందంగారికి పిల్లలులేరు. ఆయన భార్యకు ఆ దిగులు హెచ్చు. ఆమెకు ఈ వేదాంతుల్నిచూస్తే చాలామంట. వీళ్ళ మాయలో పడి భర్త ఎక్కడ ప్లీడరీ ప్రాక్టీసు సరిగ్గా చెయ్యడో! అని ఆమె దిగులు. డబ్బుమీద ఆమెకు విపరీతమైన ఆశ. బోలెడంత బంగారం ఆమె వంటిమీదవుంది. అయినా ఆమెకు తృప్తిలేదు. ఈ సాధువులూ, సన్యాసులూ ఈ పాడి వేదాంతపు కబుర్లు చెప్పకపోతే, కాస్త బంగారం తయారయ్యే విధానమో, లేకపోతే సంతానాన్ని కలిగించే యోగమో చెప్తే బాగుండుననుకుంటూంటుంది.

సత్యానందంగారి భార్య తమ్ముడు ప్రసాద్‌కు ఇరవై యేళ్ళుంటాయి. అతనూ స్కూల్‌ఫైనల్ ఎలాగో కష్టపడి పాసయి కాలేజీలో ఆ యేడే చేరాడు. అతనికి వాళ్ళక్కయ్య కన్నా, డబ్బు తొందరగా సంపాదించి దాంతో పెద్ద బిజినెస్సు (సినిమా తియ్యడం లాటిది) పెట్టాలని చాలా ఆతృతగావుంది. క్రాసువర్డు పజిల్సూ, లాటరీలూ, బ్రాకెట్లూ మొదలైన రంగాలన్నీ అతను ఆక్రమించుకొన్నాడు. ఏనాడైనా ఒక చిన్న లక్కీ ఛాన్సు అంటే ఒక లక్ష రూపాయలు తగలదా! అని ప్రసాద్ ఆశ.

మూర్తికి సత్యానందంగారి ఇంటి వాతావరణం బాగా సరిపోయింది. సత్యానందంగారితో వేదాంతం, భక్తి మొదలైన కబుర్లు చెప్తూంటాడు. ఆయన భార్యతో డబ్బు సంపాదించే బిజినెస్సులూ వగైరాల మాటలు చెప్తుంటాడు. ప్రసాద్‌కి బ్రాకెట్‌లోనూ పజిల్సులోనూ అమూల్యమైన సలహా లిస్తూంటాడు.

ఒకనాడు సత్యానందం చుట్టం రామస్వామిగారనే ఆయన వచ్చారు. ఆయనకు పదహారేళ్ళ అమ్మాయివుంది. ఆ అమ్మాయిని ప్రసాద్‌కి ఇద్దామని, ఆయన సత్యానందంగారితో మాట్లాడదామని వచ్చాడు. సాయంకాలం అయిదు గంటలకి సత్యానందం ఇంటికి వచ్చాడు.

రామస్వామిగారు వస్తూనే ఒక చిన్న కూనిరాగం తీస్తూ వచ్చారు. కోర్టునుంచి తొందరగా వచ్చేసిన మూర్తి ఆయనకు కన్పించాడు. సత్యానందంగారు కోర్టునుంచి వచ్చేవేళయిందనీ, కూర్చోమని చెప్పాడు ఆయనతో. రామస్వామిగారు కూర్చొని తనలో తాను రాగాలాపన చేసుకుంటున్నాడు. మూర్తి కొంచెంసేపు విని, రామస్వామిగారితో "మీరు బాగా పాడ్తారులా వుంది?" అన్నాడు.

"మీకెలా తెలుసు?" అని అడిగాడు రామస్వామిగారు.

"ఆఁ! దానికేంలెండి. అసలు పాటకుల్ని చూడగానే పోల్చొచ్చు" అన్నాడు మూర్తి, రామస్వామిగారిలో పాటకుడి లక్షణాలు తను పోల్చినట్లు.

రామస్వామిగారిమొహంలో చిన్న మందహాసరేఖ మెరిసింది. ఆయనకు ఏభయ్యేళ్ళుంటాయి. జుట్టు

(46-వ పేజీ చూడండి)



# వనితా వాణి

## గొడుగు

అడవిలో పులి మనిషిని చూచిన వెంటనే మీద పడుతుందే కాని నిశ్చేష్టంగా కూర్చోదు. అందు లోను గొడుగు అడ్డుపెట్టి వక్కకు తప్పుకొని జారుకొనునప్పుడు, పులి కళ్ళు మూసుకొని కూర్చొ మనా! దాని నాసికా రంధ్రము ఉచ్ఛ్వాసములేక మొద్దుబారినదా! పెద్దపులి గొడుగును చూచి మనుష్యుడనుకోవడం శుద్ధ పొరపాటు కాదా!

చక్రవర్తి వైదేహి (నెల్లూరు)

## కోతలు

పాతులూరి రాజ్యలక్ష్మిగారు వ్రాసిన కోతలు అన్న వ్యాసము చాలా బాగున్నది. మా వూరిలో ఒక ఆమె ఉన్నారు. వారి ఇంటికి ఎప్పుడైన వెడితే ఆవిడ కోతలతో, వూపిరి సలువదు. ఎప్పుడో పెట్టు కొన్న నగల గురించి, బట్టల గురించి ఆమె గొప్ప లకు అంతు ఉండదు. ఆవిడ మాట్లాడుతున్నంత సేపు ఎప్పుడు బయటపడుదుమా అనిపిస్తుంది. ఈ వ్యాసము చదివిన తరువాతైనా కొంచెం తగ్గించుకొంటారని ఆశించవచ్చు. రచయిత్రి గారికి ధన్యవాదములు.

ఎ. సరోజినీ సత్యన్నారాయణరాజు
(దేవరపల్లి)

*   *   *

'కోతలు' వ్యాసం నన్నెంతగానో ఆకర్షించింది. రాజ్యలక్ష్మిగారు అన్నట్లు ఈ కోతలు ఎవరినీ బాధించవు కాబట్టి సరిపోతోంది. ఈ కోతలు కోసే వాళ్లని చూస్తుంటే వాళ్లమీద నాకు కోపం వచ్చే బదులు జాలి కలుగుతుంది. వీళ్ళు ఎదుటి వాళ్ళు వట్టి ఏమీ తెలియనివాళ్ళు అన్నట్టు కోసేస్తూ ఉంటారు.

మాకు తెలిసున్న ఒకాయన ఉన్నారు. ఆయన మా యింటికి అప్పుడప్పుడు వస్తూంటాడు. ఆయన ఒక్క నిముషం కూడా కోతలు కొయ్య కుండా కూర్చోలేడు. ఈయనకి కాస్త జ్యోతిష్యం కూడా వచ్చు. "నేను జ్యోతిష్యం చెప్పాను సంజీవ రెడ్డి కాంగ్రెస్ ప్రెసిడెంటు అవుతాడని. సంజీ వయ్యకు జ్యోతిష్యం చెప్పి ముఖ్యమంత్రిని చేశాను. నేను హైదరాబాద్ వెళ్తే మంత్రులు అందరూ నన్ను కౌగలించుకొని పంతులుగారు మీరే వచ్చారా? కబురు పంపుతే మీ దగ్గరకు మేమే వచ్చేవాళ్లముగా అంటారు." అని కోస్తూ ఉంటాడు ఆయన. ఈయనని మేము సుబ్బా రాయుడుగారు అని పిలుస్తుంటాము. ఈయనకి ఒక కొడుకు ఉన్నాడు. ఎల్లాగో కష్టపడి బి. ఎ. చదివించాడు కొడుకుని. మీ అబ్బాయికి మంత్రు లతో చెప్పి మంచి ఉద్యోగం వేయించకూడదా అని మేము అంటే, వాళ్ళు వేయిస్తానన్నారమ్మా కాని అది ఎవడికి కావాలి అంటాడు ఈయన.

కొడుకు సంపాదిస్తూ కూడా కానీ ఇంట్లో ఇవ్వకపోయినా, ఈయన ఇంట్లో వస్తు పడు కొంటున్నాసరే ఈయన వేలకువేలు ఖర్చు పెడు న్నట్లు చెప్తుంటాడు. ఈలాంటివాళ్లని చూస్తే జాలి కాక మరేమిటి.

పి. కె. ఎం. లక్ష్మి (విశాఖపట్నం)

*   *   *

మేము కలకత్తాలో ఉండేటప్పుడు మాయింటి ప్రక్కావిడ ఒకసారి మా యింటికి వచ్చింది. కోతలు కోయడంలో ఆవిడకు ఆవిడే సాటి. అవి యితరవాళ్ళు నమ్ముతున్నారా? లేదా? అని ఆవి డకు అక్కర్లేదు. నాతో మాట్లాడుతూ ఆవిడ 'మా అల్లుణ్ణి మన గవర్నమెంటువారు అమెరికా పంపుతా నన్నారు. మా అమ్మాయి, వాళ్ళ నాన్న గారు కూడా అందుకు ఒప్పుకున్నారు. కాని నేనే 'వద్దు, నాయనా,' అక్కడ మన కూరలు, బియ్యం దొరకవు. ఆ వెధవ రొట్టెలు తిని ఎన్నాళ్ళుంటావు మనలాంటివాళ్ళు అక్కడ ఉండలేరు అని బల వంతంచేసి ఆపుచేసేశాను. నామాట ప్రకారం అతను నేను వెళ్లనని గవర్నమెంటువారికి వ్రాసే శాడు'. ఇలాగే ఒకసారి ...... ఇలా గొప్పలు కొయ్యడం మొదలుపెట్టింది. 'ఈ ఆడంబరాలకూ —కోతలకు ఎక్కువ ప్రాముఖ్య మిచ్చేది మన ఆడ వాళ్ళే' అని పాతులూరి రాజ్యలక్ష్మిగారు వ్రాసినది అక్షరాలా నిజం.

ఆచంట లలిత (గుంటూరు)

*   *   *

పాతులూరి రాజ్యలక్ష్మిగారి "కోతలు" చది వేను. రచయిత్రి స్త్రీలయందు పక్షపాతం చూపించ కుండా సహజంగా జరిగే విషయాలను చక్కగా విమర్శించారు. ఆమె రచనలో నూటికి తొంభై పాళ్ళు సత్యం వుంది. నాకు నచ్చింది. రచ యిత్రికి నా అభినందనలు.

అడవి నాగమణి (ఏలూరు)

*   *   *

"కోతలు" అన్న వ్యాసం నన్ను చాలా ఆకర్షిం చింది. తీరా ఆ వ్యాసం చదివి చూస్తే సోదరి అను భవంపీఱు వ్రాసినట్టున్నారనిపించింది. లేనిచో అంత చక్కగా ఊహించి వ్రాయడం కష్టం. ఈ వ్యాసం చదివి కోతలరాయుళ్ళు కాస్త కోతలు కోయడం మానివేస్తారని నా నమ్మకం. లక్ష్మిగారికి నా అభివందనములు తెలియపరుస్తున్నాను.

కె. బి. రాజగౌడ్ (కరీంనగరం)

*   *   *

పాతులూరి రాజ్యలక్ష్మిగారు వ్రాసిన 'కోతలు' అనే వ్యాసం చాల బాగుంది. ఇట్లాగే మా చుట్టా లావిడ ఒకావె ఉంది. ఆవిడ కోతలు కోటలు దాటిపోతాయి. ఒకసారి ఆవిడ మేము ఒకేరకం జాకెట్టుగుడ్డ కొన్నాము. ఆవిడ మా యింటికి వచ్చింది. మేము కొన్న గుడ్డ చూపించి గజం రెండు రూపాయలకు కొన్నాము బాగుందా అన్నాం. ఆవిడ చటుక్కున అయ్యో నేను ఇటువంటిదే పావులా తక్కువ ఎనిమిదికి కొన్నాము. మీకు ఇంత చవగ్గా ఎట్లా ఇచ్చాడో అంది. ఇటువంటి కోతల రాయుళ్ళు ఈ వ్యాసం చదివైనా కోతలు కోయడం తగ్గించుకుంటే చాల మంచిది. ఈ వ్యాసం రాసిన రాజ్యలక్ష్మిగారికి పత్రిక ద్వారా నా ధన్యవాదాలు. ఇంకా ఇటువంటి వ్యాసాలు పత్రికకు వ్రాస్తారని ఆశిస్తున్నాను.

సి. హెచ్. ఎస్. లక్ష్మి (తాటిపాక)

*   *   *

"కోతలు" చాలా బాగున్నది. ఎదుటివారు తమని గొప్పగా భావించవలెననే భావము గల వారిలో ముఖ్యంగా ఆడంబరపు వ్యక్తులలో యీ కోతలు వ్యసనం ఎక్కువ. రాజ్యలక్ష్మిగారు వ్రాసినట్లు వారివారి మనస్సులలో ఒప్పుకొన్నా అంత తేలికగా వారిలోనుండి పోదు. ఆడంబరాన్ని వదులుకొంటేనే గాని, యీ కోతల ప్రోత పోదు.

డి. సరస్వతి (బరంపురం)

*   *   *

ఆమె చిన్నతనంలో ఒకాయన మూరెడు (అడుగున్నర) చుట్ట కాలుస్తూ పంచాయితీబోర్డు ఆఫీసు ముందు కూర్చొని కోతలు కోస్తూ ఉన్నాడంటే అది నమ్మదగిన విషయమేనా? ఇంతవరకు మూరెడు చుట్ట కాల్చేవార్ని చూచి ఎరుగను. ఎవరు కూడా చూచి ఎరుగరు.

సి. హెచ్. లక్ష్మీకాంతమ్మ (కొత్తగూడెము)

*   *   *

ఇప్పుడు జరుగుతున్న సంగతులే వ్రాసినారు. చాలా మంది అవతలవాళ్ళు ఏమనుకుంటారో అనిఅయినా అనుకోకుండా ఇష్టంవచ్చినట్లల్లా కోతలు కోస్తూ ఉంటారు. కొంతమంది మనం మాట్లాడుతున్న మాటలు వింటున్నారో లేదో కూడా గ్రహించ కుండా మాట్లాడుతూ వుంటారు. అలాంటివారికి ఇది చదివిన తరువాత కనువిప్పు కలుగుతుందను కుంటాను.

యస్. రంగనాయకి (పర్లాకిమిడి)

*   *   *

# చదువుకున్న అమ్మాయి

మందరపు లలితగారు వ్రాసిన "చదువుకున్న అమ్మాయి" అను వ్యాసము చాల చక్కగా ఉన్నది. మన దైనిక జీవితంలో చదువుకున్న అమ్మాయిలు ఎదుర్కొనే సంఘటనలను కళ్ళకు కట్టినట్లు వ్రాసినారు. వ్యాసము చదువుతుంటే నాకు పాత సంఘటన ఒకటి జ్ఞాపకము వచ్చినది. నాకు పెళ్ళిఅయిన కొద్ది రోజులకే వినాయకచవితి వచ్చినది. పూజకంతా సిద్ధము చేసి మావారిని, మా రెండిళ్ళ ప్రక్కనున్నవారినడిగి వాళ్ళ పూజఅయితే పూజా పుస్తకము అడిగి తెమ్మన్నాను. మావారు తీరావెళ్ళి అడిగితే "మీయింట్లో కూడా పూజవుందా! చదువుకున్నావిడ పూజలవీ అవుట్ ఆఫ్ ఫేషన్ అని పూజ చేస్తుందో లేదో అనుకున్నాను" అని ఆయింటి పెద్ద, పెద్ద డిగ్రీలుగలఅతను అడిగారట. నిజంగా నాకు ఇది వినేసరికి చాల బాధ కలిగింది. చదువుకుంటే మరి దేవుడు, భక్తి ఇటువంటివి అక్కరలేదనీ కాబోలు ఆయన ఉద్దేశము. ఇటువంటి మనుషుల నెంతోమందినో చదువుకున్న అమ్మాయిలు ఎదుర్కొనవలసి వస్తుంది.

జయంతి వెంకటసీత ( బరంపురం)

* * *

"ఈ కట్నం డబ్బుల్లో నాలుగో వంతు కూడా ఖర్చు య్యేదికాదు" అనేమాటలు నా ఫ్రెండు విషయంలో నిజం. ఇంత చదువు చదివినప్పటికి కాంతుని దాసీలే అనే పదాలు గుర్తుకొస్తవి. ఏదైనప్పటికి వంటిల్లుదాస్యం వదలదు. ఇంత చదువుకొని వుద్యోగంలో ప్రవేశిస్తే ఇటు ఆఫీసు గొడవలు, అమ్మలక్కల సూటిపోటి మాటలు, ఇంట్లో భర్త, పిల్లల గొడవలతోను సరిపోతుంది. ఇది చదువుకునే అమ్మాయిలకు గుణపాఠంలాగుంది. కొద్దిగా చదువుకొనివుండటమే చాల ఉత్తమమని అంటాను. మీ సలహాలు ఏమిటో?

ఉడతా రామతులశమ్మ ( విజయువాడ )

* * *

చదువుకున్న అమ్మాయి వ్యాసం చాల బాగుంది స్త్రీ ఎంత విద్యావంతురాలైనప్పటికీ వంట చెయ్యక తప్పదు. ఎక్కడో ధనవంతుల ఇండ్లలో అయితేతప్ప మన మధ్యతరగతి కుటుంబాలలో స్త్రీకి భర్త సంరక్షణ, పిల్లలపోషణ, వంట ఇవి తప్పవు. ఎవరి వీలునుబట్టి వారు చదువుకోడానికి ఏ అభ్యంతరము లేదు. చదువు స్త్రీ, పురుషులకు విజ్ఞానమునకే గాని సంస్కార విహీనమైన పనులు చేయుటకుకాదు.

పరిమి సీతాతిలకం ( వాల్తేరు )

* * *

"చదువుకున్న అమ్మాయి" అన్న వ్యాసము చాలా సహజంగావుంది. ఉదహరించిన సంఘటనలన్ని మా కుటుంబములోని విద్యార్థినులందరికి స్వానుభవాలే ! కారణం మా ఇంట్లో మగవారే కాక, బంధువర్గంలోను, మాఇంటి ఇరుగుపొరుగులోను, చదువుకున్నవాళ్ళు, ఎక్కువ లేకపోవడం, ఉన్నా, చిన్న చిన్న తరగతుల్లోనే, 4, 5 సార్లు తప్పడం. అందువల్ల అందరూ మా చదువు మీద నిరసన వచనాలు పలికేవారే. అందుకు మా జవాబు ఒక వేడి నిట్టూర్పు మాత్రమే! పరీక్షలలో ఉత్తీర్ణులవడం, తప్పడం విషయంలో లోటుపాట్లు విద్యార్థి, విద్యార్థినులు అందిరిలోను ఉంటాయి. కేవలం విద్యార్థినుల ఉత్తీర్ణతలోనే లోట్లుఎన్ని ఎగతాళిగా పలకడం అనునది అవివేకం. స్త్రీ, పురుషులకు సమాన హక్కులు" ఉండాలని దిన దినం స్టేజీల మీద ఉపన్యాసాలు. సమత్వానికై ప్రయత్నించి విజయము పొందిన కొందరు మహిళలను చూస్తున్నాం. వింటున్నాం. మరొకప్రక్క ఆడవారి చదువు గురించి అలా నిరసన వచనాలు పలుకడం అసభ్యకరం అగౌరవపరచడం వంటిది. "చదువుకున్న అమ్మాయి"కి గల సహజశక్తిని, చదువుకున్న అమ్మాయిపడే అంత: సంఘర్షణను పాఠకులకు ఎరుకపరచిన మందరపు లలితగారికి నా హృదయపూర్వక వందనములు.

శ్రీమతి సరోజాదేవి (పాలై)

* * *

తాను ప్యాసయినందుకు పక్కవాటాలోని ఆవిడ చూపిన ఓర్వలేనితనము, అవతల డాబాయింటి ప్లీడరుగారు చూపిన నిరసన, ఇంటర్వ్యూలోని అబ్బాయి ప్రశ్నలు, తీరా పెళ్ళినాటికి పెళ్ళికొడుకు అడిగే కట్నము, పావుగంట లేటుగా పనిలోనికి వెళ్ళేసరికి కొలీగ్సు చీదరింపు, ఫైళ్ళు తిరగవేసే అమ్మాయి అంట్లతో అవస్థపడటం, మెటర్నటీ లీవుపెట్టినపుడు అధికార్ల విసుక్కోవడం చక్కగా వివరించేరు మందరపు లలితగారు. చాలవరకు సహజంగానే ఉన్నాయిగాని ప్రస్తుత రాజ్యాంగ విధానాన్ని ఆకళింపు చేసుకొన్న ప్లీడరుగారివంటి చదువుకొన్న వాళ్ళు చూపిన నిరసన, చదువుకోని వాళ్ళయినా ఆడవాళ్ళ ఓర్వలేనితనము, కొంచెం ఆలోచింపదగినది ఇక్కలి విచారణీయముగా ఉన్నాయి. ఇలా ఇలాంటివారు వున్నారా అని పిస్తుంది.

పి. సూర్యకుమారి (కొత్తవలస)

* * *

నిజంగా ఈకాలంలో చదువుకొన్న అమ్మాయిని గురించి పాతకాలపు మనుష్యుల అభిప్రాయాలు చాలా చిత్రంగా వుంటాయి. నేనొకరోజు సరదాకి నా స్నేహితురాలు ఇంటికివెళ్ళాను. వాళ్ళమ్మ ఏదో సందర్భంగా "కాలేజీలో చేర్తారా?" అని అడిగింది. నేను మాట్లాడలేదు. ఆమెయే మళ్ళా "నాకు తెలియక అడుగుతా ఆడవాళ్ళు చదువుకొని ఉద్యోగాలు చేయాలా, ఊళ్ళేలాలా? ఇది ఒక డబ్బుఖర్చు"అంది నా కింకేమీ మాట్లాడబుద్ధిపుట్టలేదు. ఏమిటి వీళ్ల మన:ప్రవృత్తి. పోగానే ఎదురైంది. నేనేమీ మాట్లాడకుండానే ఒక్కమాటతో పంపించేసిందే అనిపించింది. నిజంగా ఇటువంటివారిని మంచిగా మార్చేందుకు లలితగారు వ్రాసిన వ్యాసం ఎంతైనా ఉపయోగపడుతుంది

తులజ ( కడప ) ★

ఎప్పుడూ ఇంతే—106

శంకర్



సి. కృష్ణకుమారి

# నగల మోజు

ఆడతివలకు నగలంటే తగని మోజు' అంటారు అయినవారు, కానివారూ కూడా.

"అసలు ఆడవాళ్ళు బంగారంతో పత్రం చేయించినా మెళ్ళో వేసుకుని తిరుగుతారు" అనేవారు తాతయ్య సనాతనకాలంలో. ఈ కాలంలో ఆ తాతయ్యే గనుకవుండి, ఆ మాటలే అనివుంటే నేనుమాత్రం వూరుకునేదాన్నికాదు సుమండీ! 'కాదు' అనే దాకా వాదించీ మరీ తాతయ్యచేత వప్పించేదాన్ని. ప్చ్! యేం లాభం! ఆ తాతయ్య ఆమాట లనేటప్పటికి నేను పదేళ్ళపిల్లను.

తాతయ్యకాలంనాడు ఆడవాళ్ళు, కంటె, కాసుల పేరూ, వడ్డాణంవంటి బరువు వస్తువులు ఆభరణాలుగా ధరించేవారు. అందుచేతే తాతయ్యచేత ఆ మాటలు పడవలసి వచ్చిందేమోననే అనుమానం నా మనస్సులో కలగకపోలేదు. ఈ నాడు మనకు ఆ వస్తువుల పేర్లు చెబితేనే ఒళ్ళు గరిపొడుస్తుంది. పైగా తేలిగ్గా "నెక్‌లెస్" లేక "సన్నటి గొలుసు" మాత్రం వేసుకోవటం ఫాషను.

ఆనాడు (పూర్వకాలం) ఆడవాళ్ళు మెళ్ళో, వంటిమీద ఎంత ఎక్కువగా బంగారంవుంటే అంత గొప్పగా, అంత ఘనంగా భావింపబడేవారు. ఇరుగు పొరుగుల్లో, బంధువర్గంలో కూడా 'ఫలానా వదిన భాగ్యవంతుల ఆడపడచమ్మా, ఎన్ని నగలు, ఎన్ని పట్టు చీరెలు అబ్బ! ఆ నగలన్నీ పెట్టుకుని, ఆ పెద్ద పట్టుచీరె కట్టుకుని పేరంటానికివస్తే అచ్చంగా లక్ష్మీదేవి లాగానే ఉంటుంది" అనుకునేవారు. అందలం ఎక్కించేవారు పొగడ్తలతో. ఆడవాళ్ళ మోజుకు తగ్గట్టే మగవారు పస్తులు పడుకునైనా పెద్ద వస్తువులు చేయించి పెట్టేవారు.

అయితే ఆడవాళ్ళకు నగల మోజు సహజమైనదా లేక వడమంతరపుసిరిలాంటి వ్యామోహమా అనే ధర్మ సందేహం ఎవరికైనా, జీవితంలో యెప్పుడైనా ఒకసారి కలగక మానదు.

దానికి జవాబు లేకపోలేదు. అసలు డబ్బు సంపాదన మగవారికోసం పుట్టినట్లు, బంగారం ఆడవాళ్ళ వంటిమీద ఆభరణాలుగా ధరించటంకోసమే ప్రపంచంలో వెలిసిందని చెప్పవచ్చు. ప్రాచీన కాలంలో మనదేశంలో సింధూ నాగరికతాకాలంనాడే ఆడవాళ్ళు బంగారు, వెండి నగలు ధరించేవారని ఆధారాలు తెలియజేస్తున్నవి. అప్పటినుండీ తర తరాలుగా రాచకన్నెల మొదలు సామాన్య బాలికలవరకు బంగారం, వెండి, ముత్యాలు, పగడాలు, పూసలు వీటితో తయారైన నగలు ధరించటం ఆడవాళ్ళకు ఆచారం, అలంకారమూ కూడా అయింది. రాజులు రాజ్యాలేలిన కాలంలో మగవారు కూడా ఆడవారినిమించి కిరీటంనుండి కత్తి ఒర వరకు, మణిహారాలు మొదలు పాన పాత్రలవరకు బంగారంతో చేయబడిన వస్తువుల్నే వాడేవారు. ఈ కాలంలో మగవారు, ఉంగరం, వాచ్ 'చెయిన్'వంటి బంగారపు వస్తువుల్ని పెట్టుకుంటూనే వున్నారు గదా! మగవారికే పూర్వంనుండి నగలమీద ఇంత మోజువుంటే, అలంకారానికి మారుపేరైన ఆడవాళ్ళకి 'బంగారం'మీద మోజు వుండటంలో అసహజం యేమీలేదు. 'స్త్రీ' అంటే 'ప్రకృతి' అంటారు కవులు (నేనుకాదు సుమండీ!). ప్రకృతి కన్య పూలతోను, పండ్లతోను అలంకరించుకుంటేనే కన్నుల కింపుగా, కలకలలాడుతూ వుంటుంది. 'అలంకార ప్రియ' అయిన స్త్రీ నగలు ధరిస్తేనే అందం, హొందా కూడాను. అందుచేతే ఆడవాళ్ళు బంగారపు నగలు చేయించుకునే తాహతులేక పోతే కనీసం 'గిల్టు' నగలో, పూసల దండలో వేసుకుని నగలమోజు తీర్చుకుంటూ వుంటారు.

ఈ కాలంలో వంటిపేటగొలుసు, లేక నెక్‌లేస్ ఎడంచేతికివాచీ, కుడిచేతికి రెండు లేక నాలుగు బంగారపు గాజులు మాత్రం నగలుగా ధరించటం ఫాషను. ఇట్లా ఈనాటి అమ్మాయి తయారయితే అమ్మమ్మ వూరుకోలేక 'అదేమిటే ఆ నరసమ్మ వేషం' అంటుంది. కాసులపేరు వేసుకున్న తన రోజులు జ్ఞాపకం తెచ్చుకుంటూ.

కాలంతో వచ్చినమార్పే ఆడవాళ్ళ ఫేషన్లలో, నగల విషయంలో కూడ వచ్చింది. అదీగాక, 'గాంధిజీ' వంటి మహా పురుషులు కూడ స్త్రీలు నగల విషయంలో శ్రద్ధ తగ్గించుకోవాలనీ, నిరాడంబరతను అలవరచుకుని దేశ సౌభాగ్యంకోసం పాటుపడాలనీ బోధించారు. మనస్తత్వాల్లో మార్పు అనండీ లేక మహా పురుషుల ప్రబోధనల ఫలితం అనండీ ఈనాడు ఆడవాళ్ళకు నగలమీద విపరీతంగా వుండే మోజు తగ్గిపోయింది. రక రకాల చీరెలమోజు మాత్రం పెరిగిపోయింది.

నగలు ధరించటంలో కూడ కొంచెం విచక్షణా జ్ఞానం ఉపయోగించాలి. పెద్దవాళ్ళు, వయస్సుకు తగ్గట్టు, శరీరాకారానికి తగ్గట్టుగా నగలు వేసుకోవాలి. పెద్దవాళ్ళ (ఉన్నవాళ్ళ) నాలుగుజతల గాజులు, మూడు లేక నాలుగు పేటల గొలుసు వుంగరం, చేమంతి బిళ్ళ వగైరా నగలు పెట్టుకున్నా ఎబ్బెట్టుగా వుండదు. అట్లాగే చిన్నపిల్లలు రోజూ నిరాడంబరంగా తయారవుతూ ప్రత్యేక సందర్భాలలో, శుభ సమయాల్లోమాత్రం కొంచెం ఎక్కువ నగలు పెట్టుకున్నా ఫరవాలేదు. ఇక్కడ ఒక్క విషయం చెప్పవలసివస్తుంది. ఆడవాళ్ళల్లో కొంతమంది 'ఉన్నాయ్‌కదా' అని చిన్నా, పెద్దా తారతమ్యం లేకుండా కంఠానికి బిగించి నల్లపూసలు (పెళ్ళయిన వారిసంగతి చెప్తున్నాను. అయినా, ఈ కాలంలో పెళ్ళి కానివారు కూడా నల్లపూసలు వేసుకోవటం ఫాషనే అయింది.) ఇంకొంచెం క్రిందికి రాళ్ళ నెక్‌లేస్, ఆ తర్వాత ముత్యాలసరాలు, వాటి క్రిందికి రాళ్ళ గొలుసులు, ఆ తర్వాత నాలుగుపేటల చంద్రహారం, ఇక మంగళసూత్రపు త్రాడు (నానుత్రాడు) వుండనే వుంటుంది కదా! ఇట్లా వరస ప్రకారం మెడనిండా సొమ్ములు దిగేసుకుంటారు. మెడకే ఇంత అలంకారంచేస్తే తక్కిన అవయవాలకు ఇంకా యెంత అలంకారం చేస్తారో చెప్పనక్కర లేదనుకుంటాను (ఇటువంటివాళ్ళు ఈ కాలంలో

(45 వ పేజీ చూడండి)

రత్నామహీధర్

# చదువులూ-పనిపాటలూ

"ఆదేమోనమ్మా వదినా, చక్కగా పనిపాటలు చేస్తూ, ముచ్చటగా అత్తయ్యా అని పిలుస్తూ ఉండే పిల్లవుతేనే మావాడికి చేసుకుంటాను. మా వాడికీ అంతే. ఈ చదువుకున్న పిల్లలంటే భయం" పక్కగదిలోంచి పొద్దున్నే వచ్చిన మా దూరపు బంధువుగారి గొంతు కంచుగంటలా వినబడింది. నా 'పుస్తకానికి గుడ్‌బై' చెప్పి ఆ పిన్నిగారి మాటలు వినసాగాను.

"ఈకాలపు పిల్లలకి ముఖ్యంగా ఈ కాలేజి చదువులు ఆడపిల్లలను పాడుచేస్తున్నాయి వదినా. ఎక్కడో ఎంతవారికో ఆ విద్య వినయాన్నిస్తుంది. ఏమంటావు ?" ఏవిటంటుంది మా అమ్మ యింట్లో నేనుండగా. అసలు చదువుకున్న పిల్ల అన్న టైటిల్ మనవాళ్ళు శకీమని యివ్వడానికి కారణం కొంతవరకూ మనమేనేమో ననిపిస్తుంది. ఇంట్లో ఎవ్వరూ చదువుకోక.......చదువుకోక అంటే అక్షర జ్ఞానం లేనివారని నా అభిప్రాయంకాదు— ఏ స్కూల్‌ఫైనలో చదువుతున్న అమ్మాయి ఉందనుకొండి—ఆ పిల్ల ఏదేనా చెయ్యబోతే 'నువ్వెందుకే పోయి చదువుకో'— అని అంటూంటారు. దాంతో ఆ పిల్ల ఒహో మనం చదువుకుంటున్నాం అంచేత యిల్లాంటి పనులు చెయ్యటం చిన్నతనంగా ఉంటుంది కాబోలనుకుంటుంది. ముఖ్యంగా మనవేపు పల్లెటూర్ను, పట్నవాసం కాని కొన్ని ఊళ్ళున్నాయి. అక్కడ ఒక్క హైస్కూలు మాత్రమే ఉంటుంది. ఇక చూడండి ఎస్. ఎస్. ఎల్. సి. చదువు పెద్ద పోస్టుగ్రాడ్యువేటు కోర్సులా ఉంటుంది వారికి. దాంతో ఆ క్లాసు చదువుతున్న పిల్ల బోల్డంత టెక్కు చెలాయించటం జరుగుతుంది. ఇంట్లోవాళ్ళు యిది భరిస్తారు. కాని పైవాళ్ళు ఊరుకుంటారా ? వెంటనే "అదెక్కడ చదువుతున్న పిల్ల! దానికి యింతా అంతా గర్వం" అని వీళ్ళందరికీ ఓ బిరుదు యిచ్చేస్తారు. కానీ కాస్త నగరంలోకి వచ్చి కాలేజీ, యూనివర్శిటీ చూశాక వీరికి కాస్త స్వస్వరూపజ్ఞానం వస్తుంది.

తమ చదువు సముద్రంలో ఒక బొట్టంత కూడా ఉండదనీ, పెద్ద పెద్ద ఎమ్. ఏ. లు, బి. ఏ. లు లక్షల సంఖ్యలో ఉన్నారని గ్రహిస్తారు. వీరు మొదటికోవకు చెందినవారు. కాని అసలు 'చదువు' పిల్లలకి జ్ఞానంతేదనీ, పనిపాటలు చెయ్యటం చిన్నతనమన్న అభిప్రాయం కలగచేస్తుందనీ చాలామంది అభిప్రాయం. అసలు చదువుకుంటున్న అమ్మాయిలంతా మొండిగా తయారవటానికి ముఖ్యకారకులు కుటుంబములోనివారేనని చెప్పవచ్చును. ఏదో పేపరు చదువుకుంటూ కూర్చుంటే అలా సోఫామీద మొగరాయుడులా కూర్చోపోతే కాస్త ఏదేనాపని చెయ్యకూడదుటే" అంటుందితల్లి.

(45-వ పేజీ చూడండి)



# ఆదర్శాలు - ఆంతర్యాలు

## సింగరాజు లింగమూర్తి

### జరిగిన కథ

పోలయ్యా అంటే ఆ ఊళ్ళో చాలా మందికి అభిమానం, గౌరవం. కొంతమందికి అతనిపై అయిష్టం కలగడానికి కూడా కారణం లేక పోలేదు. నరసింహప్ప చలమయ్యా ఒకరినొకరు సాధించుకోవాలని ఎత్తులు వేస్తూ ఉంటారు. నరసింహప్ప పోలయ్యను తన పక్షంలో చేర్పించటానికి ప్రయత్నిస్తాడు. ఇందిర చెల్లెలు లలిత రాజారావును ప్రేమిస్తుంది. రాజారావును మంచిచేసుకునేందుకు చలమయ్యా అలివేణిని నియోగిస్తాడు. ఎన్నికలలో పోటీ చెయ్యమని పోలయ్యను రాజారావు ప్రోత్సహిస్తాడు. చలమయ్యా ఏర్పాటు చేయించిన మిల్లు కార్మికుల సభ పోలయ్యా ప్రసంగంతో అభాసు అవుతుంది. అలివేణి రాజారావును ప్రేమిస్తుంది. మిల్లు కార్మికులలో రెండు వర్గాలు ఏర్పడుతాయి. ఇందిర, లలితలనుగూర్చి చలమయ్యా చేస్తున్న ప్రచారాన్ని మునసబు నరసింహప్పకు తెల్పుతాడు. మెట్రిక్ పరీక్షకు హాజరయ్యేందుకు ఇందిర, పోలయ్యా విజయవాడ వెడతారు. అక్కడ పోలయ్యకు శారదతో పరిచయం అవుతుంది. ఒకరినొకరు ప్రేమించుకుంటారు. విజయవాడనుంచి తిరిగివచ్చింతరువాత రాజారావు ప్రోద్బలంతో పోలయ్యా ఎన్నికలకు అభ్యర్థిగా నిలుస్తాడు. చలమయ్యా మిల్లు కార్మికులలో ఒకవర్గంచేత సమ్మె చేయిస్తాడు. పోలయ్యా నిరశనవ్రతంచేసి సమ్మె చేసిన కార్మికులకు మళ్ళీ పనులు ఇప్పిస్తాడు. పోలింగు ప్రారంభమైనరోజు సాయంత్రం పోలయ్య రాజారావు ఇంటికి వస్తూ ఉండగా ఎవరో దొంగ చాటుగా అతని తలపగలగొడతారు. గాయపడిన పోలయ్యను నరసింహప్ప సహాయంతో రాజారావు హైదరాబాదు తీసుకువెళ్ళి ఆస్పత్రిలో చేరుస్తాడు. పోలయ్యా మామూలు మనిషి కావడానికి 15 రోజులు పడుతుంది. ఈలోగా ఎన్నికల ఫలితాలు తెలుస్తాయి. నరసింహప్ప, పోలయ్యా గెలుస్తారు; చలమయ్యాకు, రాజయ్యాకు డిపాజిట్లుకూడా దక్కవు. అలివేణి చలమయ్యను విడిచివెళ్ళి పోతుంది. రాజారావు హితబోధవల్ల చలమయ్యా తన తప్పిదాలు తెలుసుకొని పశ్చాత్తాపం చెందుతాడు.

రాజారావు రాట్నంముందు కూర్చుని మాలుతీస్తున్నాడు. చక్రం గిరగిర శబ్దంచేస్తూ, వడివడిగా తిరుగుతున్నది.

శారద లోపలిగదిలో ఏదో పుస్తకం చదువుతూ కూర్చున్నది. పోలయ్య ఏదో పనిమీద ఎక్కడికో వెళ్ళాడు. శారదతండ్రి వీధి వసారాలో చుట్టపొగ వదులుతూ కూర్చున్నాడు.

రాజారావు ఏమి ఆలోచిస్తున్నాడోకాని, మధ్య మధ్య అతని పెదవులు మందహాసం చేస్తున్నాయి.

పోస్టుమెన్ పిలుపువిని రాజారావు రాట్నం ప్రక్కకుపెట్టి వీధిలోకివచ్చి పోస్టుమెన్ అందించిన కవరు తీసికొని లోపలకు వచ్చాడు. "దస్తూరి కాస్త పరిచయమైందిలాగానే ఉందే . . . . ఎవరు వ్రాశారబ్బా" అనుకుంటూ కవరుచించి లోపలిజాబుచూసి విస్మయంతో లోలోపలే చదువుకున్నాడు.

పూజ్యులైన రాజారావుగారికి: నమస్కారములు.

మీకు ఉత్తరం వ్రాయాలని చాలారోజులనుంచి అనుకుంటున్నాను. కాని ఏమి వ్రాయాలో అర్థం కాలేదు. ఇందులో దోషాలుంటే క్షమించండి.

మీ దయవల్ల ఇక్కడ క్రొత్త జీవితం ప్రారం

(43–వ పేజీ తరువాయి)




(గతసంచికతరువాయి)

## 4

రాముడు జలపాతం చేరుకునేసరికి మిట్టమధ్యాహ్నం అయింది. ఈసారి గాజుస్తంభాల గది తలుపుకి నేరుగా వెళ్లకుండా గోడ పక్కనే నడుచుకుంటూపోయి జాగ్రత్తగా తలుపుని లోపలికి తోసి చూశాడు. గదిలోనుంచి భయంకరమైన శబ్దాలేవో వినిపించి ఒకక్షణం హడిలిపోయాడు. కొంతసేపు అలాగే గోడకి నక్కినుంచున్నాడు. కాని ఏమీ జరగలేదు. శబ్దాలు మాత్రం వినిపిస్తునే ఉన్నాయి. మెల్లిగా లోపలికి తొంగిచూశాడు.

రాక్షసుడూ, అతని కొడుకూ గావును నేలమీద పడుకుని నిద్రపోతున్నారు. వినిపించే భయంకర శబ్దాలు వారి గురకలు! వారి ఆకారాలుకూడా ఏమీ తక్కువ భయంకరంగా లేవు. తండ్రి కనీసం పది అడుగుల పొడవు ఉండి ఉంటాడు. దట్టమైన గడ్డంలోనుంచి పొడుచుకు వస్తున్న కోరలు తెల్లగా మెరుస్తున్నాయి. పక్కనే ముడుచుకుని పడుకున్న చిన్నరాక్షసుడుకూడా ఆరు అడుగులకు తక్కువలేదు! స్తంభాలు కొన్ని ముక్కలు ముక్కలై పడిఉన్నాయి. మరి కొన్ని బీటలు తీసిఉన్నాయి. రాక్షస శిశువు బంతితో ఆడుకుని ఉంటాడు. ముసలమ్మజాడ లేదు.

రాముడు పిల్లిలాగ పొయ్యికాగుదగ్గిరకి నడిచి వెళ్ళాడు. జాగ్రత్తగా మూతతీసి చూశాడు. నిండా జిగురు ఉంది. శబ్దం చెయ్యకుండా గరిటతో తీసి దానికోసం తెచ్చిన పాత్రలో పోసి, మళ్ళీ నిశ్శబ్దంగా తలుపువైపు వచ్చేశాడు. ఎలాగో బయటపడ్డాడు. గుండెదడదడ కొట్టు

(42-వ పేజీ చూడండి)



అన్నపూర్ణావారి '8వ చిత్రం'లో ఇ. వి. సరోజ, నాగేశ్వరరావు.



కు. భీభవా వారి 'బికారిరాముడు'లో రాజసులోచన.

# సంక్షిప్త వార్తలు

## ఉత్తమ దర్శకుల్లో శ్రీ రాయ్‌కి స్థానం

ప్రపంచంలోని చలన చిత్ర దర్శకుల్లో అత్యుత్తములైన పదిమందిలో ఒకరుగా ప్రముఖ వంగ చలన చిత్ర దర్శక నిర్మాత శ్రీ సత్యజిత్ రాయ్‌ని అమెరికా ప్రజలు భావిస్తున్నట్లు అమెరికాలో శ్రీరాయ్ చిత్రాలకు డిస్ట్రిబ్యూటరుగా వుంటున్న శ్రీ ఎడ్వర్డ్ హారిసన్ ఇటీవల కలకత్తాలో అన్నారు

సత్యజిత్ రాయ్ దర్శకత్వ నైపుణి హాలివుడ్ చిత్ర దర్శకులపైన అపరిమితమైన ప్రభావాన్ని చూపించిందని కూడా శ్రీ హారిసన్ అన్నారు రాయ్ నిర్మించిన దేవి చిత్రాన్ని కూడా త్వరలో అమెరికాలో ప్రదర్శించే ఏర్పాటు కూడా చేస్తారట.

## సినిమాస్కోప్, వర్ణచిత్రం సంపూర్ణమహాభారతం

రు 5 కోట్లతో 'తాజమహల్' అన్న చిత్రాన్ని ప్రారంభించనున్నట్లు ప్రకటించిన దర్శక నిర్మాత కె అసిఫ్ భారీ ఎత్తున 'మహా భారతం' అన్న సినిమాస్కోప్, వర్ణ చిత్రాన్ని కూడా నిర్మించనున్నట్లు ప్రకటించారు ఇలా భారీగా చిత్రద్వయ నిర్మాణానికి పూనుకోటం నిజంగా చలనచిత్రరంగంలో ఒక విశేషమే

బసంత్ పిక్చర్సు నిర్మించిన సంపూర్ణ రామాయణం దర్శకుడు బాబూభాయ్‌మిస్త్రీ దర్శకత్వం వహిస్తారట చిత్రకథ ఏర్పరచుకునేందుకుగాను శ్రీ అసిఫ్ పౌరాణిక చిత్ర కథ రచయితలో ప్రసిద్ధులు శ్రీయుతులు సి కె ముస్త్, పండిత్ మధుర్, విశ్వనాథ పాండే, నరోత్తమవ్యాస్, మనూదేశాయ్‌లను ఎన్నుకొన్నారు ఈ భారీ చిత్రానికి సంగీత దర్శకుడు కౌశల్ జీ

తాజమహల్, మహాభారతం చిత్రాలు రెంటినీ ఒకే తడవ ప్రారంభించేందుకు శ్రీ అసిఫ్ సన్నాహాలు చేస్తున్నారు

## మలయాళ చిత్రంలో సి. ఎస్. ఆర్., కాంతారావు

కృష్ణ కుచేల చిత్రంతో అపూర్వంగా ప్రజాదరణనందుకొన్ననటుడు శ్రీ సి యస్ ఆర్, వర్ధమాన నటుడు శ్రీ కాంతారావు మలయాళంలో తయారవుతున్న కుచేల చిత్రంలో ప్రముఖ భూమికలు నిర్వహిస్తున్నారు

మేరీలాండ్ స్టూడియోవారు తిరువనంతపురంలో నిర్మిస్తున్న ఈ చిత్రంలో సి యస్ ఆర్ కుచేలుడుగా నటిస్తున్నారు. శ్రీ కాంతారావు శ్రీకృష్ణ భూమిక నిర్వహిస్తున్నారట

## భారతీయ దర్శకులపై విదేశాల్లో భారతీయుల విమర్శ

భారతీయ దర్శకులకు చలన చిత్ర నిర్మాణంలోని లోటుపాటులు, కిటుకులు, ప్రణాళికలు ఏమి తెలియవని భారతీయ నర్తకుడు భాస్కరరాయ్ చౌధురి అన్నట్లు దర్పాన్ పత్రిక ఒకటి ప్రకటించింది

శ్రీ రాయ్ చౌధురీ అనేక భారతీయ చిత్రాల్లో పనిచేసినమీదట కొన్ని సంవత్సరాల క్రిందట అమెరికా చేరారు అక్కడనుండి ఆయన విశ్వకవి రవీంద్రుని "కింగ్ అవ్ డర్క్ చేంబర్" అనే నాటకంలో పనిచేసేందుకు, దక్షిణాఫ్రికాకు వెళ్తూ ఇటీవల మన దేశానికి వచ్చారు

భారతీయ దర్శకులకు ధనంమీదేతప్ప, ప్రతిభా ప్రదర్శనంమీద ఆంతగా దృష్టి లేదనీ, భారతదేశంలో

ప్రతి ఏల్లయ్యా ఒక నటుడు కావచ్చనీ శ్రీ రాయ్ చౌధురి దర్పాన్‌లో అన్నట్లు కూడా ఆ పత్రిక ప్రకటించింది.

## చిత్రోత్సవపు చిత్రాలపై వినోదపు పన్ను లేదు

అక్టోబరు 27 నుండి నవంబరు 16 దాకా అంతర్జాతీయ చలన చిత్రోత్సవం సందర్భంలో ఢిల్లీ, మద్రాసు, బొంబాయిలలో ప్రదర్శింపబడే చిత్రాలపై వినోదపు పన్ను ఉండదని కేంద్ర సమాచారశాఖ కార్యదర్శి శ్రీ సవాట్ సింగ్ ఇటీవల బొంబాయిలో వెల్లడించారు. ★



భాస్కర్ ప్రొడక్షన్స్‌వారి 'మోహినీ రుక్మాంగద'లో కాంతారావు.


అద్భుత నటనము హీరోయినులకు
అక్కర లేదని నమ్మిక జనులకు
వంపుల సొంపులు చెంపల కెంపులు
తారకు తప్పని సరియగు నింపులు
సన్నటి చక్కటి చిన్నది యన్నది
కృష్ణకుమారికి బిరుదైయున్నది...

# కవి సార్వభౌముడు

నోరి నరసింహశాస్త్రి



## జరిగిన కథ

సర్వజ్ఞచక్రవర్తి బిరుదాంచితుడగు కొండవీటి ప్రభువు పెదకోమటి వేమారెడ్డి శ్రీనాథభట్టును కవిసార్వభౌమ బిరుదు పట్టముతో అలంకరించి, సర్వవిద్యానిలయమైన శ్రీ విద్యానగరమునకు విద్యావిజయ ప్రస్థానము చేయవలసిందని అర్థిస్తాడు. దైవజ్ఞులు యాత్రాలగ్నము నిశ్చయించి, కార్యసిద్ధికై పౌష్టికక్రియలు సూచిస్తారు. పోతనను తన వెంట తీసుకొని వెళ్ళేందుకు అతని అన్న తిప్పనార్యుని శ్రీనాథుడు ఒప్పిస్తాడు.

---

దైవజ్ఞులు నిర్ణయించిన ప్రకారముగా ఆ మరునాటి ప్రాతఃకాలముననే శ్రీనాథుడు బ్రాహ్మీదీక్ష ప్రారంభించెను. వలయు సంభారములు పుష్కలముగా తెల్లవారకముందే సింగనప్రధాని యాజ్ఞచే శ్రీనాథుని యింటికి చేర్పబడెను. వంశపురోహితుడును, ఋత్విక్కులును తెల్లవారునరికే చేరిరి. వెదుళ్ళ చెరువుకు సమీపముననే బ్రాహ్మణవీథిలో మధ్యభాగమున శ్రీనాథుని గృహమున్నది. గృహద్వారములను పచ్చని తోరణములతో దుగ్గనయు పోతనయు ఇతర పరిజనములతో గలసి యలంకరించుచుండిరి.

దీక్షాంగముగా ఆయుష్కర్మయు సూక్ష్మముగా ప్రాయశ్చిత్తాదులు నైనవి. అంతట దీక్షాసంకల్ప మొనర్చి ఋత్విగ్వరణము కావించి విఘ్నేశ్వరపూజ పుణ్యాహవాచనము మండపారాధనము నిర్వర్తించిరి.

అంతట నిర్ణీతమైన విధానమున ఎవరి జపములకు వారు కూర్చుండిరి. ఒకరు సూర్య నమస్కారములు చేయుచుండ తక్కిన పదిమందియు గ్రహనక్షత్రాదికజపములు చేయుచుండిరి. సావిత్రీజపమును శ్రీనాథుడే స్వయముగా చేయుచుండెను. కుల పురోహితుడు పైనుండి ఏద్రవ్య మెప్పుడు కావలసియుండునో సిద్ధము చేయించుచు సన్నాహము చేయుచుండెను.

మధ్యాహ్నవేళకు కొంచెము ముందుగా జపము లర్పణ మొనర్చి సంధ్యావందనాదిక మొనర్చి వెంటనే యందరుకలసి మహాన్యాస పురస్సరముగా రుద్రాభిషేకము కావింతురు. అప్పుడు మూడు గడియల పాటు అందరు విశ్రమింతురు. ఆ వ్యవధానములో నే ఫలములో గోక్షీరములో ఎవరికి కావలసినది వారు గ్రహింతురు. విశ్రాంతియైన పిమ్మట అందరు కలసి కృష్ణ యజుర్వేద పారాయణము నొనర్తురు. సాయంసంధ్యా వేళకు ముందుగా పారాయణము చాలింతురు.

అంతట శ్రీనాథుడు సాయంవిధు లాచరించి

(38-వ పేజీ చూడండి)






దైవజ్ఞ పోతూరి శ్రీరామమూర్తి

**8-11-1961 బుధవారము మొదలు**
**9-11-1961 గురువారము వరకు**

## మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

దైవబలంవల్ల ఏ పనిలో ప్రవేశించినా నలుగురి చేతా "సెబాస్" అనిపించుకోగలుగుతారు. గత కొన్ని రోజులనుంచి చేస్తున్న ఆలోచనలు సులభంగా నెరవేరుతవి. మీ మాటను పై అధికారులు గౌరవిస్తారు ఆరోగ్యంమాత్రం సరిగా ఉండదు. కాని, మీ ప్రయాణాలకు ఆటంకంరాదు. విరివిగా వచ్చే ఆదాయంతోపాటు విలాసాల నిమిత్తం ఖర్చులున్నూ, పెరుగుతవి. పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి.వృత్తికి సంబంధించిన ఉత్తరాలు, వ్యవహార సంబంధమైన కాగితాలు మొదలయినవివ్రాయటంలో ముందు జాగ్రత్త అవసరం. ఇతరుల పోటీని ఎదుర్కొన గలుగుతారు. మాటను నిలబెట్టుకొనటానికి శ్రమ పడవలసి వస్తుంది.

*　　*　　*

## వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఎవరిమాటను త్రోసిపుచ్చటానికి అవకాశంలేని స్థితిలో చిక్కుకుంటారు. గౌరవం పెరుగుతుంది. కలసివచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకొనటానికి మరికొంత సమర్థతా, ఆడంబరము అవసరం అవుతవి. వృత్తి ఉద్యోగాలలో మంచివారి సహాయంతో పనులు పూర్తి చేయగలుగుతారు. సంఘంలో గౌరవస్థానం లభిస్తుంది మీ మాటలలో ప్రస్తుతం యుక్తి, ఎదుటివారిని గురించిన స్తోత్రము లేకపోవటంవల్ల కొంతమందివల్ల మీకు నిరుత్సాహం కలుగవచ్చు

> **గ్రహస్థితి**
>
> కర్కాటకంలో రాహువు, తులలో సూర్య బుధ శుక్రులు, వృశ్చికంలో అంగారకుడు, మకరంలో గురు, శని, కేతువులు. తులా వృశ్చికాలలో చంద్రుడు.

కాని, మీ స్థితికి ఏ విధంగానూ భంగం కలుగదు. స్నేహితులవల్ల దుబారా పెరగకుండా చూచుకొనండి. మీ క్రింద పనిచేసేవారిని ఒక కంట కనిపెడుతూ తగాదాలు రాకుండా చూచుకొనండి.

*　　*　　*

## మిథునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

అన్నీ కంటిముందు కనిపిస్తూ ఉంటవి అందుకుని అనుభవించటానికి వీలు ఉండదు సంప్రదింపుల నిమిత్తం, సహాయం నిమిత్తం మీ దగ్గరకు రావలసినవారు కూడా తప్పుకుని తిరుగుతారు. మీరు ఏ సందర్భంలోనూ తొందరపడటం మంచిదికాదు. దేహసౌఖ్యం బాగుంటుంది. ఎప్పటి కప్పుడు మీ బాధ్యతలను పూర్తిగా నెరవేర్చుకుంటూఉంటారు. ఆదాయం మందంగా ఉంటుంది ఏది ఎలాఉన్నా ఉత్సాహము, మనశ్శాంతీ తగ్గవు. అన్ని రకాలవారితోనూ మంచితనం నిలుపుకొంటారు.వ్యవహార రంగాలలో జయము, లాభము కూడా పొందగలుగుతారు. స్వయంగా తెలుసుకోకుండా మధ్య వారి మాటలను నమ్మతగిన సమయంకాదు.

*　　*　　*

## కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)**

గ్రహస్థితి అనుకూలంగా ఉన్నది. ఏదైనా ఒక ఆలోచన మనస్సులోకి వస్తూఉండగానే దాన్ని కార్యరూపంలోకి తీసుకుని రాగలుగుతారు పండితులతో మైత్రి లభిస్తుంది మరొకరిమాటమీద ఆధారపడవలసిన అవసరం క్రమంగా తగ్గిపోతుంది కుటుంబ విషయాలలో ఉత్సాహకరంగావుంటుంది. ధనాదాయం మాత్రం మీరు అనుకున్నంతగా పెరగదు. కాని, మామూలుగా ఉంటుంది. స్నేహితులు ప్రస్తుతం మీకు అనుకూలంగా మాట్లాడరు. తూర్పు దిక్కునుంచి లాభవార్తలు తెలుస్తవి ఈ సమయంలో కారణం లేకపోయినా ఆందోళన, ఉద్రేకము కలుగుతవి.

*　　*　　*

## సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

వ్యవహార రంగంలో విసుగు చెందకుండా శ్రమపడి పనిచేస్తేగాని ఒక మార్గం అంటూ తోచదు. శుభసంబంధమైన ఖర్చులు అధికం అవుతవి. ఆహార విహారాలలో మీ ఇష్టానుసారంగా ఉండతగిన సమయం కాదు. వృత్తి, వ్యాసారాదులలో మీరు తలచినంత చురుకుగా ఏ పనీ కాదు అయితే చిక్కుపడవలసివస్తుందనే భయం తొలగిపోతుంది. గౌరవం బాగుంటుంది. తలవని తలంపుగా ఆదుర్దా చెందతగిన వార్తలు రావచ్చు మాటల సందర్భంలో ఎదుటివారు మిమ్ములను సంధేహించకుండా చూచుకొనండి పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది.

*　　*　　*

## కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

మీరు తప్పుకుందామని ప్రయత్నించిన కొద్దీ ఖర్చులభారం అధికం అవుతూ ఉంటుంది సంఘ కార్యాలలో మీ మాట, అధికారము బాగా చలామణీ అవుతవి. మిమ్ములను సహాయం కోరేవారు ఉంటారు. ప్రయాణాలు అనుకున్న ప్రకారంగా చేయలేకపోతారు.

ధనాదాయం సంతృప్తికరంగా ఉంటుంది. బంధుమిత్రులు మిమ్మల్ని ప్రోత్సహిస్తారు. కాని, క్రొత్త కార్యక్రమాలలో ప్రవేశించలేకపోతారు. వృధా ప్రసంగాలతో ముఖ్యమైన పనులు మూలపడకుండా చూచుకొనండి.

* * *

**తుల :**

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

అందరితోనూ మంచితనంతో ఉందామని అనుకుంటారుకాని, ఒక రిద్దరు మిమ్మల్ని విసిగించటానికి పూనుకుంటారు ప్రత్యేకంగా ధన సంబంధమైన మార్పులు ఏమీ కనుపించవు. పదిమందికీ సంబంధించిన కార్యక్రమాలలో మీ అవసరము, విలువ పెరుగుతవి. ఆరోగ్యంమాత్రం అసంతృప్తికరంగానే ఉంటుంది. మీరు ముందుగా యోచించుకొనకపోయినా దైవానుగ్రహంవల్ల సమయస్ఫూర్తిగా మాట్లాడి మీ ఆధిక్యతను కాపాడుకోగలుగుతారు. పుణ్యకార్య ప్రయత్నాలు అనుకూలిస్తవి. ఉపయోగకరమైన ఖర్చులు. త్రిప్పట అధికము.

* * *

**వృశ్చికం :**

**(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

విశ్రాంతి లేకుండా ఏదో ఒక పనిచేస్తూ ఉంటారు. మనస్సంతృప్తిమాత్రం తక్కువ అధికారులతోనూ, ఉన్నతస్థితియందున్న పెద్ద మనుష్యులతోనూ సమావేశం లభిస్తుంది. ఒక వ్యవహారం పూర్తి కాకుండానే మరొక సమస్య ఎదురు అవుతూ ఉంటుంది కుటుంబంలోనివారి ఆరోగ్యంగురించి జాగ్రత్తగాయుండండి. అనుకోకుండా కొన్ని నష్ట కష్టాలు రాగల అవకాశాలున్నవి. బంధుమిత్రుల కోర్కెను నెరవేర్చుదామని ప్రయత్నిస్తారు. కాని, అందుకు తగిన అవకాశాలు లభించవు.

* * *

**ధనుస్సు :**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

ప్రస్తుతం మీ ప్రయత్నాలకు ఏ విధమైన ఆటంకము ఉండదు. ప్రయాణ సూచన లున్నవి. ఉత్తరదిక్కునుంచి శుభవార్తలు తెలుస్తవి. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం సులభంగా వస్తుంది. అనేకవిషయాలను గురించి, స్నేహితులతో ఆలోచించవలసి వస్తుంది. కాని, సమయం కుదరక పోవచ్చు. వృత్తి, ఉద్యోగాలలో గౌరవము, పలుకుబడి పెరుగుతవి. కుటుంబంలోనివారివల్ల విచారాలు రాగల సమయం. మంచితనంగా మాట్లాడుతూ మీ లోపాలను వెతికే పెద్ద మనుష్యులు ఉంటారు.

* * *

**మకరం :**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

అన్ని విధాలా ప్రోత్సాహం లభిస్తుంది. వృత్తి వ్యాపారాలలో అసంతృప్తి తొలగిపోయి ముందు ముందు ఇంకా అభివృద్ధిని సాధించగలమనే ధైర్యం లభిస్తుంది. ప్రస్తుతం కూడా ఆదాయం బాగానే ఉంటుంది. కుటుంబంలో సాధారణమైన అభిప్రాయ భేదాలు వస్తున్నా ప్రత్యేకంగా మీరు జోక్యం కలిగించుకోవలసిన అవసరం ఉండదు. ఎదురు చూస్తున్న వార్తలు వస్తవి. కాని, అసంతృప్తికరంగా ఉండవచ్చు కోర్టు, కచ్చేరీలతో అనుకూలమైన కాలం. సంచారం అధికంగా ఉంటుంది.

* * *

**కుంభం :**

**(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

స్వశక్తితో మీరు అన్ని రంగాలలోనూ జయం సాధించగలుగుతారు. హోదా పెరుగుతుంది. మీరు ఇతరులకు చెప్పిన సలహా బాగా అనుకూలిస్తుంది. మీకు ఇష్టంఉన్నా, లేకపోయినా లోగడ మీరు చెప్పిన దానినే ఈ సమయంలో మరొక విధంగా మార్చుకొనవలసిన అవసరం కలుగుతుంది. అయితే అందువల్ల ఏ విధమైన చిక్కులు వుండవు. కుటుంబంలోనివారి ఆరోగ్యం సరిగా ఉండదు. క్రొత్తగా డబ్బు పెట్టుబడి పెట్టవలసిన అవసరం వస్తుంది. అయితే ఇంతకూ మనశ్శాంతి మాత్రం బాగుంటుంది.

## ధరలు

బంగారుధర తేజీ అవుతుంది. వెండిధర సాధారణంగా నిలిచి ఉంటుంది. పసుపు ధరలో కొద్ది పెరుగుదల వస్తుంది. ప్రత్తి, నూలు ధరలు తగ్గి, పెరుగుతవి. గోధుమల ధర మందీలో ఉంటుంది. వేరుసెనగ ధర తేజీ వస్తుంది. కాని, పడిపోగల అవకాశాలున్నవి. నూవులకు గిరాకి కనుపిస్తుంది. కర్పూరం వెల బాగా పెరిగే అవకాశాలున్నవి.

* * *

**మీనం :**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

ఈ సమయంలో గౌరవము, ఆదాయము స్వశక్తిమీద నిలబడతగిన స్తోమతు చక్కగా ఉంటవి. అయితే సమయంలో మీ కర్తవ్యాన్ని జ్ఞాపకంచేస్తూ ప్రోత్సాహపరచేవారు అవసరం. డబ్బు వాడకంలో ముందు జాగ్రత్త లేకపోవటంవల్ల కొంత చిక్కుపడి సమర్థించుకుంటారు. మీరు చేసే ప్రయత్నాలకు పెట్టుబడులకు దండగ వస్తుందేమోననే భయం తొలగిపోతుంది. పుణ్యకార్యాలు జరుగుతవి. ఏ సమయంలో ఏ వార్తలు వస్తవో ననే సందేహం తోస్తుంది. కాని చివరకు అటువంటిది ఏమీ ఉండదు. తలవని తలంపుగా ధనలాభంవుంటుంది





# అగ్గిరాముడు బొమ్మల కథ సత్యమూర్తి






















## ఓట్ల సంరంభం

ఓట్లు! ఓట్లు! ఓట్లు! పార్లమెంటుకు సీట్లు!
ఓట్లకొరకు పాట్లు, పోట్లు, కాట్లు,
మాట్లు, ప్లేట్లు, బీట్లు-ఓడిన నగుబాట్లు
కోట్ల ఓట్లు నోట్ల 'చాట్లుమాట్లు'!

—వి. యస్. బాబు (బాపట్ల)

* * *

## అప్పుతప్పురాలు

అప్పుకప్పురంబు లదిగు పోలికలుండు
చూచెచూడ వాని జాడ సున్న
పురుషులందు పణ్య పురుషులు వేరయా
విశ్వదాభిరామ వినుర వేమ.

—ఎన్. రై మోహనరావు.

* * *

## నల్లి జిజ్ఞాస

తర్క విద్యార్థి :- (మంచం మీద పడుకుని తర్కం చదువుకుంటున్నాడు.)

"అథాతో ధర్మ జిజ్ఞాసా"

(ఇంతలో దోమ కరిచింది.)

"అథాతో దోమ జిజ్ఞాసా"

(మళ్ళీ మొదలు) "అథాతో ధర్మ జిజ్ఞాసా" (ఈసారి నల్లి కరిచింది)

"అథాతో నల్లి జిజ్ఞాసా!"

శ్రీ పేవు మురళీధరరావు, (పెండ్రా)

* * *






## ఆవకాయ

కలిపెడిది ఆవకాయట
కలిపించెడివాడు మామగారట
తా కలిపిన వాతహరమగునట
కలిపెద వేరొండు వాయ కలుపగనేలా ?

ఎల్లెన్ (మాతుంగా)

* * *

## ఎంత దయో దోశలపై

ఎంత దయో దోశలపై
పంతంబున మడ్చిపెట్టి భక్షింపన్ శ్రీ
కాంతుడు చక్కెర వేసెను
దంతాలకు దీపులెక్క దత్తాత్రేయా !

ఎ వి. రంగయ్య (గుంతకల్లు)

* * *

## సిగిరెట్టు

అడిగిన సిగరే టివ్వని
వడమంత్రపువాని బట్టి యడుగుటకంటెన్
బడిలోని కేగు పిల్లల
వడిగిన సిగిరెట్లు దొరుకు గదరా శ్యామా !

సి. కాంతయ్య (నిర్మల్

* * *

ఒకరు:-ఎంతో దూరం నుంచి మంత్రిగారు వచ్చి ఉపన్యాసం ఇస్తుంటే అంతా లేచిపోతున్నారు. ఎందుకు?

మరొకరు:-పక్క వీధిలో సినిమానటుడి ఊరేగింపు గదుటండీ, అది చూద్దామని.

వి. రామకుటుంబరావు,
(నాజరుపేట, తెనాలి)

# బంగారు గొలుసు

రంగనాథరావుగారు ఆగిన రైలులో హడావుడిగా ఎక్కారు. పెట్టంతా ఖాళీగా ఉండటంతో తను పడిన తొందరకు నవ్వువచ్చింది.

ఆ బోగీయే చాలా పెద్దది. రెండు బెంచీలను కలిపి ఒక గదిగా అమర్చబడివున్నది. ఆయన మౌనంగా వెళ్ళి ఒక బెంచిమీద కూర్చున్నారు. చేతిలోని సంచి బల్లక్రిందగా పెట్టారు. కళ్ళజోడుతీసి ఒకసారి పంచె అంచుతో తుడుచుకొని మళ్ళీ పెట్టుకున్నారు.

రైలు ప్రయాణం చేద్దామనుకునేవారికి చోటు దొరికేంతవరకు దిగులుగానే వుంటుంది. అటువంటిది పెద్ద ప్రయాణాలే అలవాటులేని రంగనాథరావుగారికి మరీ భయమేసింది. . . కూర్చోటానికే స్థలం దొరుకుతుందో లేదో అనుకున్న ఆయనకు పడుకోవటానికే ఏకంగా ఒక బెంచీ దొరకటంతో బ్రహ్మానందపడ్డారు.

కిటికీప్రక్కగా జేరి ఫ్లాట్‌ఫారంమీదకు ఒక్కసారి దృష్టి సారించారు. ప్లాట్‌ఫారం ఆ లైట్ల కాంతిలో వెలవెలాబోతోంది. జనం చిందర వందరగా అక్కడక్కడా వున్నారు. కొందరు ప్రయాణీకులు ఆ చలిలో గూడా ఫ్లాట్‌ఫారమ్‌మీద ముడుచుకొని పడుకొని నిద్రపోతున్నారు.

పంకా తిరుగుతుంటే మరీ చల్లగా వున్నదని పించి లేచివెళ్ళి 'ఫ్యాన్' అని వ్రాసివున్న స్విచ్‌ని పైకి నెట్టారు. తిరిగివచ్చి కూర్చొని బుజంమీదగా నున్న ఉత్తరీయాన్ని మెడచుట్టూ చుట్టుకున్నారు.

స్టేషన్‌లో గంట మ్రోగింది. ఇక 'కదులు' అన్నట్లుగా గార్డు 'విజిల్' వూదాడు. రైలు ఇంజన్ కూతకూసి బయల్దేరింది.

అదేసమయంలో ఒక యువకుడు రంగనాథరావుగారి ఎదురుబెంచీమీద త్వర త్వరగా వచ్చి కూర్చున్నాడు. పొడుగ్గా వున్నాడు. కాఫీరంగులాగుమీద తెల్లషర్టు వేసుకున్నాడు. బలిష్టమైన చేతికి వెడల్పయిన గడియారం అతికినట్లుగా వున్నది.

అతడు కూర్చుంటూనే చేతిలోని అందమైన అట్టగల ఇంగ్లీషు పుస్తకాన్ని ప్రక్కగాపెట్టాడు. ఒక్కసారి చొక్కాకాలర్ పట్టుకొని పైకిలాగి వదిలిపెట్టాడు. మెడ నెప్పి పుట్టినవాడు త్రిప్పినట్లుగా ఒకటి రెండుసార్లు త్రిప్పాడు. జేబులోని రుమాలుతీసి మొఖం తుడుచుకున్నాడు.

సావకాశంగా కూర్చొని ప్రక్కనే పెట్టిన పుస్తకాన్ని చేతిలోకి తీసుకొని పేజీలు తిరగవేయ సాగాడు.

రంగనాథరావుగారికి అతడి వాలకంచూచి నవ్వు వచ్చింది. బండి బయల్దేరేవరకు ప్లాట్‌ఫారాన్ని 'సర్వే' చేసి బండి బయల్దేరబోయేముందు ఎక్కటం ఈ కాలం కుర్రవాళ్ళకు అలవాటేమో ననిపించింది.

ఆ కుర్రవాడిని ఆలా చూస్తుండగానే ఆయన మనస్సు తను కలవబోయే చలపతిమీదకు పోయింది!

విశాలమైన నుదురు. బట్టతల. వెడల్పైన ఎర్రటి మొఖం. చూచేవాళ్ళకు చాలా పెద్దమనిషిలా కనబడతాడు. అతడి హృదయంగూడా ఆకారం లాగానే వెన్నలాంటిది. లేకపోతే తను నోరుతెరిచి అడగ్గానే ఐదుదువందల రూపాయిలు ఏలాంటి వ్రాతకోతలు లేకుండానే ఎందుకిస్తాడు?

తన పెద్దకూతురు లక్ష్మి పెళ్ళి ఏదో గంతకు తగ్గ బొంతలాంటి సంబంధం ఒకటిచూచి నిర్ణయించాడు. అనుకున్న సమయానికి ఆశలు పెట్టి



## బంగారుగొలుసు

కున్న డబ్బు రాకపోవటంతో పెండ్లి కొచ్చేటప్పుడు ఒక ఐదొందలు పట్టుకురా చలపతీ అని వ్రాయగానే వెంటనే పట్టుకొచ్చేశాడు! నిజంగా ఆరోజు ఆ సహాయం చేయకపోయినట్లయితే తా నెంతో ఇబ్బంది పడివుండేవాడు.

ఇప్పటికి రెండు సంవత్సరాలయింది. తా నెన్నో ప్రయత్నాలు చేశాడు. ఎప్పటికప్పుడు ఏదో అవాంతరం వస్తూనే వున్నది. పెండ్లినాటి బాకీ తీర్చలేదు. అప్పుడే లక్ష్మికి ఒక మొగపిల్లవాడు!

రంగనాధరావుగారికి నవ్వు వచ్చింది. లేచి నిలబడ్డాడు. మెడకు చుట్టుకున్న ఉత్తరీయాన్నితీసి ఉండగాచుట్టి బెంచిమీద ఒక ప్రక్కగా పెట్టారు. ఒక్కసారి ఆవులించి చిటికెవేసి తలను ఉత్తరీయంమీదకు జేర్చి నడుం వాల్చారు.

ఇంకా గాలి మొహానికి బాగా కొడుతోంది. అందుకని ప్రక్కకు తిరిగి ఆ యువకుడి మొఖంలోకి చూస్తూ పడుకున్నారు.

"ఏవూరు వెళుతున్నావు బాబూ?"

గుంటూరండీ!" అన్నాడు పుస్తకంమీది దృష్టి రంగనాథరావుగారిమీదకు మారుస్తూ.

"చదువుతున్నావా?" అన్నారు మోచేతిని తలకు పోటీగా నిలబెట్టి సగం లేచినట్లుగా పడుకొని.

"అవునండీ. . . ఏదో యింగ్లీషు నవల!"

"ఆహా. . . . .నేననేది అదిగాదు. . . . నీవేమైనా చదువుకుంటున్నావాలేక ఉద్యోగం చేస్తున్నావా? అని!"

అతడు కొంచెం పెద్దగా నవ్వాడు

"బి యస్‌సి. చదువుతున్నానండీ!"

ఇంకేదో అడగబోయి పుస్తకం చదువుతున్న అతడిని భంగపరచటం యిష్టంలేక మౌనం వహించి పూర్తిగా నడుం వాల్చి కళ్లు మూసుకున్నారు.

బెంచీమీద పడుకుంటే ఏమిటోగా వున్నది. నిద్రపోవటానికి ప్రయత్నించసాగారు.

తిరిగి చలపతి కళ్ళముందు మెదిలాడు.

"అరేయ్! రంగా! నీ వెందుకు వస్తావురా మా యింటికి?" అంటాడు వ్రాసే ప్రతి ఉత్తరంలో. తనకూ వెళ్ళాలని వుంటుంది. కాని అంతదూరం వెళ్ళాలంటే సెలవంటూ దొరకాలి. . . .అదీగాక ఒక పది రూపాయిల ఖర్చు! ఆ పదీవుంటే ఇంకో అవసరానికి కలిసివస్తాయి.

ఈ సంవత్సరం పంటలు రాగానే తరువాత తిప్పలు తరువాత అనుకుంటూ మూడొంతులు ధాన్యం అమ్మేశాడు. రెండేళ్ళబట్టీ వాడు అడగకపోతే మాత్రం తీసుకున్న తనకు మర్యాదగా వుండొద్దూ! వాడి కిది ఒక లెక్కకాకపోవచ్చు... కాని వాడిలో తన మీద గౌరవం నశించటానికి పెద్ద మొత్తమే అవుతుంది.

డబ్బు చేతిలోకి వస్తుంది అని అనుకుంటుండగానే జాబు వ్రాసేడు "నీ డబ్బు పది హేను రోజులలో పంపిస్తానురా!" అని.

వాడిదగ్గరనుండి తిరుగుటపాలోనే జాబు వచ్చింది. "నీవు రాకుండా డబ్బు మనియార్డరు ద్వారా పంపావో

అది నీకే తిరిగి జేరుతుంది మర్యాదగావచ్చి నాలుగు రోజులుండి వెళ్లు!'' అని

ఇక తనేంజేస్తాడు? బయల్దేరక తప్పలేదు.

ఒక్కసారి నడుముకున్న డబ్బుమూటను తడిమి చూచుకున్నాడు. సంతృప్తిగా శ్వాసపీల్చుకొని కదల కుండా అలాగే పడుకున్నాడు.

తరువాత కొద్ది సేపట్లోనే నిద్ర పట్టింది.

......రైలు మోత చేసుకుంటూ చీకటిలో 'గీ' పెడుతున్న పొలాల మధ్యనుండి పరుగెడుతున్నది. ఆకాశం మల్లెపందిరిలా అందంగా మెరుస్తోంది ఆ గాఢ నిశీధిలో ఎదురుపడుతున్న పల్లెల లోని దీపాలు అప్పుడప్పుడు కనిపిస్తున్నయి. . . .

ఆ యువకుడు లేచి నిలబడ్డాడు చేతినున్న గడియారంలో టైం చూచుకున్నాడు. పది గంటలయింది—అంటే అప్పుడే తను ఆ బండిలో ఎక్కి రెండుగంటలయిందన్నమాట!

చిన్నగా ముందుకొచ్చి పెట్టె మొదటినుండి చివరివరకు చూచుకుంటూ వెళ్ళాడు. ఒక్కొక్క భాగంలో అసలు ప్రయాణీకులే లేరు. అవతల వైపు మాత్రం ఒక భాగంలో ఎవరో కుటుబంతో విశ్రాంతిగా పడుకొనివున్నారు. ఒక బెంచి పై బెర్తు మీద ఒక కుర్రవాడు నిద్రపోతున్నాడు. పెట్టె చివర మూలగా అడుక్కుండేవాడుగాబోలు తల రెండు కాళ్ళమధ్యపెట్టుకొని ముడుచుకు కూర్చున్నాడు.

మెదలకుండా తను కూర్చున్న బెంచి దగ్గరికొచ్చాడు. అతడు ఒక్కసారి నలువైపులా తలతిప్పి కలయచూచాడు. చటుక్కున వెలుగుతున్న పెద్ద లైటు ఆర్పి బ్లూలైటు వేశాడు. రంగనాధరావుగారికి అతి సమీపంలో నడిచి,వంగి అటు తిరిగి గాఢ నిద్రలో వున్న ఆయన మొఖంలోకి చూచాడు ఒక్కక్షణం తిరిగి మరుక్షణంలోనే రంగనాధరావుగారి నడుముకు చుట్టుకున్నధోవతి చివర డబ్బుతో గూడిన మూటను బయటకు లాగాడు దబదబా అతినిశ్శబ్దంగా ముడి విప్పాడు.

ముడివిప్పిచూస్తూనే ఆశ్చర్యపోయాడు. ఏవేవో కాగితాల మడతలున్నాయి. సాయంత్రంనుండి అతడిని వెంబడించిన శ్రమంతా వృధాఐపోతుందేమోనని పించింది. నిరాశతోగూడిన హడావుడితో అన్నీ తీసి చూచాడు. . . . ఇంతలోనే అతడి కళ్ళు మెరిసినయి. ఆ కాగితాలమధ్యలోవున్న వంద రూపాయిల నోట్లను తీసుకొని జేబులో కుక్కుకున్నాడు. ఆ కాగితాలను అలాగేవుంచి మూటకట్టి నడుముకున్న ధోవతితో ముడివేశాడు.

ప్రక్కగానున్న స్విచ్ దగ్గరికివెళ్ళి నీలంలైటు ఆర్పి పెద్దలైటు వేశాడు. తిరిగి తన మామూలు స్థలంలోకొచ్చి కూర్చొని ఒక చేత్తో ప్రక్కనపెట్టిన పుస్తకాన్ని తీసుకుంటూ, మరొకచేత్తో జేబు రుమాల పెట్టి నుదుటిన పట్టినస్వేద బిందువులను తుడుచుకున్నాడు!

రైలు తనకేమీ తెలియనట్లుగా తన మామూలు ధోరణిలో వెళ్ళిపోతోంది. ఆ యువకుడు పుస్తకం చదువుతున్నాడన్నమాటేగాని పదే పదే పడుకొనివున్న రంగనాధరావుగారివైపే చూస్తున్నాడు.

రంగనాధరావుగారు గాఢ సుషుప్తిలో మునిగివున్నారు! . . . .

రైలు ఒక్కొక్క స్టేషను దాటుకుంటూ వెళ్ళిపోతోంది. అప్పుడే పదకొండు గంటలు దాటింది. చలి మరీ విపరీతంగా ఉన్నది. కళ్ళు చిట్లించుకొని ఆ గాఢ నిశీధిలోకి చూచినా మనకు కలిగే లాభం ఒళ్ళు గగుర్పొడుపే!

ఇంకొక అరగంటలో గుంటూరు వస్తుందనగా అతడు లేచాడు. చేతిలోని పుస్తకాన్ని జేబులో పెట్టుకున్నాడు. ఆ పెట్టెతలుపువద్దకు నడిచి చిన్నగా తలుపుతీసి రెండు చేతులతో బయటవున్న పూచలను పట్టుకొని బాగా బయటకు విరుచుకొని రెండు వైపులా చూచాడు. ఆ ఒణుకుపుట్టే చల్లగాలిని గూడా నిర్లక్ష్యంచేసి అలాగే ఆ చీకట్లోకి చూస్తూ నిలబడిపోయాడు. . . .

రంగనాధరావుగారికి మెళుకువ వచ్చింది. మెలకువ వచ్చిన తరువాత తెలిసింది ఆచెక్కబెంచీ మీద పడుకోవటమనేది ఎంత కష్టమో. బద్ధకంగా లేచి వళ్ళు విరుచుకున్నారు. ఎందుకనో తల దిమ్మెక్కింది. ఒక్కసారి పరికించి నలువైపులా చూచారు.

అకస్మాత్తుగా ఆయన కళ్ళల్లో తను పడుకోబోయేముందు ఎదురుగ్గా కూర్చున్న యువకుడు మెదిలాడు. ''అరె! గుంటూరుదాకా వస్తానన్నాడే అప్పుడే దిగాడే వబ్బా?'' అనుకొని విస్తుపోయారు.

మరుక్షణంలోనే మనస్సులో ఏదో అనుమానం రేకెత్తి ఆదుర్దాగా నడుముకున్న మూటను తడిమి చూచుకున్నారు అది చేతికి తగలటంతో సంతృప్తిగా శ్వాసపీల్చుకొని ''స్నేహితుడెవరైనా కనబడితే మరొక పెట్టెలోకి మారేడేమోనని! మనసుకు సర్దిచెప్పుకున్నాడు. . . . .

రైలు భీకరంగా కూసింది ముందు స్టేషన్‌కు తన రాకను తెలియబరుస్తున్నట్లుగా. గుంటూరు వీధుల్లోని దీపాలు రైల్లోపోతున్న రంగనాధరావుగారికి కనబడినయి ఆ యిళ్ళను, వెలుగుతున్న దీపాలను, వీధులను చూచి అదే గుంటూరయివుంటుందనుకున్నాడు

బండి జనంతోనిండిన ప్లాట్‌ఫారంమీద ఆగింది దూరంగావున్న గుంటూరు అన్న బోర్డును చూచి త్వరత్వరగా లేచాడు. బల్లమీదనున్న ఉత్తరీయాన్నితీసి భుజంమీద వేసుకున్నారు.

సంచికోసరం తలవంచి క్రిందకుచూస్తూ చేతితో తడమసాగారు. తలవంచినవాడు మరి ఎత్తకుండా కళ్ళు పెద్దవి చేసుకొని చూస్తూ ఉండిపోయారు.

కళ్ళు జిగేలుమన్నయి!

ఎదురుగానున్న సీటుక్రింద తళతళలాడే బంగారు గొలుసు మెరుస్తోంది!

చటుక్కున చేతిసంచీ బయటకు లాగారు. నలువైపులా చూచారు ఎవ్వరూలేరు.

''ఎవరిదయి ఉంటుందబ్బా?'' అని అనుమానించాడు.

తను రైలు ఎక్కిన తరువాత ఆ యువకుడుతప్ప మరెవ్వరూ ఎక్కలేదు. సరిగ్గా ఆ గొలుసుపడివున్న స్థలం పై సీట్లోనే అతడు కూర్చున్నాడు. కనుక తప్పకుండా అది అతడిదే అయివుండాలి!

ఒక్కక్షణం ఆలోచించాడు.

ఇప్పుడేంచేయాలో రంగనాధరావుగారికి అర్థం కాలేదు రైల్వేగార్డునిగాని, స్టేషన్‌లోని పోలీసుల్నిగాని పిలిచి దానిని చూపిస్తే తన విధిని నిర్వర్తించినవాడౌతాడేమో ననిపించింది.

మరుక్షణంలోనే ఆ యువకుడు కళ్ళముందు కదిలాడు. విలువైన వస్తువును పోగొట్టుకున్న ఆ అనుభవంలేని లేతమొఖం తనవంకే జాలిగా చూస్తున్నట్లు అనిపించింది

ఈ రోజుల్లో ఎంతలేదన్నా ఆ గొలుసు మూడు నాలుగొందల రూపాయిలకు తక్కువ చేయదు. . . . ఎన్నాళ్ళ కష్టార్జితమో? . . . .తనకు తెలుసు ధనార్జనలోని బాధ!

ఎన్నాళ్ళబట్టో అడుగుతున్న చిట్టిచెల్లెలు కోరిక తీర్చటానికి తీసుకెళ్ళటంలేదుగదా?'' కొత్త భార్య తొలికోరికైతే అతడి హృదయం ఎంతగా విలపిస్తుంది?

రాబోయే వస్తువునిగూర్చి ఉవ్విళ్ళూరుతున్న వారి మనస్సులు అది పోయినందని తెలుసుకొని ఎంతగా బాధపడతాయి?

అతడికి తీసికెళ్ళి యిస్తేనో?

ఎక్కడున్నాడని తను వెతగ్గలడు?

ఒకవేళ అది అతనిది కాకపోతే?. . . . అతడు పారవేసుకుంటుండగా తను చూడలేదుగదా?

ఆలోచనలతో తల తిరిగింది. తలుపుదగ్గర జనం ఎక్కేందుకు ప్రయత్నిస్తున్నారు. . . . . ఏదైనా రెండో మనిషి చూచేలోగానే ఏదో నిర్ణయానికి రావాలి!

పోలీసుల్నిపిలిచి అప్పగించటంవలన ఎన్నో యిబ్బందులున్నయి. . . .ఆ యువకుడు తెలుసుకొని అక్కడికి వచ్చినా అది తనదేనని ఋజువు చేయగలిగివుండాలి! అప్పుడే తన వస్తువును తిరిగి పొందగలుగుతాడు. . . . లేక తడబడ్డాడో. . . . .అతడికి మిగిలేది కంటినీరే!

తోటి మానవుడిగా తను అతడికి చేయగలిగిన సహాయం ఒక్కటే!. . .ఆ యువకుడూ గుంటూరులోనే దిగుతానన్నాడు కాబట్టి, ఇప్పటికి బండి ఆగి కొద్ది నిముషాలే అయింది గనుక, అతడు ఎంతో దూరం వెళ్ళివుండడు. . . . .అతడిని పట్టుకోవటం అది అతడిదని ఒప్పుకొని గుర్తులు చెప్పగలిగితే యిచ్చి వేయటం. . . . లేకపోతే పోలీసు స్టేషన్లో అప్పగించడం!

చటుక్కునతీసి గుప్పిటలో పెట్టుకున్నాడు. క్రిందవున్న సంచీ చేతిలోకి తీసుకున్నాడు. మరొక్క

---

తెలుగు పంతులు:-'ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు' అంటే అర్థమేమిటిరా?

అబ్బాయి:- ఉప్పు, కర్పూరములు వక్కరంగును బోలియుండును. అనగా అవిరెండు నల్లగానుండునని భావమండీ!

నండుల రాధాకృష్ణమూర్తి (వేటపాలెము.)

దేశభాషావారపత్రికలలో సర్క్యులేషన్ ప్రకారం
'ఆంధ్రసచిత్రవారపత్రిక' ఐదవస్థానం ఆక్రమిస్తున్నది.







## బంగారుగొలుసు

సారి అనుమానంగా పెట్టెలో నలుమూలలాచూచి క్రిందకు దిగటానికి ఉపక్రమించారు.

ప్లాట్ఫారం అంతా జనంతో హడావుడిగా వున్నది. ఆడ మొగ విచక్షణ లేకుండా జనం తోసుకుంటూ, పోతున్నారు. పోర్టర్లు హడావుడిగా సామాన్లు మోసుకుంటూ నడుస్తున్నారు.

ప్లాట్ఫారంమీద రంగనాధరావుగారు మునికాళ్ళమీద నిలబడి చూపందినంతవరకు నలుమూలలా చూచారు. కాని ఆ తెల్లచొక్కా పొడుగాటి యువకుడు ఆయన దృష్టిలో పడలేదు!

ఇక ఆలస్యం చేయకుండా ఆయన వడివడిగా నడిచాడు జాగ్రత్తగా ఆ గుంపులలో సందు చేసుకొని పరీక్షిస్తూ ఆయన ఆశ నిరాశఅయింది. రెండుసార్లు ఆ ప్లాట్ఫారంమీద అటునుండి యిటువరకు తిరిగినా అతడు కనబడలేదు. తరువాత ఒకటి, రెండు, నంబరు ప్లాట్ఫారాలు గూడా తిరిగాడు.

ఆయన ప్రయత్నమంతా విఫలమయింది!

చివరికి నిట్టూర్పు విడిచాడు. తను చేయగలిగిన ప్రయత్నమంతా చేశాడు. ఇక అతడి ఖర్మ!

ప్లాట్ఫారంమీద తను దిగిన బండి వెళ్ళిపోబోతోంది రంగనాధరావుగారు తలవంచుకొని ఆఫీసు వైపుకు దిన్నగా నడక సాగించారు

అలా చూసుకుంటూ, పోతున్న ఆయనకు కాఫీ ఫలహారశాల అన్న బోర్డు బారు లైట్ల వెలుగులో జనంతో నిండిన హాలు కనబడ్డాయి. తిరిగి ఆయనలో "ఒకవేళ అత డక్కడ ఉన్నాడేమోననే!" ఆశ మొలకెత్తింది.

"అయినా చూద్దాం!" అనుకుంటూ అటువైపు నడిచి హాలులో కాలుపెట్టాడు. నలువైపులా ఆత్రంగా కళ్ళు పెద్దవి చేసుకొని చూచారు.

ఎడమచేతిమూలగా కాఫీ త్రాగుతూ కూర్చున్న ఆ యువకుడు కంటబడేటప్పటికి తన సొమ్మేపోయి దొరికినంత సంతోషపడ్డారు రంగనాధరావుగారు! ఆనందంతో నోట మాట పెగల్లేదు. చేయెత్తి పిలవబోయారు.

ఆ యువకుడు రంగనాధరావుగారిని చూస్తూనే గతుక్కుమన్నాడు. గుండెలు దడదడ లాడినయి. తను ఆయన డబ్బు తీసుకున్నట్లుగా పసిగట్టలేదుగదా అనుకున్నాడు. త్రాగుతున్న కాఫీని అలాగే వదిలి జేబులోని చేతిరుమాలను తీసి మొఖం తుడుచుకుంటున్నట్లుగా అడ్డుపెట్టుకొని వెనుకవైపు ద్వారంగుండా వడి వడిగా బయటకు నడిచాడు. రంగనాధరావుగారు అతడి నడవడికి తికమకపడ్డారు. పిలుద్దామంటే పేరు తెలియదాయె! అతడిపేరు తెలుసుకునేందుకు విచారించారు.

ఒకటి రెండుసార్లు అప్పటికీ "అబ్బాయి!" అని పిల్చారు.

కాని అతడు వినిపించుకోలేదు . . . . అతడు ఆలాగే తలవంచుకొని వడివడిగా నడుస్తున్నాడు.

రంగనాధరావుగారు చేసేదేమీలేక హెచ్చువేగంతో నడక సాగించారు.

ముందు ఆ యువకుడు!

వెనుక రంగనాధరావుగారు!

క్రీనీడదాటుతూ ఆ యువకుడు అనుమానంగా వెనుదిరిగి చూచాడు!

రంగనాథరావుగారు కూడా వస్తుండటం చూచి, తనలోని అనుమానాన్ని ధృవపరుచుకొని మరింత భీతి జెందాడు! తను చేసినపని ఆయన తెలుసుకున్నాడనటంలో ఇంకేలాటి అనుమానమూలేదు. . . . ఇక ఆయననుండి తను తప్పుకోవటం చాలాకష్టం! కాళ్ళు తడబడుతున్నా అలాగే రంగనాథరావుగారి పిలుపులు తనని కాదన్నట్లుగా వెళుతున్నాడు.

ఆ యిద్దరూ స్టేషన్లోని ప్లాట్ ఫారాలన్నీ తిరిగారు. అత డెటు వెళ్ళినా రంగనాథరావుగారు వదిలిపెట్టకుండా తిరుగుతూనే వున్నారు. కాని ఆ యువకుడు ఎందుకలా గమ్యంలేకుండా తిరుగుతున్నాడో అర్థం కావటంలేదు ఎంత ఆలోచించినా రంగనాథరావుగారికి.

ఆ ముసలాయన తనని వదిలిపెట్టేట్లు లేడని మనస్సులో గొణుక్కుంటూ పట్టాలవెంటబడి స్టేషన్ బయటకు నడిచాడు.

రంగనాథరావుగారు మరింత వేగం హెచ్చించి అతడిని కలుసుకున్నారు.

"అబ్బాయి! పిలుస్తున్నా ఎందుకలా వెళ్ళిపోతావు?

అతడు చేసేదేమీలేక ఆగాడు గుండె దిటువు చేసుకొని "మీరు నన్ను పిలుస్తున్నారా?. . . .నేనొక వ్యక్తికోసరం ఆదుర్దాగా తిరుగుతున్నాను. . . . . అతడు కనబడలేదు!" ఏమీ తెలియనట్లుగా మొహం పెట్టి అన్నాడు.

"ఓహో!" అన్నారు రంగనాథరావుగారు. "ఇటు చూడబ్బాయి . . . . నీవేగదూ నా ఎదురుగ్గా కూర్చున్నది ?"

అతడిగుండె గతుక్కుమన్నది.

చెయ్యి అప్రయత్నంగా జేబులోకిపోయింది జేబులో మడిచివున్న కత్తిని చేతివేళ్ళు తడిమినయి!

"మీరు కుర్రవాళ్ళు. మీకేంతెలుసు దేనికయినా అనుభవం వుండాలి. . . . ప్రయాణాలల్లో మరీనయ్యా . . . . నేను కాబట్టి సరిపోయింది. . . . మరెవరన్నా అయితేనా" చెబుతున్నారు రంగనాథరావుగారు మందలిస్తున్నట్లుగా తీక్షణంగా.

అతడికి ఆ మాటలే తేళ్ళుజెర్రులై వంటిమీద పాకుతున్నట్లనిపిస్తోంది

రంగనాథరావుగారు నవ్వారు "మీ కుర్రవాళ్ళ సంగతి నాకు తెలుసులేవయ్యా! . . . అబ్బాయి, చేసిన పనిని సమర్థించుకో ప్రయత్నించినా ఒప్పుకుండేదిలేదు! . . .అన్నారు అంటూనే పక్క జేబులోనుండి బంగారు గొలుసు బయటకు తీశారు. "ఇదేమిటి తెలుసా ? . . . . . అన్నారు గుప్పిట ముడుస్తూ.

"తెలియదు!"

"నీవు చిన్నవాడివి. . . . . దీనివిలువ కొన్ని వందలు వుంటుంది . . . ఒక బంగారుగొలుసు నాయినా యిది!"

ఆ యువకుడు ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు. శరీరానికి చెమట ఎట్టింది అయితే యీ ముసలాయన సాయంత్రం పెళ్ళిగుంపులో కొట్టేసిన గొలుసును గూడా పసిగట్టాడన్నమాట! తన దురదృష్టంకొద్దీ అది జారిపోయింది కాఫీ త్రాగుతూ చూచుకుంటే అది కనబడలేదు. ఎక్కడ పోయిందా అని తికమకపడుతున్నాడు.

ఆ వస్తువే రంగనాథరావుగారి చేతిలోవున్న దనుకున్నప్పుడు శరీరాన్ని ఒణుకు వూపింది.

తప్పుచేసిన మానవుడి మనస్తత్వమే వేరుగా వుంటుంది. తరువాత దానికి సంబంధించిన సంఘటన ఏది జరిగినా తన తప్పు బయట పడుతున్నట్లే గిలగిలాడుతాడు. అలాగేవుంది అప్పుడు ఆ యువకుడి పరిస్థితి!

ఇక ఏలాంటి అనుమానమూలేదు తన సొమ్ము తీసుకున్న సంగతే తెలుసుకోవటం కాకుండా, ఆ గొలుసు సంగతి గూడా పసిగట్టేశాడు, ఆ ముసలాయన అనుకున్నాడు భారంగా. హృదయం భయంతో మూలిగింది. జేబులోని చేతిపిడికిలిలో కత్తి బలంగా యిరుక్కుంది

"ఎందుకని అలా ఆశ్చర్యపోతావు ? . . . . నోటమాట పెగలటంలేదా?. . .అవును ఎవరికయినా అలాగే వుంటుంది విలువైన వస్తువుని పోగొట్టుకొని తిరిగి సంపాదించుకోగలిగితే. . . . .ఎవరైనా అంతే బాబూ! ఎవరైనా అంతే!" రంగనాథరావుగారి కళ్ళలో తానొక మంచిపని చేశాననే తృప్తి వెలుగుతున్నది.

ప్రతి మానవుడు ఎందుకలా ప్రవర్తించడు? అసలు అలా ప్రవర్తిస్తే లోకంలో అశాంతికి స్థానమే వుండదు. . . .

యువకుడు బెరుకు బెరుకుగా నలువైపులా చూచాడు.

అప్పుడే వారిద్దరిచుట్టూ వింతగా చూస్తూ యిద్దరు ముగ్గురు జేరారు

అనుకోకుండా ఆ యువకుడికి ఆ చుట్టూవున్న మనుష్యుల్ని చూచేటప్పటికి కొద్దిగా చెమట పట్టింది! తాను తనకు తెలియకుండానే ఇనుపకటకటాలవెనుక ఇరుక్కుపోతున్నట్లుగా ఫీలయ్యాడు.

మెదలకుండా ఆ గొలుసు 'నాదే' అని చెప్పి తీసుకు వెళదామా అనిపించింది. కాని ఆ ముసలాయన నాటక మాడుతున్నాడేమోననే అనుమానమూ అతడిలో వున్నది తను, "నాదే" అంటే ఆయన తనుపెళ్ళివారి గుంపులో దొంగిలించినట్లుగా ఒకవిధంగా నిరూపించినట్లే అవుతుంది . . ఆయనెవరో తనకు బాగా తెలియదు!

ఇప్పుడు కత్తితో ఆయనను భయపెట్టటానికయినా చుట్టూ జనం మూగుతున్నారు.

ఎటూ నిశ్చయించుకోలేని అయోమయంలోపడి యిట్టే మురిపించి జారిపోతున్న ఆ వస్తువును చూచి విచారించాడు

"ఏంబాబు! నీదే అనవయ్యా! గుర్తులు చెప్పు ఇచ్చేస్తాను అనవసరంగా పోలీసులదగ్గరికి వెళ్ళవల్సివస్తుంది !"

ఆ యువకుడు ఒక్కక్షణం మౌనం వహించి తిరిగి చటుక్కున అన్నాడు "అది నాదికాదు! నే నేమీ పోగొట్టుకోలేదు!" కళ్ళు మూసుకున్నాడు బలంగా.

రంగనాథరావుగారికి నోటివెంట మాటరాలేదు. అప్రతిభుడై చలనరహితంగా ఆ లా గే నిలబడిపోయాడు!

"నిజంగానా ? . . . . నిజంగా నీదికాదా ?... మరి నాఎదుట నీవుగాక మరెవ్వరూ కూర్చోలేదే? ... నీదిగాక మరెవ్వరిదై ఉంటుంది ?"

యువకుడు తీక్షణంగా చూచాడు ఆయన "నా ఎదుట నీవు తప్ప మరెవ్వరూ కూర్చోలేదు .. అటువంటప్పుడు నావద్దనున్న ఐదువందలు మరెవ్వరు దొంగిలిస్తారు?" అంటున్నట్లుగా భావించాడు.

ఆయన ఐదువందల సంగతి గూడా బయట పెట్టేటంతవరకు గూడా తనను బయటకు పోనిచ్చేటట్లుగాలేడు అనుకొని మరింతగా విసుక్కున్నాడు.

ఈ రోజు ఎవరిమొఖం చూస్తూ తాను బయల్దేరాడో ?

తన ప్రథమ కర్తవ్యం ఈ వూబిలోనుండి ఎంత త్వరగా బయటపడితే అంత మంచిది !

ఆ యువకుడు గుండె దిటువు చేసుకున్నాడు. ఒక్కసారి కళ్ళు మూసుకొని తెరిచాడు. నలువైపులా నిశితంగా పరిశీలించాడు. ఒక్కొక్క అడుగే అతి భయంగా, భారంగా, బరువుగా రంగనాథరావుగారి వైపు వేయసాగాడు.

అతడికళ్ళు ఎర్రబడినయి. మొఖంలో భీకరత్వం కొట్టొచ్చినట్లుగా కనిపిస్తోంది

రంగనాథరావుగారు అతడి వాలకంచూచి చలించి ఒక్క అడుగు వెనక్కువేశారు.

ఆ యువకుడు రంగనాథరావుగారిముందుకు వచ్చి ఆయన కళ్ళలోకి చూస్తూ నిలబడ్డాడు. "మీరే గదూ నా ఎదుట బెంచిమీదపడుకుంది. . ..పుస్తకం చదువుకుంటూ, చదువుకుంటూ క్రిందకు చూచాను. ఈ ఐదువందల రూపాయలు క్రిందపడి గాలికి ఎగురుతున్నయి మీవే అనుకుంటాను తీసుకోండి! అంటూ జేబులోనుండి తీసిన నోట్లు ఆయన చేతిలో కుక్కి వెనుదిరిగి అతిరయంగా వడివడిగా నడుస్తూ దూసుకుపోయాడు. రంగనాథరావుగారు విగ్రహంలా నిలబడిపోయారు

భద్రంగా మూటగట్టి నడుముకు కట్టుకున్న ఐదువందలు క్రింద గాలికి ఎగరటమేమిటి?

హడావుడిగా మూటవిప్పి చూచుకున్నాడు ఐదువందలులేవు గుండె అతివేగంగా కొట్టుకుంది! అర్థరహితంగా విలపించింది.

రంగనాథరావుగారికి తల తిరిగిపోయింది. ఆ క్షణంలోనే గొణుక్కున్నాడు. "తాను పోగొట్టుకొని తిరిగి పొందిన ఐదువందలు కష్టార్జితంగనుకనే తిరిగి తనకు దక్కినయి ! అంతకంటె తనకు కావాల్సిందేమీలేదు . . తా నెంత అదృష్టవంతుడు. ఇంకా నయం ఆ ఐదువందలు ఇంకెవరికంటైనా పడలేదు! ఆ యువకుడు మంచివాడు కాబట్టే సరిపోయింది. . . . .తనవి తనకిచ్చాడు!

ఆ పరిసరాలే మర్చిపోయాడు. తానెందుకు అక్కడికి వచ్చిందిగూడా గుర్తులేని జ్ఞానశూన్యుడయ్యాడు. ఆనందం పరవళ్ళు తొక్కుతుండగా చేతులెత్తి కనబడకుండా వెళ్ళిపోయిన ఆ యువకుడికి నమస్కరించాడు!

నిజంగా అతడే నిజమైన మానవుడంటే!

తనదికానివిలువైన వస్తువును 'తనదికాదు' అన్నాడు!

మరెవ్వరివో దొరికిన ఐదువందలు తిరిగి యిచ్చాడు.

ఈ రోజుల్లో అలాంటి వ్యక్తులు వుండటమనేది చాలా అరుదు. నిజంగా అతడొక భగవంతుడే! తిరిగి పదేపదే అతడికి నమస్కరించాడు.

ఆ డబ్బును భద్రంగా జేబులో పెట్టుకున్నాడు. ఆ గొలుసును చేతితో అలాగే పట్టుకొని పోలీసు స్టేషన్ ఎటువైపుగా వున్నదో కనుక్కునేందుకుగాను లైట్లు వెలుగుతున్న ఆఫీసువైపు నడవసాగాడు!

కాని అప్పటికి ఇప్పటికి ఆయనకి అంతుపట్టని ప్రశ్న ఒక్కటే!—భద్రంగా కాగితాలు నడుమ పెట్టి మూటకట్టి నడుముకు కట్టుకున్న ఆ ఐదు వందలు, ఆ మూట కదలకుండా వుండగా, క్రింద ఎలా ఎగురుతూ ఆ యువకుడికి కనబడినయి?! ★

గృహదేవతార్చన మాచరించును. అప్పుడు అందరు సుష్టుగా పంచభక్ష్య పరమాన్నములు ఆనంద సల్లాపము లొనర్చుచు భోజనములు చేసి తాంబూలములు సేవించి విశ్రమింతురు. మధ్యాహ్నవేళ నుండి సాయంవేళ వరకు శ్రీనాథ మందిరము మంజుల వేద ఘోషతో నాపూర్యమాణమై కేవలము బ్రహ్మ హృదయమువలె భాసించుచుండెను. నిరంతర సావిత్రీ ధ్యానముతో శ్రీనాథుని మూర్తి మూర్తిమంతమైన బ్రాహ్మీ స్వరూపముగా తేజరిల్లుచు దినదినమున నతిశయ కాంతితో విరాజిల్లుచుండెను.

దుగ్గన తన బావతోపాటు పగలు గోక్షీరమే గ్రహించి రాత్రి భుజించుచు ఏకభుక్తి నియమము పాటించుచుండెను. పోతనయు నట్లే చేయుదు నన్నను, శ్రీనాథుడు నిషేధించి 'మా కృష్ణపోతరాజు ప్రొద్దున బాలపంక్తిలోను రాత్రి మా యందరితో వృద్ధపంక్తిలోను భుజింపవలసినదే' యని శాసించుటచే నట్లే చేయుచుండెను.

ఏకాదశాహదీక్ష పూర్తియైనది. సంకల్పించిన జపములు పూర్తియైనవి పదునొకండుగురు ఋత్విక్కులు రుద్ర సంఖ్యాకముగా శతరుద్రీయముతో నభిషేకించుచుండుటచే నిత్యము నొక మహారుద్రము (121) చొప్పున దీక్ష పూర్తియగునప్పటికి అతి రుద్రము (1331) పూర్తి యయ్యెను. వారివికాక శ్రీనాథుడుచేయు నభిషేకములే మహారుద్రమైనది. శ్రీనాథుని పారాయణముతో కలసి పండ్రెండు వేద పారాయణములైనవి.

పండ్రెండవనాడు దీక్షాంగహోమములైనవి. ఆ మరునాడు జాము ప్రొద్దెక్కునప్పటికే తర్పణ మార్జనములు పూర్తి కావించిరి. ఆ మధ్యాహ్నముననే మహా వైభవముగా బ్రాహ్మణ సంతర్పణము జరిగినది. ఆ విందుకు కొండవీటి ప్రధాని మామిడి సింగనకూడ విచ్చేసెను.

అతిథులు విందు కుడుచుచున్న సమయములో శ్రీనాథుడు పంక్తులలో తిరుగుచు మరికొంచెము పుచ్చుకొనుడనుచు బలవంతపెట్టుచుండెను. తనివి తీర భుజించి లక్కనసూరి ఈ చాటువు చెప్పెను.

"తినలేమో కవిసార్వభౌమ యిక
  సంతృప్తా వయం, నీదు క
మ్మని పణ్యారముతోడ బూరెగమితో
  మండెంగతండంబుతో
ననుగుంబాసెముతోడ బాండు
  కలమాహారంబుతో నేతితో
ఘనరంభాఫలఖండ శర్కరలతో,
  గల్పింపవయ్యా దధుల్"

లక్కనసూరి కోరుకొన్న మీగడ పెరుగులతో విందు పూర్తియైనది.

ఆ పిమ్మట గృహాంగణమున వేసియున్న పెద్ద పందిరిలో శ్రీనాథ కవిసార్వభౌముడు మహదాశీర్వచనమునకై విద్వత్సభ కావించెను. అప్పుడు శ్రీనాథ భట్టమూర్తిలో వ్యక్తమైన తేజస్సును శివియు దర్శనీయమై యొప్పారెను. దానికి సింగన ప్రధాని ముగ్ధుడయ్యెను. అప్పుడా సభలో నా మహా ప్రధాని కవిసార్వభౌముని మహాస్థానములోని ప్రధానియయినట్లు గోచరించెను.

వేదవిదులు దిగ్విజయసూచకములగు వేద మంత్ర

# కవిసార్వభౌముడు

(27-వ పేజీ తరువాయి)

ములతో బహు విధముల శ్రీనాథు నాశీర్వదించిరి ఋత్విక్కులను భూరిదక్షిణలతోడను వేద విదులను, పండితులను యథోచిత సంభావనలతోడను అర్చించెను. జయవచనములతో సభ ముగిసినది.

ఆ మరునాడు శ్రీనాథుడు విశ్రాంతి తీసికొనెను. పదునైదవ నా డాతడు అప్పటికి జరిగిన యాత్రా సన్నాహములు సరిచూచి లోపములు సవరింప నేర్పాట్లు చేసెను. ఆనాటి యపరాహ్ణవేళ నాతడు సర్వజ్ఞ చక్రవర్తియగు పెద కోమటి వేమభూపాలుని దర్శించి, సెలవు తీసికొనెను. వీరనారాయణా పరాంకుడగు వేమభూపాలుడు, అప్పటికే వృద్ధుడై యున్నందునో, కాక మరల నీ జన్మలో ఈ మహాకవిని దర్శించు భాగ్యమబ్బునా యను సంశయము మెరపు మెరసినట్లు క్షణకాలము భాసించుటవలననో, మరి యెందువలననోగాని,దృఢమై స్వచ్ఛమగు నా ప్రభువు

భర్త:-(ఆఫీసునుంచి వచ్చి భార్యతో)ఏమేయ్! వంట అయిందా నా కాకలి వేస్తోంది. హోటల్ కన్నా వెళ్తాను.

భార్య:-కొంచెంసేపు ఆగండి.

భర్త:-త్వరగాతయారు చేస్తావా?

భార్య:-ఇల్లు సర్దుకొని నేను గూడా మీ వెంట వస్తాను.

ఎం. వి. సుబ్బారెడ్డి (పొదిలి)

కంఠములో ఈషత్కంపమో గాద్గద్యలేశమో గోచరించినది. శ్రీనాథు డద్దానిని తన విజయ యాత్రా పర్యవసానమును గూర్చిన యావేగముచే కలిగియుండునని యూహించి సరిపెట్టుకొనెను.

అక్కడినుండి బయలుదేరి సింగనప్రధాని మందిరమున కేగెను. మహా ప్రధాని యాతని నేకాంత రహస్య మందిరములోనికి గొంపోయి చాల ప్రొద్దుముచ్చటించెను. అంతసేపును ఆతడు శ్రీనాథునకు విద్యానగర యాత్రా సన్నాహమునకు తాను కావించిన యేర్పాట్లు వివరించి, అక్కడి కొండవీటి రాజ్యస్థానాపతికి సర్వ సౌకర్యములు శ్రీనాథునకు సమకూర్చవలసినదని రాజ ముద్రాంకితమైన యాజ్ఞా పత్రిక యాతని హస్తములలోనుంచి, దాని ప్రతి యప్పటికే స్థానాపతికి పంపియుంటినని తెలియజేసెను తిథివారముల లెక్కను శ్రీనాథుడెప్పు డెక్కడికి జేరవలెనో, ఎప్పు డేమి చేయవలెనో డిండిముని బలమెందున్నదో, ఆతని బలహీనపు తావులేవో, ఎట్లు చేసినచో శ్రీనాథునకు పైచేయి లభించునో—ఇత్యాది వివరములన్నియు లిఖించియున్న పొడుగుపాటి కాగితమొకటి, చీనా పట్టాంశుకమున కంటించియున్నదానిని, చుట్టగాచుట్టి శ్రీనాథున

కందిచ్చి, దానిని దేవతార్చన సంపుటముతోపాటు భద్రముగానుంచుకొనుమని యాదేశించెను. శ్రీనాథుడది విప్పి చదువుకొని మొత్తముమీద తా నాలోచించియున్నదానినే అదియు ఎక్కువ భాగము పోలియున్నదని చెప్పెను. భేదించిన విషయములలో వారు సంప్రదించుకొని ఎవరి యాలోచన మేలుగానున్నదో నిర్ధారించుకొనిరి. కొన్ని యెడల అప్పటి యవసరము ననుబట్టి యుక్తమార్గము నిర్ణయించుకొననగునని వైకల్పిక పక్షములుగా గుర్తుపెట్టుకొనిరి. తుదకు ప్రధాని దిగ్విజయ యాత్రచేసి క్షేమముగా తిరిగి రమ్మని శ్రీనాథు నాశీర్వదించి పంపుచు, "ఈ యాత్రలో మీకు ఎక్కడ ఎంత ధనము కావలసినను ఇచ్చునట్లు బరాతములు వెళ్ళినవి. కొండవీటి ప్రభువుల ధన కోశమంతయు ఈ యాత్రా విజయమునకై పుష్కలముగా తెరచియుండునని గుర్తుంచుకో!" అని గట్టిగా చెప్పెను.

ఆ పిమ్మట శ్రీనాథుడు తన ప్రాణమిత్రమగు వామనభట్టబాణుని కలసికొనెను. వామనుడు ప్రత్యక్షముగా ప్రకటించుకొనకుండినను, ఆతడు డిండిముని చేతులలో పరాభవము రుచి చూచినవాడని అప్తులు చూచాయగా నెరుగుదురు. ఆతడు డిండిముని శాస్త్ర పాటవమును లోపములనేకాక, ఆతని శత్రుమిత్రులను నిర్దేశించి శత్రువులకు పరిచయ పత్రికలిచ్చి ప్రేమ పూర్వకముగా నాశీర్వదించి, నీవు డిండిముని జయించినట్లు వినునంతవరకు క్షీణించుచున్న యీ దేహములో ప్రాణములు ధరించియుందునుసుమా!' అని వీడ్కొలిపెను.

అంతట శ్రీనాథుడు అప్పుడు తనపైనెంత భారమున్నదో పరిగణించుకొనుచు సాయాహ్నవిధులు శీఘ్రగతి నిర్వర్తించి భుజించి విశ్రమించి సుఖనిద్ర చేసెను

శ్రీనాథునితో యాత్ర చేయవలసినవారు వాహనాదికములతో ఆ రాత్రికే శ్రీనాథుని మందిర సమీపమునకు చేరికొని ప్రస్థానభేరికై ఎదురుచూచుచు, సర్వసన్నద్ధులై యుండి దొరకిన తావుల విశ్రమించిరి.

తెల్లవారినచో శనివారము. సూర్యోదయాదిగా నాలుగు గడియలవరకు దుర్ముహూర్తము. యాత్రారంభము అంతకుముందే ఉషఃకాలములో కావలెను. ఈ విజయ యాత్రారంభము ఎట్లు సాగునో తన రాణివాసముతో గూడ కన్నులార చూడనిచ్చగించుచుంటిమని వేమభూనాథు లానతిచ్చియుండిరి దుర్ముహూర్తముదాటిన గడియకుగాని యూరేగింపు ప్రభువుల కంటబడరాదని శ్రీనాథభట్టు శాసించెను.

ఆరాత్రి మూడు జాములవేళ దాటిన కొలది సేపటికే భేరీ నినాదమొకటి ధీరమనోజ్ఞ గంభీరముగా ఎగువకొండవీటి నగర గిరిగహ్వరాంతరములలో ప్రతిధ్వనించినది యాత్రచేయువారందరు రెండు గడియలలో నాయత్తులైరి శకుని విజయయాత్రను గీర్తించు మంగళగీతమును జోడు సన్నాయిలు శ్రావ్య గంభీరముగా గానము చేయుచుండ, రెండు డోళ్ళు తథాస్తు తథాస్తు అనుచున్నట్లు మొరయుచుండెను.

సేవకులు సామానులు బండ్ల కెత్తించిరి. అశ్వికులశ్వము లధిరోహించిరి.భటులు తమ తమ యాయుధములతో బారులు తీరిరి. కొన్ని సామానులు కంచర గాడిదలపై నను, కొన్ని యెడ్లపై పెరికెసంచుల

లోననే ఎత్తబడినవి. పలువురు యాత్రికులు బండ్లలోనెక్కి కూర్చుండిరి పల్లకియు మేనాయు శ్రీనాథుని గృహ ద్వారమున కెదురుగా నిలిచియున్నవి. అవి ఖాళీగా నున్నవి. శ్రీనాథుడు స్నాన సంధ్యాదు లాచరించి దేవసదనమువద్ద సిద్ధముగా కూర్చుండెను.

ప్రయాణవేళ సూచించు మనోజ్ఞఘంటా రావము శ్రవణపర్వమయ్యెను. శ్రీనాథుడు లేచి పర మేశ్వరునకు నమస్కరించి దేవ సంపుటము భార్య చేతులలో నుంచి సర్వ మంగళాధ్యానపురస్సరముగా యాత్రాకాలమున చేయు స్తోత్రములు పఠించుచు, ముందు నలుగురు **వేదవిదులు** స్వస్తిచెప్పుచుండగా బయలుదేరి వీథిలో నడుగిడెను.

శ్రీదేవి దేవ సంపుటమును మేనాలోపీఠముపై నుంచెను. విద్యాంసుల సెలవు తీసికొని శ్రీనాథుడు పల్లకిలో గూరుచుండెను. దుగ్గనయు, పోతనయు వెంటనుండి ప్రీతివచనములు పలుకుచుండగా శ్రీదేవి మేనాలో నుపవిష్ట యయ్యెను.

"అక్కా, ఇప్పుడు బావ వెడలుచున్న విజయ లక్ష్మీ స్వయంవరయాత్రకు బయలుదేరుచున్న నీవు, సరిగా సత్యా వివాహమునకు శ్రీకృష్ణునివెంట బయలుదేరిన రుక్మిణీదేవివలెనే కనబడుచున్నావు" అని పోతన పలికి, అక్కడనే నిలిపియున్న విజయ ధ్వజము చేతబట్టి, మరియొక ధ్వజము చేతబట్టిన దుగ్గనతోకలసి బయలుదేరెను. వా రిద్దరు తమ కాయత్తములైయున్న హయము లారోహించిరి జయఘోషలమధ్య పల్లకిని మేనాను బోయీ లెత్తుకొనిరి.

మధుర మంగళనాదముతో ముందు బాజాలు సాగినవి. వెదుళ్ల చెరువులోనుండి నీరు తెచ్చుచున్న బ్రహ్మణ సువాసినులు పూర్ణజలకుంభములతో శ్రీ దేవీ శ్రీనాథుల కెదురైరి

మంగళ తూర్యములవెనుక రెండు ఆట గుర్రము లను చిత్ర చిత్రముగా కదను త్రొక్కించి యాడించుచు, ఒయ్యారముగా గుర్రముల యాటగాండ్రు సాగుచుండిరి. వారివెనుక నైదు వరుసలలో చీనాం బరాలంకృతములగు నిరువది యుత్తమాశ్వములపై ఆశ్వికయోధులు ఖడ్గశూలాద్యాయుధములతో సాగిరి. ఆ వెనుక పర్వతమల్లు తన భీమకాయము ప్రదర్శించుచు జెట్టివేషము ధరించి మీసములు దువ్వుచు, తొడలు చరచుచు నడచెను. ఆతనివెంట అట్టి వేష ముతోడనే ఆతని శిష్యులు నలువురును వారివెనుక సర్వాయుధహస్తులగు పదిమంది కాలిబంట్లును నడచుచుండిరి.

ఆ తరువాత వందిమాగధులగు నిద్దరు భట్టులు శ్రీనాథకవిసార్వభౌమునకు వీచోపు లిచుచ్చు పల్లకి కభి ముఖులై వెనుక వెనుకకు నడచుచుండిరి.

ఆవెనుక విజయ ధ్వజములతో పోతన దుగ్గన లును, ఆ పిమ్మట స్వస్తివాచకులగు వేదవిదులును, తర్వాత శ్రీనాథుని పల్లకియు, శ్రీదేవి మేనాయును, అంతట బండ్లు నిత్యాదులును, అందరికి వెనుక నలుగురు రౌతులును నలుగురు భటులును సర్వమును కాపుచేయుచు సాగుచుండిరి

ఈవిధముగా పెండ్లినడకతో పల్లకియు, మేనాయు పచ్చని యాకుల తోరణముతో నలంకృతమైన ప్రక్కయింటికి చేరినవి. ఇంటిలోనుండి సువాసి నులు కలకలలాడుచూవచ్చి, కర్పూరహారతితెచ్చి శ్రీదేవి శ్రీ నాథుల కన్నులకద్ది దీవించిరి. ఇట్లు ఇంటింటి యొద్ద నాగుచు ఇంటింట నారతులు గొనుచు నా యుత్సవము సాగుచుండెను చత్వరములలో నెక్కువ సేపాగుచుండెను.

సూర్యోదయమైనది. దుర్ముహూర్తము దాటిన మరి రెండు గడియలకు ఆ యూరేగింపు కొండవీటి ప్రభువుల గృహరాజసౌధము చేరికొనెను.

ఆ సౌధతలమున సుఖోపవిష్టుడై సర్వజ్ఞ చక్రవర్తి యానందబాష్పములతో తిలకించుచుండెను. రాణివాస స్త్రీలు కొందరు సోరణగండ్లనుండి చూచు చుండిరి వారిలో కొందరు బాగుగా చూడవలెనను నుత్కంఠతో అంతఃపుర మర్యాద లుల్లంగించి అట్టాలి కమునకు వచ్చి నిలిచిరి. ఆనాడు మహోత్సవము ప్రకటించి వేమభూపాలుడు వారి కట్టి స్వేచ్ఛ కనుజ్ఞ యుచ్చియుండెను.

రాజద్వారమున మంగళకలశహస్తలైన దాసీకన్యకా జనము నిలిచియుండెను.

ముందు ఉత్సవములోని సన్నాయి రాజద్వారము నెదుట నిలిచినది. శ్రీరాగమున మహేంద్రవిజయ కీర్తనపాడి డోళ్లమీద లయను ప్రస్తరించి మేళము ముందుకు కదలెను. రెండు ఆట గుర్రములువచ్చి తలలువంచి ప్రభువులకు వందనమాచరించినవి. వాని యాట ప్రదర్శించుటకు వీథిలో దూరము వరకు నడ్డులేకుండ భటులు సద్దించిరి. రెండు గుర్రములును క్షణకాలము శృంగార నృత్యము కావించి నవి. ఆ యుత్తరక్షణమున ఆట నాయకుడు వీరణము గొని వీరాంగము వాదింపజొచ్చెను. వెంటనే గుర్ర ములు రెండును రోషముతో వేరైనవి. ఒకటి రోష ముతో రొజుచు ఠీవిగా నిలిచినది. రెండవది ముందుకు పోయి గిరుక్కున వెను దిరిగి రోషముతో మొదటి దాని కెదురువచ్చినది. ఇప్పుడా గుర్రములు ఇద్దరు వీరుల ద్వంద్వయుద్ధము ననుకరించుచు వీర నృత్యము చేసినవి. ఒకదాని నొకటి నొరసికొనుటలో వాని నడకలలో చిందులలో తల విసరులలో చూపులలో జూళ్ళ, తోకల విదలింపులలో వీరావేశముతో నొకదాని నొకటి మట్టగింప యత్నించునట్లే అవి నృత్యము చేసినవి. ఆ యపూర్వ నృత్యమును కొండవీటి జనులు ఉత్కంఠితులై రోమాంచములతో తిలకించుచుండిరి. ఆ వీర విహారము పావు గడియకంటె పట్టలేదు. ఆ పావు గడియయే జాములవలె చూచువారికి తోచెను.

ఆకస్మికముగా ఎదురువచ్చిన యశ్వము విసి తమై మొదటి యశ్వముముందు నిలిచినది. మొదటి యశ్వము విజయావేశముతో తన రెండు ముంగాళ్ళు పైకెత్తి ఎదురువచ్చిన హయ శిరస్సుపై పెట్టు చున్నదానివలె క్షణకాలము వెనుక కాళ్లపై నిలిచి నది. అంతే! వీరణమాగినది. రెండు హయములు ముఖము ముఖము రాచుకొన్నవి. యథాప్రకారము సాధు నృత్యము చేయుచు రెండును ప్రభువున్న మేడపైకి తలలు రిక్కించినవి. వేమప్రభువు ఆ ప్రదర్శనమున కుప్పొంగి సౌధాట్టాలకమునుండియే గుప్పెడు వరహాలు అశ్వ శిక్షకుని యొడిలో పోసెను.

ఆట గుర్రములు సాగిపోయినవి ఆశ్వికభటులు అశ్వ శిరస్సులతోబాటు తమ శిరస్సులునువంచి ప్రభు వుకు వందనము చేసి ముందుకు సాగిపోయిరి.

అంతట ఏకాంగవీరుడగు పర్వతమల్లు తన మహోన్నతమూర్తితో రాజవీధిని విందించుచు గజ గమనముతోవచ్చి నిలిచి వేమప్రభువులకు వంగి వందన మాచరించెను. వెంటనే యాతడు మెరపు మెరసినట్లు ఎగిరి తన దక్షిణ భుజదండముపై మోండా కొట్టెను. ఆ దెబ్బకు భూమియంతయు కంపించినది గజాసురుని వప్రక్రీడలకు కైలాసము వలెనే గృహరాజసౌధమును అదరినది. అతడు ఆ వెంటనేలేచి వామభుజదండముతో మోండాకొట్టెను. ఇట్లు నిలువు మోండాల తర్వాత పీపు మోండ ప్రద ర్శించెను. నలుగురు శిష్యులు కష్టముతో మోసికొని తెచ్చిన రెండు మహా గద లవలీలగా నందుకొని గిరగిర త్రిప్పెను. అంతట తన దేహము కుంచించుకొని మహారజ్జువులతో గట్టిగా బిగింపజేసికొని, ఉత్తర క్షణమున తన యంగములు విదలించుకొని రజ్జువు లెక్కడివక్కడ ఖండ ఖండములుగా తునియజేసెను. పదిమంది మోసి తెచ్చిన దృఢమగు నాయస పరి ఘను తన మోకాళ్ళపై నుంచి చేతులతో లాగిపట్టి దాని నరచంద్రాకారముగా వంచివేసెను

ఆపిమ్మట తన వజ్రకాయము ప్రదర్శించుటకై తన శిష్యులకు నలుగురికి చేవగల నాలుగు పచ్చి వెదురు కర్రలిచ్చి తన భుజదండములు వీపు ఉరము పార్శ్వ ములు చూపి చేతనైనంతబలముగా కొట్టుడని నిశ్చల పర్వతమువలె నిలుచుండెను దెబ్బదెబ్బకు "జయ వీరహనుమాన్!" అనుచు ఠీవిగా తల ఒక ప్రక్కకు ఎగురవేయుచుండెను. ఆ దెబ్బలు వజ్రాఘాతముల వలె కొండవీటినగరమునను పర్వత సానువులను ప్రతిధ్వను లీనెను. నాలుగుకర్రలు జజ్జు జజ్జు అయి నవి. పర్వతమల్లు చర్మము కందనైన కందలేదు. అరగడియపాటు ఇట్లు మల్ల ప్రదర్శనముచేసి, వినీతుడై ప్రభువుకు నమస్కరించెను వేమభూపా లుడు సంతుష్టుడై సువర్ణముల సంచి పైనుంచి జారవిడువగా నా సంచిని లీలగా వంచిన తన శిరస్సుతో గ్రహించి చేతులనందుకొని కన్నులకద్దుకొని ముందుకు సాగెను

పదాతు లంతట ఖడ్గ గదాదుల వివిధ భ్రమణములు కొలది క్షణములు ప్రదర్శించి ప్రభువుకు నమస్క రించి ముందరికి సాగిపోయిరి

ఇప్పుడు శ్రీనాథుడెక్కినపల్లకి గృహరాజసౌధము నుండి చూడనయ్యెను ఎంతటివారైనను పల్లకి ఆపి దిగి పాదచారులైగాని, రాజమందిరమునుదాటిపోరాదు. కాని యా క్రిందటి సాయంకాలముననే వేమప్రభ వులు శ్రీనాథ కవిసార్వభౌములను సమస్త లాంఛనము లతో సాగుచుండ చూడ నిచ్చకలదనియు, రాజాంగణ మునగూడ పల్లకి మేనాలు దింపవలదనియు, శాసించు టచే, బోయీలు పల్లకిని దింపలేదు.

వంది మాగధులు వీచోపు లిచ్చుచుండిరి.

"వినమత్కాకతి సార్వభౌమ శ్రీ మత్కుమార నాథ పౌత్ర, మారయార్యపుత్ర! సకల విద్యాసనాథ శ్రీనాథ బహుపరాక్!" అనుచు మాగధుడు వీచోపు లిచ్చెను.

"శ్రీ వీరనారాయణ కరుణాసారప్రసాద విశృంఖల కవితా మార్గ సంచార, సకల విద్యాసనాథ శ్రీనాథ జయీభవ! సర్వజ్ఞ చక్రవర్తి పెదకోమటి వేమనృపచూడామణిప్రసాదాసాదిత కవిసార్వభౌమాంక! విజయీభవ! కుండినపురీ విద్యాధికారపదవీ సనాథ శ్రీనాథ జయీభవ! వామన భట్ట బాణ కవీశ్వరాపరప్రాణ! విజయీభవ!—" ఇత్యాదిగా వంది వీచోపు లిచ్చుచు మాగధునితో కలసి వెనుక వెనుకకు నడచుచుండెను.

ఆ వెనుక సర్వాలంకృతములగు రెండుత్తమా శ్వములపై నెక్కి విజయ ధ్వజములు ధరించి పాలు గారుచున్న ముఖములతో దుగ్గనయు పోతనయు

కానసైరి. వారు బలరామ కృష్ణులో, రామలక్ష్మణులో నరనారాయణులో అనిపింపగా వేమభూపాలు డప్రయత్నముగా భక్తితో చేతులు జోడించెను.

వారి వెనుక వేదవిదులు స్వస్తిచెప్పుచు నెమ్మదిగా సాగుచుండిరి. ఆవెనుక సౌధగోపురముముందు శ్రీ నాథునిపల్లకియు దానికి వెనుక మూడు ధనుస్సుల దూరమున శ్రీదేవి మేనాయు నిలిచినవి. వెంటనే దాసీజనము రెండు పెద్ద తెరలుతెచ్చి రాజద్వారము నుండి శ్రీదేవి మేనా ముందు వెనుకలవరకు నెత్తుగా పట్టుకొని నిలిచి సిద్ధమైనదని హెచ్చరిక చేసిరి.

వేమప్రభుని యానతిని యువరాజగు రాచవేమారెడ్డి రాజపురోహితపురస్సరముగా సౌధమునుండి దిగివచ్చి బంగారు జలతారులో—మనోహర చిత్రచిత్రితములైన రెండు కాశ్మీరు శాలువలు పురోహితులచే కవిసార్వభౌములకు సమర్పించి నమస్కరించెను.

అవల వేమ మహీనాథుని పట్టమహిషి సూరాంబ పురోహితపత్నిని ముందుంచుకొని, స్వయముగా ప్రీతి చిప్పిలుచున్న గంభీర మనోజ్ఞమూర్తితో రెండు తెరల నడుమనుండి శ్రీదేవి మేనాయొద్దకు వచ్చెను. పురోహితపత్ని శ్రీదేవి ముఖమున కుంకుమబొట్టు పెట్టి సూరాంబా మహారాజ్ఞి తెప్పించిన రెండు ముత్యాల కుచ్చుల పట్టుచీరలు సమర్పింపగా, శ్రీదేవి గ్రహించి కన్నుల కద్దుకొని భక్తితాత్పర్యములతో వానిని తన మేనాలోనున్న దేవసంపుటము పాదసన్నిధినుంచెను. మహారాజ్ఞి బహూకృతినిజూచి ఇతర రాణివాసజనము లును రంగు రంగుల చీరలు, రవికలు నర్పించిరి. శ్రీదేవి యన్నిటి నట్లే ప్రీతి పూర్వకముగా గ్రహించి దేవసంపుటమువద్ద భక్తితో నుంచుచుండెను. ఆ పట్టు చీరలతో మేనా నిండిపోయెను. ఆ రాణివాస వనితాజనముల సంతోష కలకలము శ్రీ నగరము లోని వాగ్దేవతల కలకలారావమునే అనుకరించెను.

అంతట ముత్యాల ముగ్గులు కూర్చిన బంగరు పళ్ళెరములో పచ్చకప్పురపు టారతి పురోహితపత్ని వెలిగించి, ముందు దేవతార్చన సంపుటమునకును, తరువాత శ్రీదేవికిని సమర్పించి ఆ జ్యోతిని శ్రీదేవి కన్నులకద్ది తన కన్నుల కద్దుకొనెను. సూరాంబా మహారాజ్ఞియు రాణివాస జనమును ఆ జ్యోతికాంతు లను తమ కన్నుల కద్దుకొనిరి.

అదే సమయమున వారికి ముందు దేవదాసీ కన్యకాజనము శ్రీనాథునకు బంగరుపళ్ళెరములోపచ్చల హారతిపట్టి, మధురకంఠములు మేళవించి విజయ గీత మాలాపించుచు నృత్యపురస్సరముగా నా కర్పూర జ్యోతిని కన్నుల కద్దిరి. వెంటనే దోసెడు సువర్ణ ములు ఆ పళ్ళెరములో నుంచగా నా దేవదాసీజనము నృత్యపురస్సరముగా నమస్కరించి గ్రహించి గీతము ముగించుచు నిలుచుండిరి.

ఉత్సవ మిక సాగిపోవుటకు వేమ ప్రభువుల యను మతి సూచించు శంఖారావము వినవైనది. క్షణములో రాణివాస జనము తెరల నడుమనుండి యదృశ్యమైనది. తెరలును వెనుకకుపోయినవి. రాజ పురోహితుడును యువరాజును, దేవదాసీ కన్యకాపురస్సరముగా మందిరములోనికేగిరి. పల్లకియు దానివెనుక మేనాయు, ఆ వెనుక బండ్లును నెమ్మదిగా ముందుకు తరలినవి. రాజమందిరము దాటువరకు నా యూరేగింపు నెమ్మదిగా సాగి ఆ పిమ్మట వేగము హెచ్చించెను. ఆనాటి మధ్యాహ్నమునకు వారు దిగువ కొండవీడు చేరికొని మొదటి మజిలీ చేసిరి.

# కవిసార్వభౌముడు

అక్కడినుండి మూడు జాములకు బయలుదేరి పూర్వోక్త వైభవముతో నూరేగుచు నెమ్మదిగా తరలి ఆరతులు పట్టించుకొనుచు సంధ్యావేళకు పూర్వమే నగరముదాటి, వేగము హెచ్చించి సమీపముననే సూరాంబ కట్టించిన సంతాన సాగర నగరము (దీని నికాలములో ఫిరంగి (ఫరంగిపుర) మనుచున్నారు.) చేరి ఆరాత్రి కక్కడ మజిలీ చేసిరి.

ఆ మరునాటి యుదయము నుండి వారి ప్రయాణ వేగ మించుక హెచ్చయ్యెను. ఆవలిమజిలీకి వారు చేరుటకుపూర్వమే ఒక జట్టు సేవకులు వంటల వారు ముందుపోయి అక్కడ కావలసిన వసతులు సమకూర్చి యాత్రికులు వచ్చువేళకు వంటలుచేసి స్నానపానాదులకు సమస్తము సిద్ధము చేయుచుండు టచే యాత్ర సుఖముగా నుండెను. కొండవీటి రాజ్యము సరిహద్దులు దాటిపోవువరకు రాజవైభవముగా నుత్సవము తరలింపవలెనని రాజాజ్ఞయై నందున, దినమునకు ఒకటిన్నర యోజనములు కూడ యాత్ర సాగుటలేదు. దారిలో నూరూరను మొత్తముమీద కొండవీటిలోవలెనే వారి యాత్రోత్సవము సాగుచుండెను.

వారికి దారిలో నప్పటి గురజాలసీమలోని దక్షిణ భాగము తగిలెను. కొండవీటిసీమలోకంటెను గురజాల సీమలో నీటి యెద్దడి యెక్కువ. వారు దిగిన మొదటి గ్రామములోనే నీరు లభించుట కష్టసాధ్యమయ్యెను. శ్రీనాథుని స్నానమునకు నాలుగు చెంబుల జలముంచిరి. ఆయనతో వచ్చిన విద్వాంసులకును అట్లే నీరు కొలిచి యిచ్చిరి. ఎట్లు స్నానములు చేయగలము మహాదేవా యని వార లొకరిమొగము లొకరు చూచుకొని నవ్వు కొనుచుండిరి.వారి విడిది యా మధ్యాహ్నవేళ ఆయూరి శివాలయమున కెదురుగానే ఏర్పాటైయుండెను. శ్రీనాథుడును నవ్వుచు చేతిలో నుదకపాత్ర పట్టుకొని ఆక్కడి యీశ్వరుని దిక్కు మొగమై ఈ పద్యము చెప్పెను :

"సిరిగలవానికి జెల్లును
దరుణుల బదియారువేల దగ బెండ్లాడన్
తిరిపెమున కిద్ద రాండ్రా,
పరమేశా, గంగ విడుము, పార్వతి చాలున్!"

అక్కడనే చేరియొక చెంబెడు స్నానోదకము లభించిన దుగ్గనయు, పోతనయు పకపకలాడుచు నా పద్యమే చదివిరి. అప్పుడు చిత్రము జరిగినదని ఆయూరివారిప్పటికిని చెప్పుదురు. ఆయూరిప్రక్కనే వాగుకలదు. అందులో నీరు లేనందున ఎండిననీటి జాలుతావున ఇసుకతీసి గుంటలు చేయుచుండిరి. పర్వతమల్లు తపనతో నట్లే గుంట చేయుచుండెను. ఆకస్మికముగా నందులోనుండి నీటిబుగ్గ యొకటిపొంగి ప్రవహింపసాగినదట. వెంటనే సేవకు లీ శుభవార్త శ్రీనాథాదులకు తెలిపి వారి స్నానపానాదులకు జలము పుష్కలముగా నందించిరి.

అందరు శ్రీనాథుని వాఙ్మహత్వమును శ్లాఘించు చుండ శ్రీనాథుడు గంభీరముగా 'కాదు, నాది కాదు. అది మా గోపాలకృష్ణుని మహత్త్వము' అనుచు పోతనను నిర్దేశించెను.

ఇట్లు కొండవీటి రాజ్యములో వారి యాత్ర రాజ భోగముగా సాగుచుండెను. గ్రామాధికారులు, గ్రామీణులు వారికి సగౌరవముగా సర్వ సౌకర్యములు కల్పించు చుండిరి. రెండే మజిలీలు మిగిలియున్నవి. అందుతో మొదటిది పులిపాడు.

యాత్రికులకు భోజనాదికములు సిద్ధపరచుటకు ముందుగా తరలినజట్టు సేవకులకు ఆయూరి కరణముగాని, కాపుకాని 'నేడు'కాని కనిపింపలేదు. గ్రామీణులెవ్వరు వారికి వసతి కల్పించుటకు వీలు లేదనిరి. ఊరిబయట తోపులో విడియుదమన్న నక్కడ గొడ్లు గోదలు కట్టివేసి యడ్డంకులు కల్పించిరి. నిలువ నీడ దొరకక వా రల్లాడుచుండిరి. అందుచే యాత్రికు లా మకాము చేరునప్పటికి ఏమియు సిద్ధముగా లేవు. అప్పటికి జాము ప్రొద్దెక్కినది.

శ్రీనాథున కీ విషయము తెలియగానే ముఖము చిట్లించెను. తమవెంట వచ్చుచున్న కొండవీటి కరణము మాచయ్యను రాజాజ్ఞా పత్రముతో నూరిలోని కంపెను. అతడువెళ్ళి విచారించివచ్చి గ్రామోద్యోగులు ఇండ్లలో నుండియే ఊరిలోలేరని ముఖము తప్పించుచుండిరనియు, గ్రామీణులు కూడ యాత్రికులను దోచుకొను నభ్యాసముకలవారను ప్రతీతి కలదనియు నివేదించెను. శ్రీనాథుడది యాలకించి పర్వతమల్లును పిలిచి వెంటనే బలవంతముగానైన వసతులు, సామగ్రులు నేర్పాటు చేయుమని యాజ్ఞాపించెను.

పర్వతమల్లు శిష్యులతో బయలుదేరి కరణము నింటిలో జొరబడి చావడి ఖాళీ చేయించి, వంటకు పాత్రాదికములకై వంట యింటిలోనికి పోబోవు చుండ నక్కడనున్న యొక స్త్రీ వ్యక్తి వడకుచు వారు కోరిన పాత్ర సామగ్రి యందించెను.

ఆ యూరిలో వెచ్చములు విక్రయించుటకు బచ్చులెవ్వరు నుండనందున పెద్దకాపే గ్రామీణులకు కావలసిన పదార్థములు తెప్పించి యమ్ముచుండెను. మల్లు కాపుఇంటిలో ప్రవేశించి కావలసిన సరకులు పట్టించి విడిదికి పంపించెను.

అంతట నాతడు నేని (గ్రామనాయకుని) దొడ్డిలో ప్రవేశించి తమతో వచ్చిన గుర్రములకు, ఎడ్లకు కంచరగాడిదలకు అవసరమగు గ్రాసాదికము పట్టించుకొని తరలెను.

పిమ్మట ఊరిబయట తోపులో గ్రామీణులు ఆక్రమింప కల్పించిన యడ్డంకులన్నియు తొలగించి బండ్లు మొదలగునవి దిగుట కనువు కలిగించెను. ఆతని భీమకాయమును ఉగ్రమూర్తిని వెంటనున్న సాయుధ పరివారమునుజూచి ఊరి వా రెవ్వరు నోరు కదపుటకు గూడ సాహసింపలేదు. సాయుధులగు భటులు అశ్వికులు ఊరి నడి వీధులలోను ఊరి బయటను కాపు కాయజొచ్చిరి. ఊరు గడగడలాడి పోయినది.

మూడు జాములవేళకు శ్రీనాథాదుల కానాటి భోజనాదికములైనవి. అప్పటికిని గ్రామోద్యోగులు కనబడలేదు. కరణము నింటిలోనున్న స్త్రీ వ్యక్తి యాతడు వివాహమాడిన భార్యకాదని తెలియ వచ్చినది. గ్రామకాపు, గ్రామనేడు గౌరవ సంసారములు చేయువారుకారని తెలిసినది. ఆ చుట్టు పట్టుల రెండు యోజనములవరకుగల చిట్టడవిలో జరుగు దొంగతనములన్నియు నీయూరివారు చేయు నవే యని తెలిసినది.

శ్రీనాథునితోడి పండితులకు భయమయ్యెను. "ఇంత ధనముతో స్త్రీలతో గూడ చిట్టడవిలో దొంగలయూరిలో క్షణమాగుట యుక్తముకాదు" అనిరి. మాచయ్యయు "దుష్టులకు దూరముగా

ముండుట మేలుగదా!'' అనెను. శ్రీనాథున కా మాటలు వచ్చినట్లులేదు. ఆత డయూరిలోనే స్థిర నివాసము చేయ సంకల్పించినవానివలె కన్పడెను. ఆవల ఇంటి వంచలో పులి జూదమాడుచున్న దుగ్గన, పోతనల నాతడు పిలిచెను. వా రాడుచున్న యాట మాటలే ఉత్సాహముతో పలుకుకొనుచు వచ్చుచుండిరి.

దుగ్గన : నా పులులు నీ మేకల నెన్నిటిని మింగి నవో చూచావా?

పోతన : తొందరపడకు. నీ పులులఆట కట్టబోతున్నది. రెండే ఎత్తులు!

వా రెదుటికిరాగానే శ్రీనాథుడు "మీ కీయూరు ఎట్లున్నది?' అని ప్రశ్నించెను పర్వతమల్లు దర్పము చూచినందున వా రుల్లాసముగా నుండిరి.

"ఆ గ్రామాధికారులు ఎట్లా ఉంటారో చూడ వలెనని కుతూహలంగా ఉన్నది'' అని పోతన పలికెను.

"సరిగా నాకు నదియే స్ఫురించినది. ఉపశ్రుతికై ఈ బాలుర నడిగితిని— మనకు భయములేదు. గ్రామాధికారులు కనబడువరకు ఈ యూరనే తిష్ఠ వేసెదము!''

శ్రీనాథుని యాజ్ఞ ప్రకారము పర్వతమల్లు మూడు దినములకు సరిపోవు ద్రవ్యములు గ్రాసాదులు గ్రామకాపు సేళ్ల ఇండ్లనుండి తెప్పించెను. అది చలికాలముగుటచే సుకుమారులైనవారు రాత్రి సుఖముగా వెళ్ళగా తలదాచుకొనుట కనుకూలముగా నాలుగు పెద్దయిండ్లలోని గ్రామీణులను వెడల గొట్టి ఖాళీ చేయించెను. ఆరాత్రియంతయు భటులు గ్రామ మధ్యమునను వెలుపలను కాపు కాచిరి. ఎట్టి ఒడుదుడుకులు లేకుండ నా రాత్రి గడచినది.

తెల్లవారినది. గ్రామోద్యోగులు కనబడునంతవరకు తా మందరము గ్రామీణుల ఖర్చుతో నక్కడేనే బస చేసెదమని శ్రీనాథుడు చాటింపు చేయించెను. శ్రీనాథుడు భోజనము చేయుచుండగనే కరణము దర్శనార్థము వచ్చెనను వార్త వచ్చినది. తాను విశ్రాంతి తీసికొన్న తర్వాతగాని మాటాడ వీలు లేదని శ్రీ నాథుడు ప్రతివార్త పంపెను.

శ్రీనాథుడు నెమ్మదిగా భుజించి తాంబూలము సేవించుచు పండితులతో ఇష్టాగోష్ఠి చేయుచున్నంత సేపును, ఆవల కరణము కాచుకొనియున్నను ఆతనివంక చూడనైనలేదు. సుఖనిద్రచేసి లేచి సుఖాసీనుడైన యనంతరమున మాచయ్యను పిలిచి గ్రామోద్యోగులు వచ్చిరేమో కనుగొనుమనెను వారు వాకిట కాచుకొనియున్నారని విన్నవించి లోనికి పిలిపించెను. వారు పెట్టుచున్న నమస్కారాదులు ప్రతిగ్రహింపకయే తన కరణము మాచయ్యవంక తిరిగి "వీరు నేమ ప్రభువుల యాజ్ఞలేల పాలింపలేదో విచారింపుము'' అని పండితగోష్ఠి సాగించెను.

కాపు నేళ్ళ తమకు ప్రభువుల యాజ్ఞాపత్రము సంగతి కరణము తెలుపలేదనిరి. కరణము తానెప్పుడో వారికి రాజాజ్ఞతెలిపి, నిన్ననే అత్యవసరముగా తాను గ్రామాంతరమేగుచు, మరి మరి కాపునేళ్లకు జ్ఞాపకముచేసి వెళ్ళితిననియు వా రబద్ధమాడుచున్నారనియు పలికెను. వా రిరువురు తాము వఱాజ్ఞాళ్ళనుండి గ్రామములోనే లేమనియు, కరణ మెప్పుడు నిట్లే యబద్ధమాడుననియుతెలిపిరి. వారి వాఙ్మూలములు వ్రాసికొనివచ్చి మాచయ్య శ్రీనాథునకు చూపించెను. ఆయన చదివి ఇట్లా జ్ఞాపించెను.

"సరే, ఇది కొండవీడు పంపించు! వెంటనే మన ముందు మకామునకు ప్రయాణము కావలె!''

రెండు గడియలలో అందరు ప్రయాణమునకు సిద్ధమైరి. తమ ఇండ్లనుండి పట్టుకొనిపోయిన సరకులకు గ్రాసమునకు మూల్యమిప్పింపుమని మాచయ్యను వేడికొన, నాతడు తా నన్నియు సరిగా లెక్క వ్రాసిపంపుచున్నాననియు, మూల్యము రాజధానినుండి తెప్పించుకొనవచ్చునని చెప్పెను.

శ్రీనాథుడు పర్వతమల్లును పిలిచి "ముందు మకాములో మనకే పాత్ర సామగ్రి యవసరము. ఈ గ్రామ కరణమునింటినుండి తీసికొన్నవన్నియు బండ్లకెత్తించి రేపు ఏనుగుపాలెము మకామునుండి తిరిగి తీసికొనిపొమ్మని చెప్పుము'' అని యాజ్ఞాపించి పల్లకిలో కూర్చుండెను.

గ్రామోద్యోగులు మొత్తుకొనుచు నేదో శ్రీనాథునకు చెప్పుకొనబోవుచుండ వారిని పర్వతమల్లు దగ్గరకి రానీకుండ వారించెను. కరణము మాచయ్య కాళ్ళు

కాబోయే మామగారు వియ్యంకునితో:—ఇల్లంతా బలే శుభ్రంగా ఉంది. ఇల్లే ఇంత ఇదిగా ఉంటే అబ్బాయి ఇంకెంత ఇదిగా ఉంటాడో. ఏం ఉద్యోగం చేస్తున్నాడు?

వియ్యంకుడు:-అదే...అదే... తాపీ పని.

వి. అర్. శేఖర్ (చేబ్రోలు)

చేతులు పట్టుకొని తమ యూరిలో జరిగినది రాజధానికి వ్రాయవద్దనియు, నష్టమంతయు తామే భరించుకొందుమనియు బ్రతిమాలుకొనెను.

"వీలులేదు. నీకు విద్యాధికారి శ్రీనాథ కవిసార్వభౌముల మహత్త్వము తెలియదు. నేను వంపకున్న నా తల నిలువదు. నీవే ఏనుగుపాలెమువచ్చి రేపు వారికి విన్నవించుకో, దయదలతురేమో!''

ఏనుగుపాలె మక్కడికి రెండు క్రోశములే. అడవి దారి. అక్కడ నెలుగుబంట్ల ప్రమాదమెక్కువ యని తెలిసినది. పర్వతమల్లు ఇద్దరు మల్లురతో ముందు సాగెను. కోసుదూరముపోగా ఎలుగులజత తమ రెండు పిల్లలతో భయంకర ఘుర్ఘుర ధ్వనితో మీదికి వచ్చెను. మల్లులిద్దరు పిల్లలను తమ గదలతోమోది సంహరించిరి. అందుపై పెద్ద ఎలుగుల జంట క్రోధాంధమై వారిమీది కురికెను. వారు జంకుచుండిరి. పర్వతమల్లు నవ్వుచు ఒక్క దుముకు దుమికి ఆ రెంటిని పిల్లులను పట్టుకొనునట్లు మెడలపై బొచ్చు చర్మముతో కలిపి రెండు చేతులతో ఒడిసిపట్టి, బాహువులు రెండు ప్రక్కలకు జాపి ఆకాశములోనికెత్తిపట్టెను. అవి ఎన్నో విధముల గింజుకొనుచు అతనిని కొట్టుటకు యత్నించెను. కాని సాధ్యపడలేదు. అవి అలసి సొమ్మసిలి వ్రేలాడబడువరకు నట్లే యెత్తిపట్టియుంచి క్రింద బడవైచెను. అప్పుడు శిష్యులు వానికి ముకుద్రాళ్ళు కట్టి స్వాధీనము చేసికొని నడిపించుకొని తరలిరి.

చీకటిపడకముందే వారు ఏనుగుపాలెము చేరుకొనిరి. ఆ గ్రామము కొండవీటి రాజ్యములో చివరిది. దానిని చుట్టివచ్చుచున్న నారివాగు శ్రీనాథునకును పరివారమునకు ఎంతయు ప్రీతిపాత్రమైనది. అప్పుడందులో మోకాలిబంటినీరే ప్రవహించుచుండెను. అది నిండుగా వచ్చినప్పుడు దాని తాండవము చూచి తీరవలసినదే. దాని వంకలు త్రిభంగిగా నిలుచున్న యువతి శరీర భంగులకంటె నందమైనవి. ఆవల వినుకొండను, ఈవల ఏనుగుపాలెమును తన సాము మెలికలతో నది చుట్టవేసినది.

పులిపాడు దాటిన పిమ్మట ఈ ఏనుగుపాలెము ఆ యాత్రికుల కెంతయు సుఖమును విశ్రాంతియు నొనగూర్చెను. ఆయూరి గ్రామోద్యోగులు గ్రామవాసులు సౌమ్యులు సరసులు. అట్టి విద్వద్వర్యుల యాగమనము తమ మహాభాగ్యముగా భావించి వారిని గౌరవించిరి.

శ్రీనాథుని విడిది కరణము భవంతిలోననే ఏర్పాటయినది. పులిపాడు కరణము నింటినుండి తెచ్చిన గుండిగలు గంగాళములు నితర పాత్ర సామగ్రియు బండ్లలోనుండి దింపుచుండ, నా యింటివా రాశ్చర్యముతో తిలకింపసాగిరి. కరణము వానిపైనున్న విలాసములు కూడ జూచి, "కవి సార్వభౌమా, మా ఇంటిలో ఐదేండ్ల క్రిందట దొంగలుపడి ఎత్తుకొని పోయిన సామగ్రి యిది!' అని విన్నవించెను.

కవిసార్వభౌముడు నవ్వుచు"బయలుదేరబోవుచు, పులిపాడు కరణమును శిక్షించు నుద్దేశముతో నివి యిక్కడికి పట్టించితిమి. రేపు వానికై యత డిక్కడికి వచ్చినప్పుడు తగిన యుత్తరమిమ్ము!'' అనెను.

ఆ కరణము నవ్వి, "మాపాత్రలు సరస్వతీమూర్తులైన మీకు తెప్పించిపెట్ట బుద్ధిపుట్టినది. ఆ నాగయ్య ఇక్కడికి రా సాహసించునా!'' అనెను.

ఆనాడు వా రక్కడ సుఖముగా గడిపిరి. ఈ గ్రామము ప్రక్కను నారివాగు దాటినచో శ్రీ విద్యానగర రాజ్యములో నడుగు పెట్టుదురు. తమ రాజ్యములో మర్యాదలకు హక్కులకు, ఆ రాజ్యములో తమ మర్యాదలకు, హక్కులకు భేదముండును. ఇక ముందు పర రాజ్యములో ప్రవర్తించు పద్ధతి యెఱుకపరచుకొనవలెను. ఆవలి స్థితిగతులు తెలిసికొనుటకై ఆ మరునాటి ప్రొద్దున గూడ శ్రీ నాథుడు ఏనుగుపాలెము లోనే గడుప నిశ్చయించెను.

అక్కడికి వినుకొండ పర్వత దుర్గము రెండు క్రోశములలోపే. దుర్గాధిపతి వల్లభరాయుడు కవి పండితాభిమాని యని తెలియవచ్చినది. తమ ప్రయాణము నిరాటంకముగా సాగుటకు వసతులు కల్పింప వలెనని శ్రీ విద్యానగర రాజ పురుషుల యాజ్ఞలేకాక, శ్రీ శృంగేరీ విరూపాక్ష శ్రీ పీఠాధిపతుల శ్రీముఖము కూడ నప్పటికే చేరియుండవలెను అందువలన తమ ముందుప్రయాణము కూడ సుఖముగానే సాగగలదని యాతడాశించెను. (సశేషం)

కుంటూ సారంగం ద్వారా పైకి, జలపాతం వైపు పరిగెత్తాడు. సరిగ్గా గుహాద్వారం సమీపించేసరికి వెనక పెద్ద కేకలు వినిపించాయి. రాముడికి ఏం చెయ్యాలో తోచలేదు. చప్పున జలపాతం పడేచోటఉన్న ఒక పెద్ద బండవెనక దాక్కున్నాడు. పెద్దగా వాదించుకుంటూ రాక్షసులిద్దరూ కొంతసేపటికి వచ్చారు.

"దొంగా లేదూ, ఎవడూ లేదు. కలగని ఉంటావురా అబ్బాయ్!" అంటున్నాడు తండ్రి.

## "గాజు భవనం"

(23-వ పేజీ తరువాయి)

"లేదు నిద్రపోతున్నా అడుగుల చప్పుడు వినిపించింది! ఇక్కడే ఎక్కడైనా దాక్కుని ఉన్నాడేమో వెతుకుదాం, నాకు మంచి ఆకలిగా కూడా ఉంది!" అన్నాడు అతని కొడుకు. కాని పెద్ద రాక్షసుడు ఒప్పుకోలేదు. "అనవసరంగా నిద్రపాడు చేశావ్! దొంగా లేదూ, దొరా లేదూ పడుకుందాం రా! రేపు మంచి దేనైనా వేటాడి ఇస్తా లే!" అని కోప్పడి వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు. రాముడు 'అమ్మయ్య' అనుకుని జిగురుతో రాజభవనం వైపు పరుగు తీశాడు.

## 5

అతని మాటలు ఈ తడవ కూడా ద్వారంవద్ద రక్షకభటులు నమ్మలేదు! 'ఫో, పొమ్మ'ని ఛిదిలించి వేశారు. రాముడిక లాభంలేదు, పోదామనుకుంటూ ఉండగా అప్పుడే పల్లకీలో అటువస్తున్న మంత్రిగారు 'ఏమిటీ గొడవ' అని అడిగారు.

గంటలో గాజుభవనం బీటు పోయి మామూలుగా అయిపోయింది!

నెలలో రాముడికి రాజుగారి కూతురుని ఇచ్చి పెళ్ళి చేశారు. పెళ్ళి జరిగిన వారం రోజుల్లో రాముడు రాజుగారి సైన్యంలో ఒక నాయకుడయ్యాడు.

ఒకరోజు సాయంత్రం రాముడు కొందరు వీరులతో జలపాతంవెనుక సారంగం చివర రాక్షసుడి మందిరంలోకి వెళ్ళాడు. కాని అక్కడ ముసలమ్మ ఒక్కర్తే ఉంది. రాజభవనం బాగుపడిందని విన్న రాక్షసుడు నిజంగానే దొంగ పడ్డాడని గ్రహించి ఇంకక్కడ ఉండటం ప్రమాదకరమనుకుని ఎక్కడికో చెప్పక వెళ్ళిపోయాడట. తనతో బాటు జిగురుచేసే వస్తువులు కూడా తీసుకు పోయాడుట.

రాముడు ఆముసలమ్మని వెంటనే తనతో బాటే వచ్చేసి, తన ఇంట్లో ఉండమని అడిగాడు. తనకు తోడు దొరకిందని రాముడూ వాళ్ళ అమ్మమ్మ సంతోషించింది. ★

## వెంకన్న ఉత్తరం

### నాప రామయ్య

వచ్చిందటే అమ్మ-వచ్చిందటే!
వెంకన్న వ్రాసిన-ఉత్తరమ్ము నేడు!!...

చిన్నన్న ఆ జాబు
చదివి వినిపించంగ;
మేమది వినిచాల
మురిసి పోయామమ్మ!

మొన్నటితో పరీక్ష
ముగిసి పోయిందంట!
రాతిరికి పయనమై
రైలెక్కు తాడంట.

చిట్టిపాపాయికి
చిలుక బొమ్మలు రెండు
మొన్ననే కొనెనంట
మూడు రూపాయలకు!

గారక్కకూ, నాకు
గాజులు కొనెనంట;
పెద్దన్నకూ కథల
పొత్తములు కొనెనంట!

పెద్దన్న ఆ కథలు
చదివి వినిపిస్తాడు
మేమప్పుడదివిని
మురిసి పోతామమ్మ!

వచ్చిందటే అమ్మ-వచ్చిందటే!
వెంకన్న వ్రాసిన-ఉత్తరమ్ము నేడు!...

ధించాను. స్వతంత్రజీవితం గడుపుతున్నానని తృప్తి ఉన్నా, ఎందుకో ప్రశాంతంగా ఉండలేకపోతున్నాను. గడచిన జీవితం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఎంతో బాధ కలుగుతుంది. అసలు నా పుట్టుకే రోత అనిపిస్తున్నది. ఆ వేశ్యకులంలోకాక, మరేకులంలో పుట్టినా నా జీవితానికి కొంత విలువ ఉండేదేమో! ఒకరికి గృహిణిగాఉండి సమాజంలో అందరి స్త్రీలలాగానే గౌరవం పొందగలిగే అదృష్టానికి నోచుకోనందుకు హృదయము పరితపిస్తూ ఉంటుంది. తల్లీ—అన్నా ఉన్నప్పటికీ నాకు వాళ్ళు కీడే చేశారుకాని మేలు చేయలేదు. ఆలోచిస్తే మీరొక్కరే నాకు ఆత్మీయులనిపిస్తోంది. నిజం కూడా అంతే! ఎవ్వరూచేయని మహోపకారం నాకు చేశారు మీరు. ఇప్పుడు నాకు వేరే ఆలోచన లేనేలేదు. ఏదైనా ఆలోచిస్తే మీ—నా పరిచయం గురించే. . . .మీ పాదాలముందు జీవితం గడచిపోతే చాలనిపిస్తోంది. కాని, నాకంతటి అదృష్టం లేదని కూడా తెలుసు. ఆనాటి సంఘటన తలచుకుంటే ఇప్పటికీ ఏదో దివ్యానుభూతి కలుగుతుంది. మీ క్షేమం తెలియచేయండి. . . .ఇక్కడికి ఎప్పుడైనావస్తే, మీ దర్శనభాగ్యం కలుగచెయ్యండి''

రాజారావు ఉత్తరం మడచి లాల్చీజేబులో పెట్టుకొని మళ్లీ రాట్నంముందు కూర్చున్నాడు. పని మందకొడిగా సాగుతున్నది. అతని ఆలోచనల్లో అలివేణి ఉత్తరంలోని పంక్తులే పరిభ్రమిస్తున్నాయి. ఆమె వ్రాసిన విషయాలు ఎంతో సహజంగా అనిపించాయి. ఆరాత్రి అలివేణిఇంట్లో జరిగిన సంఘటన, ఆమె సుందరరూపం కళ్లముందు కదులాడాయి. ''ఏమిటి తనకీ చాల్యం?'' అనుకున్నాడు. ఏకాగ్రచిత్తంతో రాట్నంమీద నూలు తీయలేకపోతున్నాడు· దానిని ప్రక్కకు పెట్టివేశాడు.

* * *

సాయంత్రం నాలుగుగంటలైంది. హైస్కూలంతా త్రివర్ణ పతాక తోరణాలతో అలంకరించారు. లౌడుస్పీకరులో దేశభక్తి గీతాలు వినిపిస్తున్నాయి. వూర్లోని జనమంతా అక్కడ సమావేశమయ్యారు. లలిత, కమల, ''మా తెలుగుతల్లికీ మల్లెపూదండ'' గీతం పాడారు.

హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు మైకు ముందు నిలబడి ''మహా జనులారా! ఈనాడు మనకు గొప్ప సుదినం. ఎన్నికలలో మన నియోజకవర్గం నుండి ఎన్నికైన నరసింహప్పగారిని, పోలయ్యగారిని గౌరవించుకునే సదవకాశం మనకు కలిగింది. ముఖ్యంగా వీరిద్దరూ ఈ వూరివారేకావడం మరొక విశేషం. సూర్యచంద్రుల్లా వెలుగొందే వీరినిగూర్చి పరిచయం చేయవలసిన అవసరంలేదు. ఉభయులు మన నియోజకవర్గంలోని ప్రజలకు కావలసిన ప్రయోజనాలు కల్పించగలరనడంలో సందేహంలేదు. కాని ఒక్కటి మాత్రం మనవి చేస్తున్నాను. రాజారావుగారి కృషి ఫలితంగా మాధ్యమిక పాఠశాల ఉన్నత పాఠశాల అయింది. వారి కృషి ఫలితంగానే మరొక మాధ్యమిక పాఠశాల నెలవడం అందరికీ తెలిసిందే! మన జిల్లాకు ఒక కళాశాల లేకపోవడం చాలా కొరతగాఉంది. ఆ కొరతను నరసింహప్పగారూ, పోలయ్యగారూ తీర్చడానికి కృషి చెయ్యాలి అని మనవి చేస్తున్నాను. ఇప్పుడు రాజారావుగారు మాట్లాడుతారు.'' అని ఆయన కూర్చున్నాడు.

# ఆదర్శాలు-అంతర్యాలు

(21 వ పేజీ తరువాయి)

''అధ్యక్షా! సోదర సోదరీమణులారా! . . .ఇది ఉపన్యాసాలకు సమయంకాదు. అయినా ప్రధానోపాధ్యాయులవారు మాట్లాడమన్నారు. ఎన్నాళ్లనుంచో ఎదురుచూస్తున్న ఎన్నికలు అయిపోయాయి. మన ప్రతినిధుల్ని ఎన్నుకున్నాం. వారిని గౌరవిస్తున్నామంటే మనల్ని మనం గౌరవించుకుంటున్నామన్న మాట. ఈ ఎన్నికలవల్ల కొన్ని అభిప్రాయ భేదాలు ఏర్పడటం సహజం. అయినా వాటిని మనమంతా విస్మరించి మన ప్రతినిధులకు తోడ్పడాలి. ప్రధానోపాధ్యాయులవారు మన జిల్లాకు కళాశాల అవసరాన్ని గూర్చి పేర్కొన్నారు. మనకు కళాశాల లేకపోవడం వల్ల ఆసక్తిగల విద్యార్థులు ఇతరత్రా వెళ్లవలసి వస్తున్నది. కొందరు మానుకోవలసివస్తున్నది. ఇతరత్రావెళ్ళి చదువుకోవడమంటే వ్యయ ప్రయాసలతో కూడుకొన్నది. అందువల్ల మనకు కళాశాల ఎంతైనా అవసరమే. కాని మనకు కళాశాల కావాలంటే మాటలతో వచ్చేదికాదు. మనం కొన్ని విరాళాలు పోగుచేస్తే ప్రభుత్వం కొంత విరాళంఇచ్చి, కళాశాల స్థాపనకు దోహదం కలిగించే ఏర్పాట్లు మన ప్రతినిధులు చేస్తారు. హృదయపూర్వకంగా నరసింహప్పగారిని అభినందిస్తూ, నాకంటే కాస్త చిన్నవాడైన పోలయ్యను ఆశీర్వదిస్తున్నాను'' అని చెప్పి రాజారావు కూర్చున్నాడు.

చలమయ్యగారు రాజారావుచెవిలో ఏదో చెప్పాడు. సభలో గుసగుసలు ప్రారంభమయ్యాయి. మరి కొన్ని క్షణాలలో చలమయ్యగారు మైకు ముందర నిలబడేప్పటికి అంతా ఆశ్చర్యపడ్డారు.

''మహాజనులారా! మీ అందరి సంతోషంలో నేనూ పాలుపంచుకుందామని వచ్చాను. ఇందులో మరేమీ ఎత్తు లేదనీ, మీముందు నిలబడింది వెనుకటి చలమయ్యకాదనీ గుర్తించమని ప్రార్థిస్తున్నాను. సమర్థులైనవారిని ఎన్నుకున్నందుకు సంతోషిస్తున్నాను. హృదయపూర్వకంగానే మా అన్నగారైన నరసింహప్పగారిని, ప్రజల మనిషి అయిన పోలయ్యను అభినందిస్తున్నాను. నా తప్పులను క్షమించమనీ, గత స్పర్థలు మరచిపోయి నన్ను తమవాడ్నిగా భావించమనీ కోరుతున్నాను. వారు చేయబోయే ప్రజాకార్యకలాపాలకు నా సహాయం ఎల్లప్పుడూ ఉంటుందని మనవి చేస్తున్నాను. మన జిల్లాకు కళాశాల కొరతను తీర్చడానికి అందరం ప్రయత్నించవలసిందే! నేను కళాశాలకై వెయ్యినూటపదహార్లు విరాళం ఇస్తున్నాను'' అన్నాడు. సభలో కరతాళధ్వనులు చెలరేగాయి.

తరువాత నరసింహప్పగారూ, పోలయ్య తమకిచ్చిన గౌరవానికి యథోచితమైన సమాధానాలు చెబుతూ, కృతజ్ఞతలు తెలిపారు.

''నిజానికి ఈ గౌరవం నాకుకాదనీ, నన్ను ఇంతవాడినిగా తయారుచేసిన రాజారావుగారిదని నేను భావిస్తున్నాను'' అన్నాడు పోలయ్య.

ప్రధానోపాధ్యాయుడి కృతజ్ఞతలతో సభ ముగిసింది. తరువాత ముఖ్య అతిథులకు విందు జరిగింది.

* * *

మునేరు నిర్మలంగా ప్రవహిస్తున్నది. చల్లటిగాలి మందమందంగా వీస్తున్నది. పున్నమినాటి చంద్రుడు మింటిలో వెలిగిపోతున్నాడు. ఆ వెన్నెలలో ఇసుకలో రాజారావు వెల్లకిల పడుకొని ఆకాశంలోకి చూస్తున్నాడు.

''తను ఈ వూరు వచ్చినపని అయిపోయింది. మనిషికీ, మనిషికీ మధ్య ఇనుపతెరలు ఏర్పడకుండా చేసి, అవ్యాజమైన ప్రేమను, ఔదార్యాన్ని పునః ప్రతిష్ఠించడానికి శాయశక్తులా కృషి చేశాడు. తను చేయదలచుకున్న ప్రతి పనీ నెరవేరింది. పోలయ్యను ప్రజా ప్రతినిధిని చేద్దామనుకున్నాడు. చేశాడు. అలివేణికి స్వతంత్రమైన జీవితం కల్పిద్దామనుకున్నాడు. కల్పించాడు. నరసింహప్పకూ, చలమయ్యకూ మధ్యఉన్న కక్షలకు మంగళగీతం పాడించి చేయి చేయి కల్పించాడు. అంతా భగవదనుగ్రహం. తాను చేయబోయే ప్రతి పనికీ వెనుక ఒక సత్యం ఉంది. సత్యాన్ని ప్రేమించాడు భగవంతుడు—ఇందులో తన ప్రతిభ ఏముంది?'' అనుకున్నాడు రాజారావు.

''ఇంక తన కిక్కడేముంది ? . . . .నాన్న పదే పదే ఉత్తరాలు వ్రాస్తున్నాడు రమ్మని. తను వెడుతున్నట్టు చెబితే పోలయ్య కదలనిస్తాడా ? తన పెళ్ళి అయిందాకా ఉండమంటాడు. . . .పోలయ్యకు తగ్గదే శారద. . . .ఆమె అసలు ఒప్పుకోదు వెడతానంటే. . . . .తను వెళ్ళిపోతున్నట్టు తెలిస్తే లలిత ఏమనుకుంటుందో ? . . . .

క్రమంగా అతని ఆలోచనల్లోకి అలివేణి వచ్చింది. ''అలివేణి లేకపోతే ఆరోజు పోలయ్యా— తనూ ఏమైపోయేవారూ ? . . . .

ఇంతలో ఎవరో వస్తూన్నట్టు పొడగట్టింది..... లేచి కూర్చున్నాడు రాజారావు.

''ఊరంతా వెతికాను మీకోసం. . . .ఇక ఇక్కడే తప్పకుండా ఉంటారనివచ్చాను'' అన్నాడు పోలయ్య కూర్చుంటూ.

---

చివరకు నటరాజ గానసభ కార్యదర్శి ఆ వ్యాపారస్థుణ్ణి సభ్యుడుగా చేరటానికి ఒప్పించాడు. సంవత్సర చందా అతని దగ్గర వసూలు చేశాడు.

వ్యాపారి: - నా సభ్యత్వం వలన నాకు సంక్రమించే హక్కులు ఏమిటి.

కార్యదర్శి. (ఒక్క క్షణం ఆలోచించి):వచ్చే ఏడాది కూడా చందా కట్టడం.

రామానంద్ (విజయవాడ)

---

# ఆదర్శాలు-ఆంతర్యాలు

"ఎందుకుపోలయ్యా ?"

"విందు పూర్తికాకుండానే మీరు వచ్చేశారు. . . . ఒంటరిగా కూర్చుని ఏమిటి ఆలోచిస్తున్నారిక్కడ?"

"ఏంలేదుపోలయ్యా ! . . . .వెన్నెల హాయిగా ఉంది. . . .కాసేపు ఏటిఒడ్డున కూర్చుందామని వచ్చాను."

"చాలా రాత్రయింది. . . .వెడదాం పదండి..... మీరు ఎక్కడకు వెళ్ళారోనని శారద కూడా కంగారు పడుతున్నది."

"ఇంక ఇప్పుడేం భయంలేదుగా పోలయ్యా!"

"మీదయవల్ల అన్నీ సవ్యంగానే జరిగాయి. దొరల కిద్దరికీ మళ్ళీ పొత్తు కుదిరి, సఖ్యంగా ఉంటారని వూళ్ళో ఎవరూ అనుకోలేదు. . . .మీరు వూరి వాతావరణాన్నే మార్చివేశారు. . . .నిజంగా మేమంతా మీకు ఎంతో ఋణపడిఉన్నాం" అన్నాడు పోలయ్య.

"పరిస్థితులు అలా కలిసివచ్చాయి. ఇందులో నేను చేసిందేముంది పోలయ్యా!. . . .ఇక నా బాధ్యత తీరిపోయింది. . . .రేపు వూరికి వెడదామని అనుకుంటున్నాను" అన్నాడు రాజారావు.

"ఏమిటి ? . . . . .వూరికా?" ఆశ్చర్యపడ్డాడు పోలయ్య.

"ఎందుకంత ఆశ్చర్యపడతావు పోలయ్యా...... మా నాన్నగారు రమ్మని ఎన్నిసార్లు వ్రాశారో నీకు తెలియదూ?"

"నిజమే అనుకోండి.......కాని ఇప్పుడే ఏం తొందర వచ్చింది?"

"ఇక నేనుండిమటుకు చేసేదేముంది?"

"అంటే మీ ఉద్దేశం ఈ వూరినుంచి శాశ్వతంగా వెళ్ళిపోదామనా?"

"అవును పోలయ్యా!"

పోలయ్య ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. రాజారావు వెన్నెలలో పాలనురుగులా నిర్మలంగా ప్రవహిస్తున్న మునేరువంక చూస్తున్నాడు.

"అయితే లలితమ్మగారిని ఏంచేద్దామనుకున్నారు"

పోలయ్యా. . . .ఆమె నాకు శిష్యురాలివంటిది. ఇందిరకు ప్రైవేటు మాష్టరుగానే కుదిరినా, లలితకు కూడా అప్పుడప్పుడు పాఠాలు చెప్పేవాడిని. సుందరమైన వస్తువు కనిపించినప్పుడు ప్రభావితుల మవడం సహజం. కాని. . . . ." అని మాట పూర్తి చేయకుండానే వూరుకున్నాడు రాజారావు.

"మరి ఆరోజు లలితమ్మగారికి జ్వరమొస్తున్నదని శాయిలు చెప్పగానే ఎందుకంత కలవరపడ్డారు?"

"నీతల ఎవరో పగలకొట్టినప్పుడు నే నెందుకు ఆందోళనపడ్డానో, లలితకు జర్వమొస్తున్నదని తెలిసి కూడా అందుకే ఆందోళన పడ్డాను."

పోలయ్య మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"ఈయనను అర్ధం చేసుకున్నాననుకున్నాను.... ఇదేనా తను అర్ధంచేసుకుంది? మరి ఇందిరమ్మగారూ, శారదా కూడా లలితమ్మగారు ఈయనను ప్రేమిస్తున్నదని చెప్పిరే!" అనుకున్నాడు పోలయ్య.

"ఏమిటి పోలయ్యా. . . .ఆలోచిస్తున్నావు" అని ప్రశ్నించాడు రాజారావు.

"ఏంలేదు. . . .లలితమ్మగారిని గురించే ఆలోచిస్తున్నా"

"ఆమెకేం ఫరవాలేదు. . . .నరసింహప్పగారు మంచి సంబంధమే నిర్ణయించారు"

"కావచ్చు. . . . .కాని ఆమె ఇష్టపడవద్దూ?"

"అన్నీ సవ్యంగానే జరుగుతాయి పోలయ్యా. . . . సరే. . . . .ఇంక లే వెడదాం" అంటూ రాజారావు లేచాడు.

ఇద్దరూ అలవోకగాఉన్న వెన్నెలలోంచి మౌనంగా నడుస్తున్నారు.

* * *

తెల్లవారింది.

ఎంతకీ రాజారావు గదిలోంచి లేచిరాకపోయేప్పటికి పోలయ్య "బాబుగారూ" అంటూ తలుపు నెట్టుకొని లోపలకు వెళ్ళాడు. . . . .గది బోసిగా వుంది. రాజారావు, బెడ్డింగు, పెట్టె కనిపించలేదు. బల్లమీదవున్న కాగితంమీద పోలయ్య దృష్టి పడింది. గబగబా చదివాడు.

పోలయ్య !

నేను వెళ్ళిపోతున్నాను. . . .బహుశా ఇంక రాలేనేమో! నీవు ఈ ఇంట్లోనేఉంటూ, మా పొలం వ్యవహారం కూడా నీవే చూడాలి. నేను చేయబోయేపని మీ రెవరూ హర్షించలేరు. . . .సంగతులు తరువాత నీకే తెలుస్తాయి"

"శారదా. . . .శారదా" అంటూ పోలయ్య ఆ కాగితం తీసుకొని గదిలోంచి ఇవతలకు వచ్చాడు.

వారం రోజులు గడిచాయి!

ఆనాటి వార్తాపత్రిక చూసి ఆ ఊరిజనం ముఖ్యంగా నరసింహప్ప, చలమయ్య, పోలయ్యలు ఆశ్చర్యపడ్డారు!

రాజారావు అలివేణిని వివాహం చేసుకున్నట్టు వార్త ప్రచురిస్తూ, వాళ్ళిద్దరి ఫోటోలు కూడా అచ్చువేశారు పత్రిక వాళ్ళు.

నలుగురూ నాలుగు విధాలుగా అనుకున్నారు.

"శారదా ! . . . . .మనం వెళ్ళి వాళ్లను తీసుకువద్దామా" అన్నాడు పోలయ్య.

"అంతకంటేనా" అంది శారద !

(అయిపోయింది.)

# నగల మోజు

(20-వ పేజీ తరువాయి)

వున్నారా అని ఆశ్చర్యపడకండి! నేను నా కళ్ళారా కొంతమందిని చూశాను) ఇటువంటి ఆడవాళ్ళని చూస్తుంటే తాతయ్య అన్నమాటలు జ్ఞాపకంవచ్చి నవ్వు వస్తూ వుంటుంది నాకు.

ఇట్లావున్న నగలన్నీ దిగేసుకుంటే నగలకువున్న విలువా, మనిషికి అదివరకువున్న అందం కూడ పతిస్తుంది. ఇటువంటి వాళ్ళని చూస్తుంటే తమ భాగ్యాన్ని ప్రదర్శించటం కోసమే అట్లా తయారవుతున్నారా అనిపిస్తుంది. చాలా సొమ్ములు (ఏడు వారాల నగలూ) వున్నయ్యనుకోండి! ప్రతిసారి తలొక రకం సొమ్ములు, తగ్గన్ని వేసుకుని, ప్రతిసారి మార్చి పెట్టుకుంటుంటే నలుగుర్లోనూ మనం ఆశించే గొప్ప లభిస్తుంది, అలంకరణా బాగుంటుంది. అట్లా చెయ్యటంవల్ల ప్రతిసారి క్రొత్తరకం నగలు చేయించి పెట్టుకున్నట్లు అందరికీ భ్రమ కలిగిస్తుంది. అంతే గాని వున్నన్ని సొమ్ములు ఎక్కడికెళ్ళినా దిగేసుకుని వెళ్ళితే యేమాత్రం బాగుండదు! నగలు ఎంత ఎంత ఎక్కువగా పెట్టుకుంటే అంతగా ఆడవాళ్ళని మెచ్చుకునే రోజులు ఎప్పుడో వెళ్ళిపోయినై.

అయితే ఇప్పుడుమాత్రం ఆడవాళ్ళు విపరీతంగా నగలు చేయించుకోవటంలేదా? పెట్టుకోవటంలేదా? మరి నగలు ఫాషన్ కాదంటారేం? అని ఎవ్వరైనా అడగొచ్చు. ఎందుకు చేయించుకోరు! ఆడవాళ్ళకు నగలమీద సహజమైన మక్కువ ఇప్పుడుకాదు మరికొన్ని తరాలు గడచినా పోదు. ఇప్పుడూ ఎప్పటి 'ఫాషన్' ప్రకారం అప్పుడు ఆ రకం, నగలుమార్చి చేయించుకునేవారూ వున్నారు తాహతునుబట్టి. అట్లాగే వున్న నాలుగు రకాల సొమ్ముల్ని మార్చివేసుకుంటూవుంటారు ఆకర్షణీయంగా వుండేట్లుగా.

మరొక విషయం! బడికిపంపే పిల్లలకుమాత్రం నగలు పెట్టటం యేమాత్రం క్షేమకరమైన విషయంకాదు. ఈ మధ్య చిన్న పట్టణాలలో కూడ నగల దొంగతనాలు, వాటితోపాటు పిల్లల్ని కూడ ఎత్తుకు వెళ్ళటంవంటిప్రమాదాలు విపరీతంగా జరుగుతున్నాయి. పెద్దవాళ్ళయినా ఒంటరిగా వెళ్ళేటప్పుడుఎక్కువగా నగలు పెట్టుకుంటే ప్రమాదాలకలో నౌతారు.

అసలు 'ఉత్తరదేశంవారు' నగలే వేసుకోరు. ఉన్న నగలు 'బాంక్'లో దాచేసి, శుభ సమయాల్లో మాత్రమే వేసుకుంటారు.

సరే! ఇంతవరకు స్త్రీలకు—నగలకూ వున్న అవినాభావ సంబంధం గురించి చర్చించానా, ఇక స్త్రీలకు ఈ నగలమోజు ఎంతవరకు వుండాలి? అనేదే చర్చనీయాంశము.

మగవారు తెలివితక్కువగా ఆడవారికి నగలు చేయించరు. కొంతడబ్బు ఆడదాని నగల రూపంలో దాచినట్లూ వుంటుందనీ, ఆపదల్లో మరేగీ గతిలేకపోతే 'నగలే' అమ్మి అడ్డుకోవచ్చనీ అందరి వూహా కూడాను. అట్లాగే ఆడదానికి నగలు కేవలం అలంకారం కోసమే కాకుండా ఆస్తితో సమానం. ఉద్యోగాలుచేసే ఆడవాళ్ళకి ఫరవాలేదుగాని, అటు చదులేక, ఇటు ఇతర జీవిత ఆధారమూలేక 'అబల'గావున్న స్త్రీకిఆభరణాలు ఆపదలో అడ్డుకునే ఆధారం. అవి అమ్ముకునికొంతఆసరానుపొందగలరుఅటువంటిస్త్రీలు

'జీవితంలో స్త్రీ అన్నిటికన్నా డబ్బునూ, నగల్నే అధికంగా ప్రేమిస్తుంది' అని తీర్మానించారు కొందరు మగవారు. అది పచ్చి అబద్ధం. భర్త త్రాగుబోతైనా, తనని నానా హింసలపాలుచేసినా, అతడు జబ్బులకు గురిఅయినప్పుడు తన నగల్నేఅమ్మి అతడి ప్రాణాన్ని నిలబెట్టిన ఆడవాళ్ళూ వున్నారు. ఆర్థిక పరిస్థితులు సరిగ్గాలేక, భర్తకు ఉద్యోగమూలేక ఇబ్బందుల్లో వున్నప్పుడు భర్త అమ్మటానికి ఇష్టపడకపోయినా తన నగలన్నీ సంతోషంగాతీసియిచ్చి ఇల్లు నిలిపిన అతివలు కొల్లలు.

ఇటువంటివారేగాక 'నగల్ని' మూఢంగా ప్రేమించే కొద్దిమంది స్త్రీలు లేకపోలేదు. ఇంట్లో పరిస్థితులు సరిగ్గా లేకపోయినా 'నాకేంపెట్టారు! సొమ్ములు చేయించారా? చీరెలు కొన్నారా? ఇది నా దౌర్భాగ్యం' అని సాధించేవాళ్ళని నే నెరుగుదును.

'అవును! సంపాదించటం చేతగాక నా నగల్ని అమ్మి ఇల్లు గడుపుతున్నారు. ఆమాత్రం అభిమానం లేకపోతేసరి!' అని తగవుపెట్టుకునేవారూ వున్నారు.

ఒక వైపున భర్త చావు బ్రతుకుల్లోవుండి, డబ్బులేక నగలు అమ్మవలసివస్తే 'అమ్మో! నా నగలు అమ్మటానికి వీల్లేదు. ఆ తర్వాత నా గతేమిటి?' (అంటే ఆయనపోయిన తర్వాత అని అర్థం) అని మూర్ఖంగా ఆలోచించే స్త్రీలూ వున్నారు.

అయితే ఇట్లా 'నగల్నే' అత్యధికంగా ప్రేమించే స్త్రీల సంఖ్య చాలా తక్కువ. ఆడవాళ్ళకు నగలంటే సహజంగా మోజే! అయితే పరిస్థితుల్నిబట్టి ఆడవాళ్ళు డబ్బువుంటే పది రకాల నగలు చేయించుకోనూ గలరు. అవసరమయితే అన్నీ త్యజించనూ గలరు. 'అవే' ప్రాణం అనుకునేవారు 'మనం పుట్టటమే డబ్బుకోసం పుట్టాం' అనుకునే రకాలు మాత్రమే.

నగలు! అబ్బ! నగలు! నెక్లేస్ చేయించుకుందామా? గాజులు చేయించుకుందామా? లేకపోతే ముత్యాల దిద్దులు కొనుక్కుందామా? ముత్యాల నెక్లేస్ తీసుకుందామా! అని ప్రతి క్షణం అందరం ప్రణాళిక వేసుకుంటూనేవుంటాం. (మనస్సులోనే లెండి!)అయితే మనస్సునుమాత్రంఅదుపులోపెట్టుకుని, అదిఎదురు తిరక్కుండా, అతిగాముందుకు సాగకుండా చూసుకోటం మనకే శ్రేయస్కరం.

నగలన్నిటికన్నా, స్త్రీలకుసహజమైన సౌందర్యమే పెద్ద నగ. ఆతర్వాత శీలసంపదతో తులతూగేనగలేదు ప్రపంచంలో.అందుచేతేనగలులేని ఆడవాళ్ళు'అయ్యో' అని బాధ పడాల్సినఅవసరమూలేదు. నగలు అతిగా వున్నవారు మిడిసి పడాల్సిన అవసరమూలేదు. ★

---

# చదువులూ-పనిపాటలూ

(20-వ పేజీ తరువాయి)

'ఏం గ్రాడ్యుయేట్లో, సమంగా పేపరేనా చదవరు' అంటాడు తండ్రి. ఎవరిమాట వింటుందాపిల్ల? ఇహ ఎక్కడికేనా పేరంటానికి వెళ్ళిందనుకోండి. ఈ పిల్ల కొంచెం నలుగురితోను తిరగటంనుంచీ ఖలాకీగా మాట్లాడితే "దీనికి ఆ చదువు గర్వం చూద్దూ! మహా మిడిసిపడుతున్నాది' అని అంటారు. అని ఊరుకొంటారా? లేదు! "ఏవమ్మాయ్ కోడలుపిల్లా పప్పన్నం ఎప్పుడు పెడతావ్" అని నిలదీస్తారు. ఆ విషయం ఆ పిల్లకేం తెలుస్తుందీ? ఆ పిల్ల తలి తండ్రుల నడగాలా ప్రశ్న.

'మా కాలంలో అయితే ఈ వయస్సుకి యిద్దరు పిల్లల తల్లి అయేవాళ్ళు" అని ఒకళ్ళూ, "ఏమిటో పిన్నిగారూ ఈ కాలంవాళ్ళమయినా మా కిలాటివేం తెలీదు సుమండీ. ప్రేమలనీ, పెళ్ళిళ్ళనీ. ఈ సినిమాలు కొంపదీస్తున్నాయి" అని సాగదీస్తుంది ఈమధ్యనే పెళ్ళయి చదువు తనకి లేకపోయిందే అని మనస్సులో ఈర్ష్యతో. ఈ పోరు పడలేక పేరంటాలకి వెళ్ళటం మానుకొంటా రీ పిల్లలు. అదీ కూడా మళ్ళీ తప్పే. "పేరంటానికి వస్తారమ్మా ఈకాలం పిల్లలు ? ఏదో పార్టీలనీ, డిన్నర్లనీ అంటే వో మొగ ఆడ పూసుకు తిరగమంటే ఎగిరిగంతేస్తారు. గానీ" అని అతిసుళువుగా అనేస్తారు. ఈ కాలంలో కూడా యిలా అనేవాళ్ళున్నారా అని అడుగుతున్నారుకదూ ? మద్రాసు, హైదరాబాద్‌లాంటి పట్టణాల్లో ఆడవాళ్ళు చదువుగురించి చెప్పుకోటం లేదేమోకాని మనవేపు చిన్న వూళ్ళలో ఎక్కువగా వుంది. ఏడాదిక్రితం అనుకుంటా మా అన్నయ్య పెళ్ళి అవుతోంది. మావాళ్ళంతా గంధం కుంకుం అవీ హడావిడీగా అందరికీ యిచ్చేస్తున్నారు. నాకూకూడా ఏ దేనా చెయ్యాలనిపించింది. వెంటనే మా చిన్నక్కయ్యచేతిలో గంధంగిన్నె తీసుకొని నలుగురు ముత్తయిదువులకీ యివ్వటం మొదలెట్టాను. "ఏవమ్మాయ్ కాస్త ఆ కొంగు దోపు. లేకపోతే ఎవరేనా పట్టుకోడానికి రావాలి" ఒక పక్కనుంచి వచ్చింది ఓ విసురు. సరే తమాషాకిలే అని ఊరుకొన్నాను. ఆ తరవాత తెలిసింది "నేను గంధం యివ్వటం గురించి పిన్నిగార్లందరూ గోల పెట్టేరని. ఇంతలో ఒక అత్తయ్యగారందుకొని "అవునే కోడలా అంత పెద్దచదువు చదువుతున్నావు గంధం యివ్వటం రాకనా లేక సిగ్గుచేతనా అలా యిస్తున్నావ్" అంది. ఒళ్ళుమండి నేను "మా చదువులో గంధం ఎలా యియ్యాలో, బొట్టెలా పెట్టాలో చెప్పరండీ అత్తయ్యగారూ" అన్నాను.

ఇలా ఉంటాయి చదువుకున్నపిల్లల అవస్థలు. దీనంతటికీ కారణం మనలో ఆడపిల్లల చదువు తక్కువగా ఉండటమేకాక మన ఆడవాళ్ళకి ఈర్ష్యాసూయలు ఒక పాలు ఎక్కువ ఉండటము. తమ పిల్లలు చదువుతున్నాసరే ఎదుటివారిగురించి అనందే ఉండలేరు కొందరు. అసలు మనం చేస్తున్న పొరపా టేమిటంటే చదువునుంచే అన్ని గుణాలు వస్తాయనుకోడం. చదువు బంగారానికి మెరుగు లాంటిది మాత్రమే. మనిషిలో మంచి గుణాలుంటే చదువువల్ల విజ్ఞానవంతులై మంచితనం కనపడుతుంది. అదే మూర్ఖులై, ఎప్పుడూ ఏదో చెడు చూసేవారికి చదువు ఆ చెడుకే సుళువు మార్గాలు చూపెడుతుంది. నాకు తెలిసిన ఒకమ్మాయికి చదువుకుంటున్నన్నాళ్ళూ నేను చీరలిచ్చీ డబ్బిచ్చీ సాయంచేస్తూ ఉండేదాన్ని. ఆ పిల్ల చాలా గర్వి అనీ అవసరం తీరాక మనమొహం చూడదనీ ఆ పిల్ల అన్నావాళ్ళూ చెప్పేవారు. నే నవేవీ లక్ష్యపెట్టలేదు. చివరకి గోళ్ళకి వేసుకొనే రంగుదగ్గర నుంచీ సరదాపడితే యిచ్చేదాన్ని. ఆపిల్ల ఎమ్. ఏ. పాసయింది. ఈ మధ్యనే ఉద్యోగం కూడా అయింది. అంతే మరి ఆ పిల్లకానీ ఆపిల్ల భర్తకానీ మాకొక ఉత్తరమైనా రాయలేరు. మరి దీన్నేమంటారు? ఉన్నత విద్య నభ్యసించిన ఆ పిల్లకి మర్యాద తెలీదా? అందుకే మనం ఎవర్నేనా అనదల్చుకొంటే వాళ్ళనే అనండికానీ వాళ్ళ చదువుననకండి. చదువుకి, మనిషి గుణాలకి ఎక్కడా సంబంధంలేదు. కాబట్టి చదువుకున్న పిల్ల అని అనరుకదా యిక మీద ! ★

# అంతా మిథ్యా

(16-వ పేజీ తరువాయి)

కొద్దిగా నెరిసింది. ఆయన చిన్నప్పుడు నాటకాల్లో వేషాలు వేసేవాడు. తరువాత కష్టపడి సంగీతం నేర్చుకున్నాడు. ఆయనకు భార్య తాలూకు ఆస్తి చాలా వుండడంవల్ల అన్నోదకాలకులోటు లేదు. పొలాలూ, కోర్టు వ్యవహారాలూ చూసుకోవలసి రావడంవల్ల ఎక్కువ తీరికలేక ఆయన సంగీత సాధన పూర్తికాలేదు. కాని ఆయన ఎప్పుడూ ఏదో కూనిరాగం తీస్తూనే వుంటాడు. ఎలాగైనా తీరిక చేసుకొని ఒక పాట కచ్చేరి చెయ్యాలని ఆయన అభిలాష. ఆయన్ని పాటకుడిగా గుర్తించినవాళ్లంటే ఆయనకు చాలా అభిమానం. "అసలు సంగీతం గురించి నాకు తెలిసినంత మరెవ్వరికీ తెలియదు" అని వున్న రహస్యం కాస్తా మూర్తికి చెప్పేశారాయన.

"అల్లాగా. చాలా సంతోషం" అన్నాడు మూర్తి.

"అసలు నేను, 'ఎవరినీ నిర్మా—ఆ—ఆ—ఆ—ఇంచేదిరా' అని ఎత్తుకున్నానంటే సభంతా డంగైపోవల్సిందే"

"అబ్బ!"

"అందులో, "శివుడవో—మా ఆ—ఆ—ఆ—ధవుడవో" అన్నచోట నేను పాడినట్లు మరెవ్వరూ పాడలేరు, ఒక్క సెమ్మంగుడితప్ప. అసలు నేను ఇప్పుడు వేసిన సంగతి ఇరవైరెండేళ్ల క్రిందట సెమ్మంగుడి రసికరంజని సభలో పాడుతూ వేసినది" అన్నారు రామస్వామిగారు ఆ సంగతి పాడి వినిపించిన తరువాత.

మూర్తి అదివిని, "ఓహో! చాలా బావుంది" అన్నాడు.

ఎన్నాళ్లనుంచో తగిన ఆడియన్సులేక తనగానసుధని మరుగుపరిచిన రామస్వామిగారికి మూర్తి చాలా మంచి రసికుడిలా కన్పించాడు. "ఇదిగో ఇంకోటి" అంటూ ఒక చెయ్యి చెవిదగ్గర పెట్టుకుని, ఇంకో చెయ్యి గాలిలో విసురుతూ, పై స్థాయిలో పాట ఎత్తుకుంటూ, "ఏ—లావా—ఆ—ఆ—తా—ఆ—ర— మెత్తుకొంటివో—వో—వో—వో—" అని రామస్వామిగారు పల్లవి పాడి ఆపారు.

"ఇది, పది హేనేళ్ల క్రిందట సరస్వతీగానసభలలో పట్టమ్మాళ్, అచ్చు ఇలా—ఎత్తుకుని పాడేటప్పటికి, అలా కూర్చున్న (ఎదురుగుండా ఖాళీ స్థలం చూపిస్తూ) ఆడియన్సంతా డంగైపోయారు. ఇవతల ఫిడేలువాడూ (రామస్వామిగారు పక్కనున్న బెంచీని చూపిస్తూ) అవతల మద్దెలవాడూ (ప్రక్కనున్న గోడని చూపించారు) హడలిపోయారు. హాలంతా గోల."

"ఆ!" అన్నాడు మూర్తి.

"ఏమిటనుకున్నారు. (మళ్లీ పాట ఎత్తుకుని) —ఆ—ఆ—ల—మేపుటకో—ఒ—ఒ—ఓ, అయోధ్యా—ఆ—ఆ—ఆ—" అని ఆపి "ఇక్కడ నెరవు చెయ్యాలి" అని గొంతుక సవరించుకున్నారు రామస్వామిగారు. ఆయన గొంతుక మరి పాడలేనని మొరాయించింది. పాడడం ఆపి "పదేళ్ల క్రిందట, సుబ్బలక్ష్మి పాట కచ్చేరీ విని, ఇంటికివచ్చి "నీదుచరణ పంకజముల" అనే కీర్తన అచ్చు ఆమెలా పాడ్దామని తెల్లవార్లూ కూచొని సాధకం చేశాను. తెల్లారేప్పటికి మరి గొంతుక పలకడం మానేసింది—ఇలాగే" అంటూ జేబులోంచి రెండు లవంగాలు తీసి నోట్లో వేసుకున్నారు రామస్వామిగారు.

"ఏమిటవి?" అంటూ చెయ్యి చాచాడు మూర్తి.

"లవంగాలు" అంటూ మూర్తి చేతులో రెండు వేసి, "ఎప్పుడూ జేబులో గుప్పెడు లవంగాలు వుంచుకోవడం అలవాటు. ఏమో, ఏ నిముషంలో పాట కచ్చేరీ చెయ్యాలిసివస్తుందో!" అన్నారు రామస్వామిగారు. మూర్తి అవునని తలూపాడు.

ఇంతలో సత్యానందంగారు వచ్చి రామస్వామిగార్ని పలకరించారు. రామస్వామిగారు తను సత్యానందం బావమరదికి పిల్లనిద్దామని వచ్చానని చెప్పారు. సత్యానందంగారు రమాదేవిని పిల్చారు. రమాదేవితో విషయమంతా చెప్పారు. రామస్వామిగారు ఆవిడ వైపుచూసి, "అమ్మా! నాకున్నది ఒక్క కూతురు. దానికి కష్టపడి వీణ చెప్పించాను. సునాయాసంగా పాటకచ్చేరీ చేస్తుంది. రేడియోలో పాడించమని అందరూ అంటున్నారు. అంటే—పాట కాదనుకోండి. పాట కూడా వచ్చును. దాని గొంతుక త్రిస్థాయీ, పలుకుతుంది. మీకు ఒక్కటే మచ్చు మా అమ్మాయి గొంతుక కొంచెం పట్టమ్మాళ్ గొంతుకలావుంటుంది. అయినాసరే. నేను చిన్నప్పటినుంచీ రవివర్మ సరస్వతి ఫోటో చూసి మా అమ్మాయి అలా వుండాలని, వీణ చెప్పించాను. చేతిలో వీణ పట్టుకొని మా అమ్మాయి ఫోటో తీయించుకుంది. వెనక్కాతల ఏనుగూ, అదీ లేదనుకోండి! అయినా మా అమ్మాయి అచ్చు సరస్వతీలావుంది" అని ఒక ఫోటోతీసి ఆవిడకు చూపించారు. ఆవిడ ఆ ఫోటో తీస్కొని వాళ్ల తమ్ముడికి చూపిస్తానంది. వారం రోజుల్లో పిల్లను చూచుకోవడానికి వస్తామంది.

రామస్వామిగారు ప్రసాద్ ఫోటో అడిగారు. అదివ్వగానే, పిల్లను చూసుకోవడానికి వారం రోజుల్లో వారి యావన్మందినీ తమ వూరు రమ్మని ఆహ్వానించి, బైటకువస్తూ, చిన్న స్వరకల్పన ఆరంభించి, స్టేషనుకువెళ్లి, దారిపొడుగునా తనలో తను స్వరకల్పన వేసుకుంటూ, మధ్యమధ్య ఫిడేలువాడికి ఛాన్సుఇస్తూ, మొత్తానికి రైల్లోవెళ్ళి కూచున్నారు.

రామస్వామిగారి అమ్మాయిపేరు పద్మ. ఆ అమ్మాయికి ప్రపంచమంతా సినిమామయం. కొత్త సినిమా, మొదటిఆటకు తెగే మొదటి టిక్కట్టు ఆ వూరిలో పద్మదే. ఆ అమ్మాయిదగ్గర సినిమా పాటల పుస్తకాలెన్నున్నాయో లెక్కలేదు. సినిమా పాటలన్నీ బాగా పాడుతుంది. అసలామ్మాయి ఇంట్లో ఇరవైనాలుగు గంటలూ 'సినిమూడ్'లోనే వుంటుంది. అంటే కాస్సేపు "మాంగల్యబలం"లో సావిత్రి (హీరోకోసం ఎదురు చూస్తున్నప్పుడు) లాగా, మరో కాస్సేపు 'శాంతినివాసం'లో రాజసులోచన (హీరో పిక్చరు గీస్తున్నప్పటి)లాగా, ఇంకొంచెం సేపటికి 'అప్పుచేసి పప్పుకూడు'లో జమున(హీరోవేపుచూస్తున్నప్పుడు)లాగా—అలా ఏదో ఒక సినిమాలో స్టార్‌లా వుంటూనే వుంటుంది. అసలు సినిమారంగంలో హీరోనేగాని పెళ్లాడనని భీష్మించుకు కూర్చుంది. ఒక ప్రఖ్యాత సినిమా నటుడుకి బోలెడు ప్రేమలేఖలు రాసిందట.

ఆమెరాసిన ప్రేమలేఖలకు జవాబు రాకపోయేటప్పటికి, ఆ హీరోమీద కోపంవచ్చి, మద్రాసువెళ్ళి అతనిఇంటిముందు నిరశనవ్రతం చేద్దామనుకొని బయ

ర్దేరిందిట. ఆ వళంగా ఆవూళ్లో కొంతమంది అడ్డు పడి, ఆ నటుడికి ఇదివరకే పెళ్ళయిపోయిందనీ, ఇద్దరు పిల్లలు కూడా పుట్టారనీ, కనుక పద్మ నిరశన వ్రతం చేసినా లాభంలేదని బోధపరిచాక ఆ మహత్కార్యంమండి విరమించుకొంది. కానీ తీవ్రమైన ఈ ఆశాభంగం సంహించలేక, ఈ జన్మలో కాకపోతే మానే, వచ్చే జన్మలోనైనా ఆ సినీ హీరోకి భార్యగా జనింపచెయ్యమని ఏడుకొండలవాడికి మొక్కుకుంది.

ప్రస్తుతంలో ఆమె చేసుకోబోయే అబ్బాయికి కొన్నైనా సినిమాకళ, హీరోకళ లుండాలని పట్టుబట్టింది. రామస్వామిగారు తెచ్చిన ఫోటోచూసి, "ఇదేమిటి నాన్నా! ఇలా వున్నాడీ అబ్బాయి?" అని అడిగింది. మొగంమీదకి వడుతున్నజుట్టూ, లాల్చీ జీర లున్న కళ్ళతో వున్న ప్రసాద్ ఫోటో ఆమెకంతనచ్చలేదు. అతనిలో ఆమెకు ఏ సినిమా యాక్టరు పోలికా కన్పించలేదు.

"అదేమిటమ్మాయ్! 'దేవదాసు'లో దేవదాసులా గున్నాడుకదూ ఈ అబ్బాయి" అన్నారు రామస్వామిగారు.

"హో! దేవదా!" అంటూ పార్వతి దేవదాసును చూసినట్లు చూసింది పద్మ ఆ ఫోటోవేపు. ఆమెకు వెంటనే ప్రసాద్ నచ్చడం, అతన్ని ప్రేమించడం జరిగిపోయింది.

సినీ హీరోయిన్‌లా సిగ్గు నటిస్తూ, 'నాన్నా ఆయనెప్పుడు వస్తారు! అంది పద్మ. అప్పుడామె ముఖంలో భావాన్ని పోల్చడానికి తగిన హీరోయిన్, సినిమారంగంలోకి ఇంకా రాలేదని చెప్పాలి.

అప్పుడే 'ఆనంద భైరవి' రాగాలాపన ముగించి, 'మధురానగరిలో' పాట ఎవరి స్టైల్లో (అంటే అరయక్కుడా, చిత్తూరా?)ఎత్తుకుందామాఅని ఆలోచిస్తున్న రామస్వామిగారు కూతురి ఆతృత గమనించి సముచిత సమాధానం ఇచ్చారు.

ఇక, కళ్ళికోట లాటరీ తియ్యడం, అందులో తన పేరు—కలికంవేసి చూసినా —ప్రైజు లిస్టులో లేకపోవడం జరిగిందని తెలుసుకున్న ప్రసాద్ ఖిన్నవందనంతో ఇంటికి తిరిగి రాగానే రమాదేవి, పద్మ ఫోటో అతని చేతికిచ్చింది.

ప్రసాద్ పద్మ ఫోటోచూసి మూర్ఛపోలేదుగాని పిల్ల బాగానేవుందనుకున్నాడు. కాని అతనికి కావలసింది అందమైన అమ్మాయికాదు. డబ్బు.

"నా కెందుకక్కా! ఈ అమ్మాయి. మనకిప్పుడు కావలసింది డబ్బు!" అన్నాడు ప్రసాద్.

"డబ్బు సంగతి సరేలేరా. ముందు పిల్ల నచ్చిందో లేదో చెప్పు!" అంది రమాదేవి తమ్ముడితో.

"డబ్బు వచ్చేటట్లయితే, ఇంతకన్నా పదిరెట్లు అందవికారంగావున్న అమ్మాయినైనాసరే పెళ్లాడుతాను."

"ఆ అమ్మాయి రామస్వామిగారి ఏకైక పుత్రిక. ఆయన భార్యపేర సుమారు రెండు మూడు లక్షలు ఖరీదుచేసే ఆస్తివుంది"

"రైటో! వెంటనే ఆ అమ్మాయిని పెళ్ళి చేసేస్కుంటాను" అన్నాడు ప్రసాద్, ఎగిరి గంతేసి, వుత్సాహంతో.

ప్రసాద్ అంగీకరించినట్లు ఉత్తరం అందిన తరువాత రామస్వామిగారు రెండు నెలల తరువాత గాని మంచి ముహూర్తంలేదనీ, అందుకని రెండు నెలలవరకూ ఓపికపట్టమని వ్రాశారు. ప్రసాద్, ఈ లోపల తనకు భార్య ద్వారా రాబోయే రెండు లక్షల రూపాయల్నీ ఎలా వినియోగం చెయ్యాలా? అని తీవ్రంగా ఆలోచించసాగాడు.

సత్యానందంగారి ఆముష్మికచింత నెరవేర్చడంకోసం స్వయంగా ఆ పరమేశ్వరుడే వచ్చాడేమోనన్నట్లు, ఒకనాడు హిమాలయాల్నించి తిన్నగా వస్తున్న 'యోగనంద సరస్వతి' అనే యోగీశ్వరులు ఆవూరు వచ్చి, ఆవూరి దేవాలయంలో బస చెయ్యడం జరిగింది.

యోగానందసరస్వతిగారు కోవెలలో దిగిన మరుక్షణంలో వారి ఆగమనవార్త వూరంతా గుప్పుమంది. ఆయన సుమారు వందఏండ్లపైగా సమాధిలోవుండి, ఒక సంవత్సరంపాటు సమాధి చాలించి దేశాటన చేద్దామని బయల్దేరారు. ఆయన హిమాలయాల్లో,మానస సరోవరం ఒడ్డున, ఒక గుహలో ఎన్నివందల ఏండ్లనుంచో తపస్సు చేస్తున్నట్లు జనానికి తెలిసింది. ఆయనికి అష్టసిద్ధులూ వున్నాయని కూడా జనం పసిగట్టారు. ఆయన ఆహారం తీసుకోరు. హిందీ మాట్లాడుతారు. కొంతమంది శిష్యుల్ని తరింపచెయ్యడానికి ఆయన బయల్దేరినట్లు తెలిసింది.

సత్యానందంగారు ఇది విన్నవెంటనే 'సిరికింజెప్పడు' శంఖ చక్ర యుగమున్ చేదోయి సంధింపడు. . . ." అన్నట్లుగా పరిగెత్తివెళ్లి యోగనంద సరస్వతులకాళ్ల మీద పడ్డారు. ఆయన వెనక్కాలే మూర్తి కూడా వెళ్ళి ఆయనకి నమస్కరించాడు.

యోగిగారు సత్యానందంగార్ని కటాక్షించారు. ఆయన్ని ఆశీర్వదించారు. సత్యానందం వెంటనే స్వామిజీ బస మార్చేసి తన యింటికివచ్చి తన ఆతిథ్యం స్వీకరించాలని కోరారు. స్వామిజీ, తను సత్యానందం ఇంటికివస్తే, తనకోసం అనేకమంది భక్తులు వస్తూండడంవల్ల అతనికి ఇబ్బంది కలగచ్చునన్నారు. సత్యానందం తనకు అందువల్ల ఏమీ ఇబ్బంది కలగదన్నారు. స్వామిజీ రోజూ భక్తులకు కొంత బోధ చెయ్యాలన్నారు. సత్యానందం తనింట్లో కావలసినంత స్థలంవుందనీ, ఎంతమంది భక్తులు వచ్చినా ఫరవాలేదనీ అన్నారు.

భక్తుడైన సత్యానందం పట్టుదలకి స్వామిజీ తలయొగ్గక తప్పిందికాదు. అందులో సత్యానందంగారి పక్కనున్న మూర్తి స్వామిజీకి హిందీలోనే నచ్చచెప్పాడు. మూర్తికి కొద్ది కొద్దిగా హిందీ వచ్చును. స్వామిజీ సత్యానందంగారి ఇంటికి రావడానికి అంగీకరించగానే, సత్యానందంగారు మూర్తిని కావిలించుకున్నాడు. వెంటనే ఇంటికివెళ్లి స్వామిజీ ఆతిథ్యానికి తగిన ఏర్పాటులు చెయ్యమన్నారు మూర్తిని.

మూర్తి ఇంటికివచ్చి రమాదేవిగారితో ఈ విషయం చెప్పాడు. స్వామిజీ చాలా మహాత్యం కలవాడనీ,




మా అయ్యగారు బాకీని ముక్కుపిండి మరీ వసూలు చేసుకరమ్మన్నారు.

# అంతా మిథ్య

అందువల్ల ఆయినా కాంట్రాక్టుల్లో చాలా లాభముంటుం దనీ చెప్పాడు. రమాదేవి ఎలాగైనా స్వామి ఆశీర్వాదం పొందితే ధనయోగానికి సులభమైన మార్గం దొర కదా! అని ఆలోచించింది. ప్రసాద్ కూడా స్వామీజీ ఆశీర్వాదంపొంది ఏలాగైనా డర్బీస్వీప్ టిక్కట్లు నాలుగు కొనాలని నిశ్చయించేడు.ఇంటిల్లిపాదీ స్వామిజీ రాకవల్ల తమ ఆశలు నెరవేరే సమయం వచ్చిందని అను కున్నారు.

సత్యానందంగారు తమ మేడంతా స్వామిజీ అధీనం చేశారు. స్వామి రోజుకు శేరు పాలుతప్ప మరేమీ పుచ్చుకోరు. పళ్లు ఎప్పుడైనా తింటే తింటారు. నిరంతరం భజన చేయిస్తూంటారు. శిష్యులుగా చేరదల్చినవాళ్లకి ఉపదేశం చేస్తారు. సాయంకాలం పూట రోజూ తమ హిమాలయ అనుభవాలూ, భగ వంతుడి లీలలూ మొదలైనవాటి గురించి ఉపన్యాసా లిస్తూంటారు. ప్రొద్దున్న పూజ చేయిస్తారు. తరు వాత నామసంకీర్తన, సాయంకాలం హారతి, రాత్రి భజనలు. వీటితో సత్యానందంగారి యిల్లు గొప్ప ఉత్సవ మందిరంలా తయారైంది.

స్వామికోసం పళ్లూ, ఫలహారాలు తీసుకొనివచ్చే భక్తులకు ఎడతెరిపిలేకుండావుంది.సాయంకాలం స్వామి ఉపన్యాసం వినడానికి వచ్చే భక్తులకు సత్యానందం గారి యిల్లు చాలేదికాదు. అప్పటికీ 'మైకు'లు ఏర్పాటుచేసి స్వామి ఉపన్యాసం బైటకు వినిపించే టట్లు కూడా చేశారు. అయినా జనం అనేకమంది నిరాశ పొందవలసి వస్తోంది. తగినచోటు దొరక్క సత్యానందంగారి ఇంటిముందు పెద్ద పందిర వేయిం చా

భక్తగురించీ, భగవంతుడి గురించి స్వామి ఉపన్య సిస్తూంటే వింటున్న భక్తులు కళ్లమ్మట నీళ్లు కార్చేశేవారు. ఆయన ఒక్కొక్కవాక్యం చెపుతుంటే జనం వళ్లుమర్చిపోయేవారు. ఊళ్లో ఎక్కడచూసినా స్వామివారి తేజస్సు గురించీ, ఆయన మహిమ గురించీ ఆయన వాగ్ధాటి గురించి పొగడ్తలే. సత్యానందంగారి యింట్లో స్వామి బస చెయ్యడం, సత్యానందంగారి అదృష్టం అన్నారు.

సత్యానందంగారుకూడా స్వామి ఆశీర్వాదంతో మోక్షాన్నిపొందేమార్గం తెలుసుకోవాలని నిశ్చయిం చారు. స్వామి కూడా సత్యానందాన్ని తరింపజేసే వుద్దేశంతోనే వున్నారు. ఆయనకు మంత్రోపదేశం చేసి రోజూ ఆయనచేత సాధన చేయించటం ప్రారం భించారు. వారం రోజులయ్యేటప్పటికి సత్యానందం గారు, స్వామి చెప్తున్న సాధన చెయ్యటం చాలా కష్ట మని గ్రహించారు. ఏకాగ్రతా, ప్రాణాయామం జపం, ఈ మూడింటితో కూడిన సాధన చెయ్యటం అంటే వేదాంతం గురించి కబుర్లు చెప్పటం కాదని తెలుసుకున్నారు. అయినా పట్టుదలతోచేసి స్వామి అనుగ్రహం పొందుదామనుకున్నారు.

రమాదేవి రోజూ, స్వామి నెలాగైనా ఏకాంతంగా కలుసుకొని తన మనస్సులో ధనం గురించీ, సంతానం గురించీ వున్న దిగులు పోయే మార్గం కనుక్కుందా మని ప్రయత్నించేది. పదిరోజులదాకా ఆమెకా అవ కాశం చిక్కలేదు. తరువాత ఒకనాటి మధ్యాహ్నం స్వామి ఒంటరిగా వున్నప్పుడు వెళ్లి నమస్కరించింది. స్వామి ఆమెను చూస్తూనే హిందీలో, "అమ్మాయి! నీ మనస్సులోవున్న దిగులు నాకు తెలుసు. కొద్ది రోజుల్లోనే తీరిపోతుంది" అన్నారు. రమదేవి సంతో షంతో ఉప్పొంగిపోయింది. తన కోరికలు కొద్ది రోజుల్లో నెరవేరుతాయని అర్థం చేసుకుంది.

మూర్తి, రమాదేవికి అన్ని విషయాల్లో కుడి భుజంలా వుండడంవల్ల మూర్తితో ఈ విషయం చెప్పింది. అంతకు మునుపే చాలా రోజులబట్టీ మూర్తితో, ఏదైనా లాభసాటి వ్యాపారం చూడమనీ, తను మదుపు పెడతాననీ రమాదేవి చెప్పింది. అందు కని, స్వామిగారి ఆశీర్వాదం లభించింది కాబట్టి, ఆలస్యం చెయ్యడం మంచిదికాదని మూర్తి ఒక రైల్వే బిల్డింగు కంట్రాక్టు చేద్దామనీ, దాంట్లో చాలా లాభముంటుందనీ చెప్పాడు. ముందర ధరా వతు కట్టడానికీ, ఆఫీసర్లకూ లంచాలివ్వటానికి పది వేలుదాకా కావాలని రమాదేవికి చెప్పాడు. అందులో కనీసం ఏభై వేలయినా లాభం వుంటుందని చెప్పాడు.

రమాదేవిదగ్గర పైకం లేకపోయినా, తన బంగారం తాకట్టుపెట్టి, మూర్తిచేతికి డబ్బిచ్చింది. సత్యా నందంగారికి ఈ విషయం తెలియనివ్వకూడదనీ, కాంట్రాక్టు దొరకగానే సబ్ కంట్రాక్టులిచ్చేసి పనిజరిపించెయ్యాలనీ, రమాదేవీమూర్తీ కూడబలుక్కొ న్నారు. మూర్తి తనకీ పనుల్లో చాలా అనుభవముందనీ తన స్నేహితు లనేకమంది అనేక కంట్రాక్టులు చేస్తు న్నారనీ రమాదేవికి చెప్పాడు. ఈ కంట్రాక్టులో లాభం రాగానే, ఇంకా బోలెడు కాంట్రాక్టులుచేసి లక్షలు ఆర్జించవచ్చునని రమాదేవి ఆశపడింది.

స్వామిగారువచ్చి నెలరోజులు కావస్తోంది. మరొక మూడు రోజులలో తాము ఆ వూరినుంచి మకాం ఎత్తేయ్యదల్చుకున్నట్లు స్వామివారు అందరికీ తెలియ జేశారు. భక్తులంతా ఆయన్ని ఇంకా వుండమని వేడుకోసాగారు. కాని ఆయన వినలేదు. అంతేకాక హరిద్వారంలో తామొక ఆశ్రమం నిర్మించాలను కుంటున్నామనీ, అందుకు భక్తులంతా తమకుతోచిన విరాళాలు ఇవ్వమనీ విజ్ఞప్తి చేశారు. ఆయన అడి గిందే తడువుగా భక్తులంతా తలొక రూపాయి, రెండూ, అయిదూ, పదీ ఇవ్వడం మొదలెట్టారు. స్వామి ఈ డబ్బంతా జాగ్రత్తగా వసూలుచేసి తన కప్పచెప్పమని మూర్తిని నియమించారు. మూర్తి

ఒకనాటిరాత్రి ఒక సభలో కొంతమంది సభ్యులు ఉపన్య సించిన తరువాత అధ్యక్షుల వారు లేచి, తమ ఉపన్యాసం మొదలుపెట్టా.

"నేటిదినము నేను చెప్పపోయే దేమిటంటే !" అని ప్రజానీకం వైపు చూశాడు.

అంతలో "ఇది పగలు కాదు. రాత్రి" అని గుంపులో నుంచి ఒక గొంతుక వినిపించింది.

యస్. బాలగంగారాం, (నిజామాబాద్)

ఆ మూడు రోజులూ అన్నం నిద్రా మానేసి బోలెడు డబ్బు వసూలు చేసేడు. మూడవనాడురాత్రిదాకా వసూలు చేస్తూనే వున్నాడు.

తెల్లవారితే స్వామి ఆవూరినుంచి వెళ్ళిపోతారు. మూర్తిని తమతో ప్రక్కవూరికివచ్చి ఒకరోజు వుండమని కోరారు. తనయందు అవ్యాజాను రాగం చూపిస్తున్న స్వామికి మూర్తి సాష్టాంగ నమ స్కారంచేసి, 'అలాగే తప్పక స్వామితో వస్తా'నన్నాడు. సత్యానందంగారు కూడా అందుకు సమ్మతించారు.

ఆ రాత్రంతా స్వామిదగ్గర కూర్చొని సత్యానందం గారు సాధన చేశారు. కాని, చివరికి ఆయన తెలుసుకొన్న దేమంటే స్వామి చెప్పే సాధన కొన్ని రోజులలో రాదనీ, కొన్ని సంవత్సరాలు కఠోర నియమాలతో సాధనచేస్తే దాని స్వరూపం తెలియవచ్చుననీ. అటు వంటి సాధన తను ఈ ప్లీడరీ వృత్తిచేస్తూ, చెయ్య టం కష్టం. కాని ఈ వృత్తిని తనవంట్లో వోపిక వున్నంతకాలం వదలలేడు. అంటే ఈ జన్మలో సాధన చెయ్యటం సాధ్యంకాకపోవచ్చు. తను ఇన్నాళ్ళనుంచీ చెప్పిన వేదాంతం కబుర్లు వట్టి వృథా కాలయాపన మాత్రమే. క్రియ ఎంత కష్టమో స్వామి దయవల్ల తెలిసింది.

తెల్లవారి, స్వామి బయల్దేరేముందు మూర్తి కోసం చూచారు. బహుశా ముందుగానే స్టేషన్‌కు వెళ్ళివుంటాడని ఎవరో అన్నారు. స్వామిని భక్తు లంతా మేళ తాళాలతో స్టేషనుకు తీసికెళ్ళి రైల్లో కూచోపెట్టారు. అందరూ ఆయనకు పూలమాలలు వేశారు. స్వామికి మూర్తి మాత్రం కనిపించలేదు. బహుశా వేరే పెట్టెలో ఎక్కివుంటాడనుకున్నారు. రైలు కదిలిపోయింది.

స్వామికి మరి మూర్తి కన్పించలేదు. మూర్తితో బాటుస్వామి హరిద్వారాశ్రమంకొరకు వసూలు చేసిన విరాళాలు కూడా అదృశ్యమయ్యాయి.

సత్యానందంగారి వైరాగ్యచింతతగ్గి మామూలు వ్యవహారాలు చూసుకోవడం మొదలెట్టగానే ఆయ నకు తెలిసిన విషయం రమాదేవిగారు నగలు తాకట్టు పెట్టి మూర్తికి డబ్బివ్వడం ఆ డబ్బు తీసుకొని మూర్తి పరారి అవడం. తరువాత వాకబు చెయ్యగా మూర్తి స్వామివారి ప్రయాణానికి ముందురోజునే భార్యను పుట్టింటికి పంపేసి, ఆమెతో రెండు మూడు నెలలు తను దేశాటనం చెయ్యబోతున్నానని చెప్పినట్లు తెలిసింది. గట్టిగా పోలీసు రిపోర్టు ఇచ్చి వెతి కిద్దామంటే, రమాదేవి మూర్తికి డబ్బిచ్చినట్లు ఋజువేలేదు.

వారం రోజుల తరువాత సత్యానందంగారికి ఒక ఉత్తరం వచ్చింది. ఆత్రుతగా విప్పిచూసేసరికి, అది రామస్వామిగారి దగ్గర్నుంచి. వెంటనే రమాదేవినీ, ప్రసాద్‌ని పిలిచి ఆ ఉత్తరం చదివారు. అందులో తన కూతురైన పద్మ, అచ్చు సినిమా హీరోలావున్న ఒకబ్బాయిని ప్రేమించిందనీ, ఇద్దరూ డైరక్టుగా సినిమాల్లో జేరిపోదామని ఎవరితో చెప్పకుండా మద్రాసు వెళ్ళి అక్కడ రిజిష్టరుమారేజ్ చేసుకొని, ఆ విషయం తనకు తెలియబర్చిందనీ, కాబట్టి ప్రసాద్‌కి వేరే సంబంధం చూసుకోమనీ రామస్వామిగారు రాశారు.

సత్యానందంగారు భార్యవైపు తిరిగి, "ఇన్నాళ్ళూ 'అంతామిథ్య' అంటే ఏమిటో తెలిసేదికాదు. ఇప్పు డిప్పుడే తెలిసిపోతుంది సుమా!" అన్నారు.



హైదరాబాద్ మూవీస్ వారి 'పెళ్ళికాని పిల్లలు'లో జగ్గయ్య, పద్మనాభం, జమున, ప్రభృతులు.

చిత్రసమీక్ష :

# రంగులు, సెట్టింగుల హంగామా "సంపూర్ణరామాయణం"

కథ అందరికీ తెలిసినదే. ఐనా దానికి హంగులు సమకూర్చి, కొత్త మార్పులుచేసి చూపించటం వల్ల చలనచిత్రాలు రక్తికట్టటం సహజం. అలాంటిదే బసంత్ పిక్చర్స్ (వాడియా బ్రదర్స్) వారి సంపూర్ణ రామాయణం

రామలక్ష్మణులను యాగ సంరక్షణార్థం తన వెంట పంపమని విశ్వామిత్రుడు దశరథమహారాజా నడగటంతో నుంచి చిత్ర మారంభమవుతుంది. యాగ రక్షణం, అహల్యా శాప విమోచనం, శివ ధనుర్భంగం, సీతారాముల వివాహం, సీతా రామ లక్ష్మణుల వనవాసం, సీతాపహరణం, రావణ సంహారం, అయోధ్యానగర ప్రవేశం, ప్రజాపవాదు కారణంగా సీతా వనవాసం, లవకుశ జననం, సీత భూమాతలో ఐక్యం కావటంతో రామాయణ చిత్రకథ సంపూర్ణ మవుతుంది.

ఆంధ్రులకు పరిచితమైన కథలో కన్న ఇందులో కొన్ని మార్పులు కన్పిస్తాయి. రామలక్ష్మణులు సీతాన్వేషణలో తిరుగుతూ ఉండగా హనుమంతుని పరిచయం జరుగుతుం దని ఆంధ్రులకు తెలిసిన కథ. కబంధుని హస్త ఘాతానికి విముక్తి కోరి క్రిందికి పడనున్న లక్ష్మణుని హనుమంతుడు రక్షించినట్లు తద్వారా రామునకు ఆంజనేయునితో పరిచయం కల్గినట్లు చేసిన పింతకల్పన బాగానే ఉంది. ఇలాగే ఇంకా ఒకటి రెండు మార్పులు ఈ చిత్రంలో కన్పిస్తాయి.

ప్రశంసనీయమైన నటన చూపగల నటులు అందరు పాల్గొన్నా లవకుశ పాత్రధారుల నటన మాత్రమే బాగుంది. సినీ సీతగా అనితాగుహ వేషం బాగుంది.

నిర్దుష్టమైన వర్ణ ఛాయాగ్రహణంతో, అతి భారీ అయిన సెట్టు చూడ ముచ్చటగా ఉన్నాయి. వాల్మీకి ఆశ్రమంఎంతో సహజంగా, ఏకోశానా ఇది 'కృతకం' అన్న భావం కల్గకుండా ఉంది. కళాదర్శకత్వ విలువలు చిత్రంనిండా స్పష్టంగా కన్పిస్తున్నాయి.

భారీ చిత్రాలను నిర్మించే మన తెలుగు చిత్ర నిర్మాతలు 'సెట్స్'లో సహజత్వం గోచరింపజేసే పద్ధతుల్లో ఎంతో అనుభవం గడించాల్సి వుందని పిస్తుంది ఈ చిత్రం చూస్తే. అసలు మన చిత్రాలు చాలావాటిలో అవుట్‌డోర్ తీసినా సెట్ వాతావరణమే కన్పిస్తుందాయె! అలా కాకుండా సెట్ వేసినా అవుట్‌డోర్ ఎఫెక్టుతో సహజత ఉట్టిపడడం ఈ చిత్రంలో ప్రత్యేకత.

చిత్రంలోవున్న కొరతల్లోపాల్లో ఎన్నని విమర్శించటం! సిద్ధహస్తు లందరు పనిచేసినా, అవనిజ అవనీగర్భంలోకి వెళ్లాల్సిన సన్నివేశం సరిగా నిరూపించలేకపోయారుగదా! రామనామం జపిస్తూ రాముడే తన దేవుడుగా కాలం గడిపిన సీత ఆ రాముడే పశ్చాత్తప్తుడై ఆదరించనున్నప్పుడు, వాల్మీకి ప్రభృతులు సీతను స్వీకరించ

# చిత్రసమీక్ష



'అమూల్యకానుక'లో పద్మిని.

చెప్తూన్నప్పుడు, ఆ సీతాదేవి అవనీగర్భంలో తనను చేర్చుకోమని ప్రార్థించాల్సిన అవసరం ఏమిటి? వీడో వచ్చిందే అనుకున్నా రాముడు వారందరిఎదుటే భూమిలోకి పోవచ్చునే, అనుమ దూరం పరిగెత్తి, రాముని పరుగెత్తించి ఎక్కడో భూమిగర్భం చేరాల్సిన అవసరం ఏమిటి? రాముడు తనను ఆ ప్రయత్నం నుంచి వారిస్తాడేమోనని పరుగెత్తిపోయిందా? విధివిలాసంకు తలఒగ్గక తప్పదని నిరూపించిన మానవోత్తముడు రాముడే కదా! తనయెదుట సీత భూమిలోకి వెళ్ళిపోయిందన్నా అతడు ఏం చేయగలిగి ఉండేవాడు? రామావతారం పరిసమాప్తిని సూచించేందుకు సీత భూగర్భప్రవేశం జరిగిందంటే అలాంటిది ప్రేక్షకులకు తెలియజెప్పి దానంతటదైనా కల్పించి ఉంటే బాగుండేది. ఈ సన్నివేశానికి ఈ దృశ్యకావ్యంకన్న శ్రవ్యకావ్యాల్లోనే బాగా నిరూపించారు. శ్రవ్యకావ్యాల్లో వివరణలను కంటికి స్పష్టంగా, మెదడుకు మేతలేకుండా తెలియచేయటమే దృశ్యకావ్య ప్రయోజనం. అలాంటి దృశ్యకావ్యాలే చలనచిత్రాలంటే.

అసలు చిత్రంలో ఎక్కువభాగం ప్రత్యక్షవ్యాఖ్య రూపంలో కథాకథన సంవిధానం పొసగించుకుని చకచక సాగిన ఈ చిత్రంలో ఔచిత్యానౌచిత్య ప్రసక్తే పెద్ద అనౌచిత్యమేమో ననిపించినా ముందు ముందు భారీ చిత్రాలు నిర్మించేవారంతా పరిశీలించదగ్గ విషయమిది.

చిత్రౌన్నత్యానికి తగినట్టుగానే సుసంపన్నమైన సంగీతం కూడా సరళంగా, వీనులవిందుగా సాగిపోయింది. రఘురామా, దారి చూపవా, బాధలో పడి .... పాటలు మళ్ళీ వినాలనిపిస్తున్నాయి.

తర్జుమా సాహిత్యాన్ని సమకూర్చిన శ్రీశ్రీ మాటలు, పాటలు బాగానే ఉన్నాయి.

విశ్రాంతిదాకా టాకీలకన్న మూకీలే నయమనే అభిప్రాయం కల్గించినా ఈ చిత్రం రెండవ భాగం నుంచి తర్జుమా సంతృప్తికరంగా సాగిందేమో ననిపిస్తుంది. ఇంచుమించు పాటలకు పెదవుల కదలికకు పొందిక చక్కగా కుదిరింది. తర్జుమా విధానంలో ఇంకా కొంత అభివృద్ధి సాధించాల్సి ఉందని ఇటీవలి చిత్రాలు నిరూపిస్తున్నవి. ఈ చిత్రంలో మంథర మాటలకు పెదవుల కదలికకు గల పొంతన పరిశీలిస్తే అసలు టాకీలే ఎప్పటికీ వద్దు అన్న భావం కలిగినా ఆశ్చర్యం లేదు.

కనువిందైన వర్ణచ్ఛాయాగ్రహణం భారీ సెట్టింగులు, సరసమైన సంగీతం గల ఈ చిత్రం పవిత్రమైన రామాయణ కథ కనుక, ఆంధ్ర ప్రజానీకం లోపాలన్నిటిని సరిపెట్టుకొని, ఆదరించిన విశేషమేమీ ఉండదు. ★

"నాగరాజ్"

# వార్తాభరణం

## 'ఖైదీ కన్నయ్య' ప్రారంభం

హిందీలో 'ఖైదీ నం. 911' గాను, తమిళంలో 'ఖైదీ కణ్ణాయిరం' గాను ప్రజామోదం పొందిన కథ ఆధారంగా, రాజ్యలక్ష్మీ పిక్చర్సువారు తెలుగులో నిర్మిస్తున్న "ఖైదీ కన్నయ్య" చిత్ర నిర్మాణం ప్రారంభమైంది

గతనెల 25 న గోల్డెన్ స్టూడియోలో 'ముహూర్తం' షాట్ తీశారు.

చేస్తున్న కార్యకలాపాలు, పరిశోధనలాధారంగా నడిచే యీ చిత్రంలో రేలంగి, కాంతారావు, బాలకృష్ణ, గుమ్మడి, రాజనాల, కె. వి. ఎస్. శర్మ, గిరిజ, సంధ్య, (రాజసులోచన, కృష్ణకుమారిల్లో ఎవరో ఒకరు నియమింపబడవచ్చు), బేబీ సావిత్రి, బేబీ సుమంగళ మొదలైనవారు పాల్గొంటున్నారు

మాటలు, పాటలు : జి కృష్ణమూర్తి ఛాయ : [illegible], సంగీతం : రాజన్, నాగేంద్ర, నిర్మాతలు: [illegible] నహలా, డూండేశ్వరరావు. దర్శకుడు: 'అన్నా చెల్లెలు' దర్శకుడు, దర్శక, నిర్మాత బి. విఠలాచార్య



కవితా చిత్రవారి 'వాగ్దానం'లో నాగేశ్వరరావు.

## "ప్రాణస్నేహితులు" ప్రారంభోత్సవం

మధుకర్ ప్రొడక్షన్స్‌వారు నిర్మిస్తున్న ప్రాణస్నేహితులు చిత్రనిర్మాణానికి ఆంధ్రప్రదేశ్ లఘు పరిశ్రమల శాఖ ప్రత్యేక డైరెక్టరు శ్రీ పి. ఎస్. శాస్త్రి ఇటీవల ప్రారంభోత్సవం చేశారు.

ఎస్. రజనీకాంత్ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రాన్ని సారధి స్టూడియోస్‌లో నిర్మిస్తున్నారు.



కవితా చిత్రవారి 'వాగ్దానం'లో గిరిజ.

రచన : వీటూరి, సంగీతం : ఘంటసాల, ఛాయ : జానకిరామ్.

కృష్ణకుమారి, గిరిజ, మాలతి, రాజశ్రీ, ఛాయాదేవి, కాంతారావు, రేలంగి, హరనాథ్, సి. ఎస్. ఆర్. నూతన నటుడు శ్యామసుందరరెడ్డి పాల్గొంటున్న ఈ చిత్రానికి నిర్మాతలు ఇంద్రసేనరెడ్డి, రంగనాయకులు, ఆర్ రామకృష్ణ

## 'కుముదం'

బాబా మూవీస్‌వారు 'కుముదం' చిత్రకథ ఆధారంగా నిర్మిస్తున్న చిత్రంకోసం రెండవ సెట్టుపై పని ప్రారంభించారు.

ఇందులో శ్రీమతి ఎస్ జానకి గుడ్డిపిల్ల పాత్ర నిర్వహిస్తోంది నాగేశ్వరరావు, సావిత్రి, నాగభూషణం, వాసంతి, సూర్యకాంతం, రంగారావు, రమణారెడ్డి ఇంకా పలువురు పాల్గొంటున్న ఈ చిత్రానికి కథ : కె. ఎస్. గోపాలకృష్ణ, సంభాషణలు : ఆచార్య ఆత్రేయ, ఛాయ : పి. ఎల్. రాయ్, పాటలు : కొసరాజు, దాశరధి, శ్రీశ్రీ, సంగీతం : కె. వి. మహాదేవన్

## "భీష్మ"

అరణ్య అజ్ఞాతవాసాలు గడిపి వచ్చి పాలిమ్మని అడుగుతున్న పాండవులకు రాజ్యభాగమిచ్చి కుల గౌరవం కాపాడవలసిందిగా ధృతరాష్ట్రుడు దుర్యోధనుని ఉద్బోధించే సన్నివేశాన్ని ఇటీవల వాహినీ స్టూడియోలో చిత్రీకరించారు.

కురువృద్ధుని మరణానంతరంగాని ఆహవరంగ ప్రవేశం చేయనని కర్ణుడు శపథం చేసిన సన్నివేశాన్ని గూడా ఇటీవల చిత్రీకరించారు



హైదరాబాద్ మూవీస్ వారి 'పెళ్ళికాని పిల్లలు'లో రాజశ్రీ, కాంతారావు

ఈ సన్నివేశ చిత్రీకరణాల్లో ఎన్ టి రామారావు (భీష్మ), ధూళిపాళ సీతారామశాస్త్రి (దుర్యోధనుడు), జగ్గారావు (దుశ్శాసనుడు) గుమ్మడి వెంకటేశ్వరరావు ప్రభృతి నటులు పాల్గొన్నారు కథ : తాపీ, ఆరుద్ర. కళ : వాలి సంగీతం : రాజేశ్వరరావు ఛాయ : రెహమాన్. దర్శకత్వం, నిర్మాణం: బి ఎ సుబ్బారావు

## బికారి రాముడు

ఈనెల 24 ప్రాంతానికి విడుదలకానున్న 'బికారి రాముడు' చిత్రానికిగాను సుఖీభవా వారు ఒక నర్తకీ గృహ సన్నివేశాన్ని చిత్రీకరించారు.

కాంతారావు, నాగభూషణం, పి ఎస్ ఆర్. జి వరలక్ష్మి, మీనాకుమారి, రాజసులోచన, ఋష్యేంద్రమణి ప్రభృతులు నటిస్తున్న ఈ చిత్రానికి నిర్మాత బి ఆర్ నాయుడు, దర్శకత్వం, కథ : పద్మరాజు పాటలు పద్మరాజు, ఆరుద్ర, మల్లాది రామకృష్ణశాస్త్రి ఛాయ · బుల్‌బాలే, అప్పారావు. కూర్పు : జోషీ కళ : చలం. సంగీతం : గోపాలం, ప్రచారశాఖ : కె ఎం సింగ్

## శాంతారాం వర్ణచిత్రం 'స్త్రీ'

మహాకవి కాళిదాసు నాటకం 'శాకుంతలం' ఆధారంగా దర్శక నిర్మాత శాంతారాం హిందీలో నిర్మిస్తున్న వర్ణచిత్రం 'స్త్రీ' నిర్మాణం దాదాపు పూర్తైంది. డిసెంబరునాటికి విడుదలకానున్న ఈ చిత్రంలో శాంతారాం దుష్యంత భూమికను ధరిస్తున్నారు. సంధ్య శకుంతల పాత్ర నిర్వహిస్తోంది.

## హిందీలో 'దొంగరాముడు'

అన్నపూర్ణావారి ప్రప్రథమ శత దినోత్సవ చిత్రం "దొంగరాముడు" చిత్రాన్ని ఎ. వి యం. ప్రొడక్షన్స్ తరపున శ్రీ ఎ. వి మెయ్యప్పన్ హిందీలో పునః నిర్మిస్తున్నారు

ఇటీవల ఈ చిత్రానికి "ముహూర్తం' జరిపారు. కిశోర్‌కుమార్, సాధనా, ఓంప్రకాశ్, ప్రాణ్, శామ్‌లాల్ మొదలైనవారు పాల్గొంటున్న ఈ చిత్రానికి మాటలు, పాటలు రాజేంద్రకృష్ణ, సంగీతం : మదన్ మోహన్, దర్శకత్వం : కృష్ణన్ పంజా ★

# ఖాండవదహనం

(15వ పేజీ తరువాయి)

చూచుచున్నారు ఎవరు చూచుచున్నారు?" అని మహానందుడు మందహాసము చేసెను శ్రీ కృష్ణ దేవుడును మందహాసము చేసెను "నన్ను నేను చూచుకొనుచున్నాను" అనినాడు మహానందుడు.

వాకిటిలో హయ హేషలు విన్పించినవి. దారుకుడు హయములకు నీరువెట్టి, గ్రాసము వేయుచున్నాడు. అంధకుడును కాశిలోగల బంధువర్గమును చూచికొని తిరిగి వచ్చినాడు. భగవంతుడు కనుపించగా అతడు మందహాసము చేసినాడు

"తాత! లోకోత్తరముగానున్నదయ్యా నీయీ బ్రహ్మచర్యము" అనినాడు

"అంధక! మధురకు ఎప్పుడు పోయెదవు" అని వాడు శ్రీకృష్ణుడు

"నీవు ఎప్పుడు పొమ్మనిన అపుడు."

"దారుకుని గూడ తీసికొని పొమ్ము."

"వాడు రానునుచున్నాడు-"

"దారుక!"

"ప్రభు"

"నీవు రథమును మధురకు తోలికొనిపోవా?"

"అంధక మహారాజా తోలికొనిపోవును"

"నీవేమిచేతువు"

"స్వామితో కాశికలోనుందును"

"వాడును ఇక్కడ విద్య నేర్చునయ్యా! కృష్ణ" అనినాడు అంధకుడు

శ్రీకృష్ణదేవుడు మాటాడలేదు మహానందునితో ముందుకు కదిలిపోయెను బ్రహ్మచారులును వారి ననుసరించిరి.

"మహానంద!"

"శ్రీకృష్ణ"

"పౌండ్రకుడు వాసుదేవుడు నేమను వాసుదేవుడను వానికినావలె వుండవలెనని వున్నది"

"అవును! శ్రీకృష్ణ!"

"అవును కాదయ్యా! వానికి వున్నది. మరి నేను నల్లనివాడను అతడో తెల్లనివాడు మరి యతడు నల్లనివాడగుట యెట్లు?"

"నాకేమి తెలియును"

"రేపు తెలియును అతడు వేషము వేసికొనును వేషమువేసిన వాసుదేవుడు, వాసుదేవుడగునా! రజ్జువు వున్నది దానినిచూచి ఒకడు పాము అనుకొనినాడు అనగా ఆ రజ్జువునకు పామువేషము వేసినాడు వాడు రజ్జువు కాలేదు పాము మాత్రమైనాడు పౌండ్రకుడు అట్టి పాము"

శ్రీ కృష్ణదేవు డీమాటలు అనువేళకు కాశికా విశ్వనాథుని మొగశాలలో మాధ్యందినమైనదన్నట్లు గంటలు మ్రోసినవి

"బలరామ! కాశికలో అన్నపూర్ణలు బ్రహ్మచారులకు భిక్షయిడువేళ అయినది మనము క్షత్రియులవాడకు పోవుదము సుదామాదులు బ్రాహ్మణులవాడకు పోదురు ఉద్ధవా! సాత్యకి! పదండయ్యా! వేళ యతిక్రమించును!"

"మరి నేనేమి చేయవలయును" అనినాడు మహానందుడు

"ఆశ్రమమునకుపోవలెను తమకోసము గురువులు వేచియుందురు మహానంద! వామాక్షిచేత మాదారుకునకు భోజనము పెట్టించుము!! 

# మనము—మన రాష్ట్రం

(13-వ పేజీ తరువాయి)

**ఈ ప్రాజెక్టులకు ముడిపెట్టడంతో 1951 ఒప్పందాన్ని కేంద్రప్రభుత్వం కాదంటున్నట్లే కదా ?**

గుల్హాతీ సంఘంవారు తేల్చనున్నది 1951 ఒప్పందంలోని కేటాయింపులు పోగా, కృష్ణా, గోదావరులలో ఎంత మిగులు నీరుంటుందని కాదు మొత్తం ప్రవాహం ఎంతో లెఖ్ఖలు తిరుగదోడుతారు. మైసూరు, మహారాష్ట్రాలను తృప్తిపరచాలంటే, లెఖ్ఖలను తిరగదోడక తప్పదని కేంద్రం భావించింది. అలా కానిపక్షంలో కేవలం మిగులు జలాన్ని మాత్రమే లెఖ్ఖ కడితే చాలని చెప్పి ఉండేవారు 1895 లగాయతు 1947 వరకు—అంటే 60 సంవత్సరాల సగటు ప్రవాహాన్ని పరిశీలించి ఖోస్లా వంటి ప్రముఖ ఇంజనీరు అధ్వర్యాన ఒక సాంకేతిక సంఘం ఈ నదులకు సంబంధించిన లెఖ్ఖలు తయారుచేసింది 1892—93 లో ప్రొఫెసర్ చాటర్టన్, 1908—12 లో మజుందార్ డోగ్రాలు తయారుచేసిన లెఖ్ఖలతో సరిపోయాయి ఖోస్లా సంఘం లెఖ్ఖలను ప్రణాళిక సంఘం కూడా ఆమోదించింది అటువంటప్పుడు పాత పద్ధతిన వీటిని తప్పుడులెఖ్ఖలని తేల్చేందుకు ప్రయత్నిస్తున్నారంటే ఆంధ్రకు పూర్వానుస్వారం గాక మరేముంటుంది

బొంబాయిలో యీమధ్య గుల్హాతీ కమిషన్‌కు, అయిదు రాష్ట్రాల ఇంజనీర్లకు జరిగిన చర్చల సందర్భంలో శ్రీశైలం, పోచంపాడులను నామమాత్రం చేసుకోవాలని, నాగార్జునసాగర్, తుంగభద్ర ఎగువకాల్వ రెండో దశలను విరమించుకోవాలని గుల్హాతీ కమీషన్ వత్తిడి చేసినట్లు చెబుతున్నారు దీనినిబట్టి, గులాతీ సంఘం సరికొత్త పద్ధతిన కొలతలు తీసినా కృష్ణా, గోదావరులలో మిగులు జలం ఉన్నట్లు తేల్చలేక పోయిందని, ఖోస్లా లెఖ్ఖలు తప్పు అని నిరూపించలేకపోయిందని, అందుకే ఈ ప్రాజెక్టులు విరమించుకోవలసిందిగా ఆంధ్ర ఇంజనీర్లను బలవంతం పెట్టాల్సి వచ్చిందని అనుమానం కలుగుతోంది.

ఇలా ప్రాజెక్టులను విరమించమని చెప్పగల అధికారం కూడా ఈ సంఘానికి ఉన్నది. క్రితం మే నెలలో గుల్హాతీ సంఘం హైదరాబాదు వచ్చినప్పుడు, గుల్హాతీ చెప్పిన మాటలు చూడండి. "ప్రాజెక్టుల మంచి చెడుగులను గూర్చి సూచించే స్వేచ్ఛ మా సంఘానికి ఉంది. ప్రాజెక్టుల యోగ్యతను నిర్ణయించేటప్పుడు, ప్రాజెక్టుల క్రింద అయ్యే ఖర్చు సాగుకు లాయకీ అయ్యే భూమి విస్తీర్ణం, ప్రాజెక్టు క్రింద నిర్ణయించుకున్న ఆయకట్టుకు నీటిని తీసుకుని వెళ్లడానికి వీలున్నదీ లేనిదీ మొదలైన అంశాలు మా సంఘం పరిశీలిస్తుంది" అదిగాక కేంద్ర ప్రభుత్వం నాలుగు రకాల ప్రాజెక్టులను ఈ సంఘం పరిశీలనకు వదలింది (1) 1951 లో అమలులో ఉన్న ప్రాజెక్టులు (2) నిర్మాణమునకు కేంద్ర ప్రభుత్వం మంజూరుచేసిన ప్రాజెక్టులు (3) ప్రణాళికలో చేర్చబడి కేంద్రప్రభుత్వం ఆమోదించని ప్రాజెక్టులు (4) రాష్ట్ర ప్రభుత్వం సూచిస్తున్న కొత్త ప్రాజెక్టులు. ఇందులో మొదటి రెండు తరహాల ప్రాజెక్టులను గుల్హాతీ సంఘం ఏమీ చేయలేదు. ఏ సిఫార్సులు చేసినా అవి అమలు జరిగేవికావు పోతే కడపటి రెండురకాల ప్రాజెక్టుల విషయంలోనే ఆంధ్రకు దెబ్బ తగుల్తుంది అవి శ్రీశైలం, పోచంపాడులు, నాగార్జునసాగర్, తుంగభద్ర హైలెవెల్ కాల్వ రెండవ దశలు.

ఈ విధంగా ముందు రానున్న ప్రమాద మేమిటో మొదటినుంచీ కళ్లకు కట్టుతూనే ఉంది ఆంధ్ర ప్రభుత్వం ఈ అన్యాయాన్ని, అక్రమమైన వత్తిడిని ఎంతవరకు ఎదుర్కొగల దన్నదే ప్రశ్న.

ఇప్పటికైనా మన మంత్రులు ఆధారంలేని హామీలు ఇవ్వడం మాని అసలు జరిగినదీ, జరుగుతున్నది ఏమిటో, పూర్తిగా బయటపెడితే, అందరూ కూడ బలుకుకుని కర్తవ్యం నిర్ణయించుకొనే వీలుంటుంది. కేంద్రంలో ఉన్నది కాంగ్రెస్ ప్రభుత్వము, నెహ్రూ నాయకత్వం అయితే కావచ్చు తగాదా పడుతున్న రాష్ట్రాలలో కూడా కాంగ్రెస్ ప్రభుత్వాలు ఉంటే ఉండవచ్చు పార్టీ లాయల్టీలకు, నాయకత్వపు మోహమాటాలకు ఇక్కడ తావు లేదు వాటన్నిటినీ ప్రక్కకు నెట్టి, ఆంధ్రజాతి భవిష్య దభ్యుదయాన్ని శాశ్వతంగా దెబ్బకొట్టే కుటిల ప్రయత్నాలను కలిసికట్టుగా ఎదుర్కోవాలి. అందుకు సిద్ధంకాక ఆంధ్రలో ప్రాజెక్టులకు సున్నా చుట్టనిస్తే, ఆంధ్రలో కాంగ్రెస్‌పార్టీ భవిష్యత్తుకు కూడా సున్న చుట్టినట్లే.

* * *

తెలంగాణాలో వ్యవసాయ భూములను ఇతర ప్రాంతాలవారు కొనడానికి వీలులేకుండా ప్రభుత్వం శాసనం చేయబోతోందట తెలంగాణా నాయకుడు, ఉప ముఖ్యమంత్రి శ్రీ కె వి రంగారెడ్డి ఈ సంగతి చెబుతూ, బిల్లుకు కేంద్ర ప్రభుత్వం కొన్ని అభ్యంతరాలు తెలిపిందని, ప్రస్తుతం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలమధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడుస్తున్నాయని వెల్లడించారు. కేంద్రం తెలిపిన అభ్యంతరాలెటువంటివో తెలిస్తేగాని ఈ బిల్లు శాసనసభముందుకు రావడానికి ఎంతకాలం పడుతుందో చెప్పలేం

సర్కార్ జిల్లాలకు చెందిన ధనిక భూస్వాములు తెలంగాణాలో చౌకగా లభిస్తున్న వనిభూములు విస్తారంగా కొంటున్నట్లు తెలిసి, ఆ కొనుగోళ్లను అరికట్టేందుకు ప్రభుత్వం ఈ బిల్లు తేదలచిందని ఉప ముఖ్యమంత్రి చెబుతున్నారు ఇక్కడ ఉద్దేశ్యం పేదరైతుల భూములు పెద్ద భూస్వాముల కైవసంకాకుండా కాపాడాలని కాదు అట్లా అయినట్లయితే, ఆంధ్ర, తెలంగాణా అనే వివక్షత లేకుండా, డబ్బున్నవాళ్లెవరూ పొలాలు కొనరాదని ఆంక్ష పెట్టేవారు అసలు ఉద్దేశ్యం డబ్బున్నవాళ్లైనా, కాకపోయినా ఆంధ్రప్రాంతపు రైతులెవరూ తెలంగాణా గడ్డపై కాలుమోపకూడదనే.

భారత పౌరసత్వంగల ఏ వ్యక్తిఅయినా ఈ విశాల భారతదేశంలో ఏ రాష్ట్రంలోనైనా స్థిర నివాసం ఏర్పరచుకోవచ్చు. స్థిర చరాస్తులు సంపాదించుకోవచ్చు ప్రతివారికీ రాజ్యాంగం అటువంటి హక్కు ప్రసాదించింది. కాగా ఒక రాష్ట్రంలో ఒక ప్రాంతానికి చెందినవారు, మరో ప్రాంతంలో భూమి కూడా సంపాదించుకోరాదంటూ పెట్టే నిషేధం రాజ్యాంగ విహితంకాదు; బహుశః ఈ కారణంవల్లనే కేంద్ర ప్రభుత్వం ఈ బిల్లుకు అభ్యంతరాలు తెలిపిఉంటుంది

రాజ్యాంగ విహితమైనా, కాకపోయినా ఈ బిల్లువల్ల చాలా అనర్థాలున్నాయి. ఆంధ్ర తెలంగాణాల జనాభాలో నూటికి 70, 80 వంతులున్న రైతాంగంమధ్య అన్యోన్య సంబంధాలు ఏర్పడకుండా, వ్యవసాయరంగంలో ఒకరి అనుభవాలను మరొకరు తెలుసుకోడానికి వీలులేకుండా శాశ్వతంగా ఒక అడ్డుగోడ నిర్మించి కట్టవుతుంది విద్యా ఉద్యోగాలలో రక్షణలపేరిట ఇటువంటి అడ్డగోడలు ఇదివరకే కొన్ని ఏర్పాటై ఉన్నవి మనది తెలుగు రాష్ట్రం, మనమంతా తెలుగువారం అని అన్ని ప్రాంతాలవారి మధ్య భావైక్యత పెంపొందాలంటే, ఇటువంటి అడ్డుగోడలను క్రమేపీ తొలగించుకోడానికిబదులు ఎక్కువ చేసుకోవడం మంచిపనిగాదు

ఈ బిల్లువల్ల తెలంగాణాకే దెబ్బ తెలంగాణాలో ఇప్పుడు అనేక కొత్త ప్రాజెక్టులు నిర్మాణ మవుతున్నాయి రేపు పోచంపాడు ప్రాజెక్టు కూడావస్తే ఈ ప్రాజెక్టుల క్రింద లక్షలాది ఎకరాలను సాధ్యమైనంత త్వరలో సాగుకు లాయకీచేసి, మెట్ట భూముల్ని పల్లపు సాగుకు మళ్లించాల్సిఉంటుంది. ఇందుకు డెల్టా సాగులో ఎంతో అనుభవం, పెట్టుబడి అవసరం. ఇవి తెలంగాణాకు ఎంతవరకు ఉన్నవో అందరికీ తెలిసిన విషయమే పూర్వం నిజాం ప్రభువు హయాంలో నిజాంసాగర్ ప్రాజెక్టు కట్టినప్పుడు, ఆయకట్టు అభివృద్ధికి ఆంధ్రప్రాంతంవారిని ఆహ్వానించడం, కృష్ణా గుంటూరు మండలాలనుంచి రైతులువెళ్లి అతి స్వల్పకాలంలో, ఆ ప్రాంతాన్ని సస్యశ్యామలంచేయడం, ఆనాడు ఎకరం రు 10, 20 లు అమ్మినభూమి ఇప్పుడు మూడు నాలుగు వేలదాకా ధర పలుకుతుండటం తెలంగాణా వారెరుగనిదికాదు డెల్టాసాగు విషయంలో కృష్ణా, గోదావరి ప్రాంతాల రైతులకు తెలిసినన్ని మెళకువలు, 100 ఏళ్లుగా వారికున్న అనుభవం ఎవరికీలేదంటే అతిశయోక్తికాదు వ్యవసాయాభివృద్ధికితగిన స్తోమతు, సాహసం కూడా వారికేఉంది. వ్యవసాయయోగ్యమై, ఎడారిలాఉన్న ప్రాంతాలు, ఎవరివల్లనైతేనేం అభివృద్ధిలోకిరావడం ముఖ్యం అనుకుంటే, ఇటువంటి వారిని ఆ ప్రాంతాలకు ఎక్కనీయకతప్పదు.

ఇదివరతో రాయలసీమలో తుంగభద్ర ప్రాజెక్టు క్రింది భూములు సర్కార్ జిల్లాలవారు కొనకూడదని ఆంక్ష విధించారు. ఫలితం ఏమైంది? ప్రాజెక్టు పూర్తిఅయి ఏండ్లు గడిచినా, స్థానికులకు ఆర్థిక స్తోమతు, అనుభవములేక, సాగు లాయకీఅయిన లక్షలాది ఎకరాలలో శతాంశమైనా ఇంకా సాగులోకి రాలేదు

కనుక ప్రభుత్వం ఈ బిల్లును ప్రతిపాదించే ముందు, వ్యవసాయికంగా రాష్ట్రం అభివృద్ధిని దృష్టిలో పెట్టుకుని అన్ని విషయాలు సాకల్యంగా పరిశీలించాలి వ్యవసాయం వ్యాపకంగాలేనివారు స్పెక్యులేషన్‌కోసం భూములు కొంటున్నారంటే అటువంటివారిని నిరోధించేందుకు ఈబిల్లు చేయవచ్చు అంతేగాని, తెలంగాణాలో స్థిరపడదలచిన ఆంధ్ర ప్రాంతపు రైతులకు ఇది అడ్డంకికారాదు ★

నేను కేరళ, మద్రాసులలో ఎక్కువ రవివర్మ చిత్రాలు చూచాను. వీరి చిత్రాలలో రంగుల మార్దవంలేదని పిస్తుంది వర్ణ మిశ్రమంలో రంగులు తమ సహజ కాంతిని కోల్పోయి మడ్డిగా తయారయినాయని పిస్తుంది. ఇది నా స్వంత అభిప్రాయం. నా అనుభవాన్నిబట్టి ఢిల్లీలో కీ. శే. అమృతషెహర్‌గిల్ చిత్రాలుకూడా కొన్ని చూచాను అందరిలా. ఆమె వాడిన విధానంలో రంగులకు కొత్తజీవం వచ్చింది. ఆ చిత్రాలు ఏ ప్రముఖ విదేశీయ సృజనాత్మక చిత్రాలతోనైనా సరితూగి నిలుస్తాయి అంత చిన్నతనంలో చిత్రించినా ఒక ముఖ్య విశేషమేమంటే పూర్తిగా పాశ్చాత్య పద్ధతిలో చిత్రించినా భారతీయ కళయైన అజంతా సంప్రదాయం ఆమె చిత్రాల నుండి తొంగిచూస్తుంది. భారతీయుల స్వభావాలను, అంతర్యాలను గ్రహించి ఆకళింపు చేసికొని వ్యక్తపరచడంవల్ల మనం మనవాళ్ళమధ్యవున్నట్లే భావిస్తాం, ఆ చిత్రాలు చూస్తుంటే. ఆ చిత్రాల లోని మనుష్యులు తమ కండ్లతో వారి బాధల్ని, భావాల్ని మూగగా మనకు ఏకరువుపెడుతున్నట్లుంటుంది. అంతటి శక్తిమంతురాలు గనుకనే అంతర్జాతీయ ఖ్యాతివచ్చింది భారత ప్రభుత్వం. దాదాపు అన్ని చిత్రాలను కొని ఢిల్లీ ఆర్ట్ గ్యాలరీలో భద్రపరచి, ప్రజలకు ఎల్లప్పుడూ చూచే అవకాశం కలుగచేసింది. రవివర్మ, అమృతషెహర్‌గిల్ యిద్దరు పాశ్చాత్య పద్ధతిలోనే చిత్రరచన చేసినా, వీరిద్దరి చిత్రాల విలువలో అంత తేడా ఎందుకువుంది? ఇదే ఆ చిత్రకారుల పూర్ణత్వానికి నిదర్శనం.



అభిషేకము

-చిత్రకారుడు: వడ్లమాని మధుసూధనరావు

# ఆంధ్రుల చిత్రకళ

(11-వ పేజీ తరువాయి)

క్రొత్త గాలిదుమారం లేచింది చిత్రకళలో. కీ. శే. అవనీంద్రనాథటాగూరు గురుత్వాన కొంత మంది బెంగాలీ చిత్రకారులు చిత్రకళలో నూత్న పంథాలో రచనలు సాగించారు విజయవంతంగా. ఇ. బి. హావెల్, కజిన్స్, కూమ్రేడ్డే, బ్రౌను, ఆనంద కుమారస్వామిగార్లు ఒక్కసారి భారతీయుల చిత్రకళ నిజస్వరూపాన్ని, ఉత్కృష్టతను తెలియచెప్పడంతో స్వాతంత్ర్యోద్యమంలో అంతకుముందే ముందడుగు వేసివున్న మనవారు, తటాలున బెంగాలీ చిత్రకళను స్వీకరించారు. బందరు జాతీయ కళాశాల శ్రీ ప్రమోద కుమార చటర్జీ గురుత్వాన ఎంతో మంది సృజనాత్మక చిత్రకారుల్ని తయారు చేసింది. శాంతినికేతనంవెళ్ళి ఎక్కువమంది తెలుగువారు శిక్షణ పొందారు చిత్రకళలో. వీరందరు బలమైన జాతీయ భావంగలిగి, పురాణేతిహాసాల్ని, నిత్యజీవిత ఘట్టాలని ప్రతిబింబింపచేసారు చిత్రకళలో తెలుగుతనం ఒలికిపోయేది ఆ చిత్రాల్లో. "భారతి" పత్రిక, రంగుల్లో చిత్రాల్ని ప్రచురించి తెలుగువారికి చిత్రకళలో అభిరుచిని ఎంతగానో యినుమడింపచేసింది. ఆవిధంగా సాగింది చిత్రకళ కొంతకాలం.

దేశీయ చిత్రకళయందు అభిమానం వుండవచ్చుకాని విదేశీయ చిత్రకళను విసర్జించగూడదు పూర్తిగా. క్షణ క్షణం మారుతున్న ఈ ప్రపంచం ఎంతో దగ్గరవుతోంది. ఎన్నో విషయాలు ఇతరుల నుండి మనం నేర్చుకుంటున్నాం ఇప్పటి యాంత్రిక యుగంలో (వెహ్రాగారన్నట్లు స్పుత్నిక్ యుగంలో) ఏఒక్కదేశం ఇతరదేశం అవసరం లేకుండ మనలేదు. ఎందువల్లనోగాని నిన్న మొన్నటివరకు మన చిత్రకళలో విదేశీయ అధునిక చిత్రకళా ప్రభావం మెండుగా పడలేదు యిప్పటిమాదిరిగా శాస్త్రీయ యాంత్రిక రంగాలలో, మన భావనలో, నడవడిలో విదేశీయ ప్రభావం అమితంగావున్న విషయం అందరకు సువిదితమే అయినా శాంతినికేతనం చిత్రకళ పాశ్చాత్య చిత్రకళలో మంచి ఉన్నానరే దూరంగానే వుంచింది అందువల్ల ఈ రెంటికి పెద్ద అగాధం ఏర్పడింది. ఈ అగాధం ఎంత పెద్దదో యిటీవల నేను శాంతినికేతనం వెళ్ళినప్పుడు అవగాహనఅయింది. శాంతినికేతనం పద్ధతి ప్రత్యేకం. అది మరో లోకం.

పశ్చిమ దేశాల్లో పుట్టిన అధునిక చిత్రకళ ఒక మహా ప్రళయాన్ని లేపింది. ఇప్పటివరకు శతాబ్దాలుగ వస్తున్న దారినుండి మరల్చింది. కళారంగంలో ప్రపంచమంతటా ఈ అధునిక చిత్రకళ ప్రాకింది. అక్కడనుండి చిత్రకారులు దేశభేదం



నిర్బంధపు బతుకు

-చిత్రకారుడు: పి. టి. రెడ్డి

లేక యిందులో కృషి చేస్తున్నారు. అతి తీవ్ర భావాలను, మానసిక సంచలనాలను వ్యక్తపరచడానికి ఈకళ ఎంతో ఉపకరిస్తుంది. వినూత్న పద్ధతిలో యిది మనుష్యుల్ని వూపుతుంది బలంగా. పికాసో యొక్క ప్రపంచ ప్రసిద్ధి "గెర్నికా" చిత్రం యుద్ధంయొక్క విలయ తాండవాన్ని నగ్నంగా ప్రదర్శించింది స్పెయిన్‌లోని 'గెర్నికా' అనేపట్నం జర్మన్ బాంబులతో విధ్వంసం అయింది అది చూచి చలించి చిత్రించాడు. వెంటనే మహామేధావి, చిత్రకారుడు పికాసో అలా వుద్రేకపూరితంగా చిత్రించడం ఆధునిక చిత్రకళలోనే వీలుపడింది ఈ చిత్రకారునికి ఇలాంటివి ఎన్నో ప్రసిద్ధ చిత్రాలు ఎంతో మంది ఈ ఆధునిక చిత్రకళలో చిత్రించారు. భారతదేశంలో ప్రముఖ చిత్రకారులందరు ఆధునిక చిత్రరచనలో సిద్ధహస్తులే ఇప్పుడిప్పుడే మన ఆంధ్ర చిత్రకారులు గూడా ఆధునిక కళలో కృషి చేస్తున్నారు. కాని మన తెలుగు ప్రజలకు ఈ కళ, కళాకారులు చాల దూరంగానే వున్నారు ఇంకా రవివర్మ, కనూదేశాయి జాతీయ కళాశాల స్థాయిలోనే వున్నారు మనవారు.

ఒక ప్రసిద్ధ తెలుగు రచయిత యింట్లో నేను కనూదేశాయి చిత్ర సంపుటి చూచాను కళంటే అచ్చంగా అలావుండాలని, అంతటి భావోన్నత్యంగల చిత్రకారులు అరుదని తలతోకలేని వికృతపు బొమ్మలు ఈమధ్య వస్తున్నాయిగాని ఇలాంటి చిత్రాలు రావడంలేదని, కనూదేశాయి చిత్రాలే గీటురాయిగా మాట్లాడారు. నాకు ఆశ్చర్యం, విచారం కలిగింది ఆయనకు కనూదేశాయి పద్ధతిలోనే యితర చిత్రకారుల గురించి తెలియదు. కనూదేశాయి చిత్రాలు ఆబాలగోపాలానికి అర్థం అవుతాయి. రేఖామార్దవంలో, లేతరంగుల్లో మూడ

# ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రకటనలు మీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడుతాయి



## మీ అమ్మకు మీరు టినోపాల్ ని గురించి చెప్పాలి!

ప్రతి వారును టినోపాల్ వాడుచున్నారు.

మీ అమ్మాయి తెల్లని దుస్తులు నిజంగా తెల్లగా ఉండాలని ఉందా మీకు! కాని-అప్పుడప్పుడు శుభ్రమైన గుడ్డలు కూడా బూడిదరంగులో వెలవెలబాడుతూ ఉంటాయి!

తెలుపు నూలు గుడ్డలను, రేయాన్ గుడ్డలను ఉతకడంతోటే పరిపోదు. మంచువంటి తెలుపు వచ్చుటకు ఉతికిన తర్వాత వాటికి టినోపాల్ పెట్టండి అవును, టినోపాల్ ఎంతో ఆశ్చర్యం గొలుపుతుంది. అది, ఎంతో పొదుపు చేకూరుస్తుంది కూడా. ఈ రోజే టినోపాల్ కొనండి.






కొంచెము **టినోపాల్**

తెల్లని దుస్తులను అన్నిటికన్న తెల్లగా చేయును

టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కు

తయారుచేయువారు :
సుహృద్ గెయిగి లిమిటెడ్, వారి వారి బరోడా

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు :
సుహృద్ గెయిగి ట్రేడింగ్ లిమిటెడ్, పి.ఒ. బాక్సు 965, బొంబాయి 1

SISTA'S-SG-140

ముచ్చటగా వుంటాయి. నిత్యజీవిత ఘట్టాలను స్త్రీలోని నాజూకుతనాన్ని ఎన్నో వయ్యారాలతో, వంపులతో చిత్రిస్తారు అందంగా నిజమే కాని కీ శే శారదా వుకీల్, నందలాల్ బోసు, రెహమాన్ ఛుగతాయి, గుర్రం మల్లయ్య,గార్ల చిత్ర కళా రచనలముందు కనూదేశాయి ఎంత? ఈయన చిత్రాల్లో "వ్యాపార ధ్యేయ" వుంది అందుకే ఆయన పై చెప్పిన చిత్ర కారుల్లో శాంతినికేతనంలోనే కళ నభ్యసించినా, సృజనాత్మక చిత్రకారుల్లా పరిగణింపబడలేదు. ప్రజలకు ఈయన తెలిసినంతగా (ఆయనే స్వంతంగా తన చిత్ర సంపుటాలను ప్రచురించి అమ్మినిస్తారు) పై చెప్పిన చిత్రకారుల చిత్రాల గురించి తెలియదు అందుకే చిత్రకళా ప్రదర్శనలు, విమర్శకుల ఉపన్యాసాలు, ప్రముఖుల వ్యాసాలు ప్రజల్లోకి చొచ్చుకుపోవాలి అజంతా, లేపాక్షి, రాజపుత్రమొగలి, దక్కనీ చిత్రశైలులు, బెంగాలీ చిత్రకారుల పద్ధతులు, కీ శే దామెర్ల రామారావు చిత్రకళ, యిప్పటి అధునాతన చిత్రకళల్ని ప్రజలకు పదేపదే అందించిన నాడే, వారు ఏవి మంచి చిత్రాలో, ఏవికావో వారికి వారే తెలుసుకుంటారు ఆనాడుగాని, సరియైన ప్రజ్ఞగల చిత్రకారులకు ప్రజల్లో న్యాయం జరుగదు దీనికై ముఖ్యంగా మన తెలుగుదేశంలోని చిత్రకళా విమర్శకులు ఎంతైనా కృషిచేయవలసి వుంది ఇప్పుడు చాలమంది శ్రద్ధ తీసికొన్నారు. ఇది చాలదు ఈ విషయంలో ఉత్తరాదివారికంటే మనం ఎంతో వెనుకపడివున్నమాట మాత్రం నిజం.

ఏదేశ సంస్కృతియైనా, ఆదేశ కళలపైన ఆధారపడివుంటుంది మన ఆచార వ్యవహారాలను, మన నాగరికతను యిప్పటికి, ఎప్పటికి తెలియచెప్పుతున్నవి మొహంజదారో, హరప్పా, నాగార్జునకొండ, అమరావతి, సాంచి, అజంతా, ఎల్లోరా, లేపాక్షి, మౌంటుఆబూ, హల్‌బీడ్, కోణార్క్, కుజురహోాలే కళకువున్న ఆనాటి ప్రభావాన్ని మరల వెలికి తేవలసిన అవసరం ఎంతైనావుంది యిప్పుడు నలందా, నాగార్జునకొండ, తక్షశిలలలాంటి విశ్వవిఖ్యాత విద్యాలయాలను స్థాపించలేకపోయినా మన యూనివర్శిటీలలోనే కొంత అవకాశం కలుగచేయాలి చిత్ర శిల్పకళలకు ఇప్పుడు ఎన్నో పాశ్చాత్య యూనివర్శిటీలలో విద్యార్థులు చదివే పాఠ్య గ్రంథాలలో చిత్ర కళ గూడా ఒక భాగంగా అభివృద్ధి పొందుతోంది అక్కడ ప్రత్యేకంగా "Art appreciation courses" వున్నాయి ఎం ఏ డిగ్రీలు పెయింటింగ్ ప్రధాన భాగంగా చదివి తీసుకుంటారు. యిక్కడ ఎకనామిక్సో, మేథమెటిక్సో తీసికుంటున్నట్లు అందువల్లనే ప్రజల్లో కళయందు ప్రేమ, ఆదరణ, విచక్షణ వుంది యూనివర్శిటీలు ప్రపంచ విఖ్యాత చిత్రకారుల చిత్రాలనుకొని స్వంత ఆర్ట్ గ్యాలరీలను ఏర్పాటు చేసికొని నేషనల్ గ్యాలరీలతో పోటీ పడతాయి విమర్శకులను, చిత్రకారులను పిలిచి ఉపన్యాసాలిప్పించి, కళలపై వచ్చే గ్రంథాలకు ధన సహాయంచేసి, ప్రచురించి ప్రముఖపాత్ర వహిస్తాయి. స్కాలరుషిప్పులతో విదేశీయులు ఎంతోమంది యూనివర్శిటీలలో చదువుతున్నారు. ప్రముఖ 'చిత్రకారులు, విమర్శకులకు ఉద్యోగాలిచ్చి పోషిస్తూ, ఎనలేని కృషి చేస్తున్నాయి పాశ్చాత్య యూనివర్శిటీలు. మన దేశంలో పరిస్థితి ఏమిటి?

# ఆంధ్రుల చిత్రకళ

బరోడా, అన్నామలై, బెనారస్ యూనివర్శిటీలలో పెయింటింగ్ కోర్సులున్నాయి. కళా నిలయమనుకునే మన ఆంధ్రప్రదేశ్‌లో యూనివర్శిటీలు ఎంతవరకు కృషి చేస్తున్నాయి? ఒక ప్రముఖ వ్యక్తి, మన యూనివర్శిటీల ఉన్నత అధికారి బహిరంగ సభలో "తెలుగుదేశంలో మంచి చిత్రకారులు లేరని" వాపోయ్యారు. వారి విషయపరిజ్ఞాన లోపానికి ఎంతో విచారం కలుగుతుంది. ఏమాత్రం మన చిత్రకారుల గురించి తెలిసిన వారికైనా, దక్షిణభారతదేశం అంతటిలో విఖ్యాత చిత్రకారులు ఎక్కువ ఉన్నది మన తెలుగుదేశంలోనే. తెలుగుదేశ చిత్రకారులు చెల్లాచెదరై దేశంలోనే పలుచోట్లగాక, విదేశాలలో గూడా ఎంతో ఆదరణ, కీర్తి పొందుతున్న వారున్నారు (ఉదాహరణకు శ్రీ కృష్ణారెడ్డిగారు) ఈ విషయాలన్నీ ప్రజలకు ఎలా తెలుస్తవి?

మరల జాతిని ఉత్తేజపరచాలంటే, నూత్నశకం ఆరంభం కావాలంటే పలుచోట్లవున్న మన తెలుగు చిత్రకారులనందరిని, అందరి చిత్రాల్ని సంఘటపరచి, చిత్రకళా ప్రదర్శనలు, ఉపన్యాసాలు విరివిగా యిప్పించాలి. ఇందుకై ప్రజలే ముందుకు రావాలి. ఈ విషయంలో ప్రముఖ చిత్రకారులు, పెద్దలతో కూడివున్న "హైదరాబాదు ఆర్ట్ సొసైటీ" చేస్తున్న కృషి ప్రశంసాపాత్రమైంది.

ఆంధ్ర లలితకళా ఎకాడమి ఆలస్యమైనా ఈమధ్య ఏర్పడింది ఇది ఎంతో పని చేస్తుంది, ప్రభుత్వపు అండతో అని ఆశిస్తాం. కాని ఎందువల్లనో అంత సంతోషకరంగాలేదు ఎకాడమి. అందలి సభ్యులను చూచి చాలమంది నిరుత్సాహపడ్డారు—అంటే ఎకాడమీలోనివారు అసమర్థులైన సభ్యులనిగాదు, సమర్థులైన వారిని చాలమందిని వదిలివేశారని. ఆంధ్రులు గర్వంగా చెప్పుకునే విఖ్యాత చిత్రకారులు శ్రీ కె. శ్రీనివాసులుగారు సహృదయులు, జ్ఞానసంపన్నులు, కళా విషయాలలో అపార అనుభవమున్నవారు, కేంద్ర లలితకళా ఎకాడమి సభ్యులుగా వుండిన శ్రీ యం. ఆర్ అప్పారావుగారు, ప్రముఖ రచయితగా గొప్ప చిత్రకారుడుగా పేరు పొందిన మా గోఖలేగారు మన ఆంధ్ర లలిత కళా ఎకాడమీలో సభ్యులుగా లేరు. చిత్రకళపై వ్యాసాలు వ్రాస్తూ, తెలుగు ప్రజలలో కళపై విషయాశక్తిని ఎంతో కాలంనుండి పెంపొందింపచేస్తున్న చిత్రకారుడు, విమర్శకులు అయిన శ్రీ వేలూరు రాధాకృష్ణగారు ఎకాడమీలో సభ్యులుగా అవడానికి ఏవిధంగా అనర్హులు? ఇలా ఎన్నో ప్రశ్నలు ఉద్భవిస్తాయి. ఆలోచించిన కొలది ఏది ఏమైనా చాలమంది సమర్థులైన చిత్రకారులను, విమర్శకులను ఎకాడమీలో చేర్చడం జరిగింది ఇది ఎరకూ కాదనలేని సత్యం శ్రీ సంజీవదేవ్ సి టి రెడ్డి, వర్ధమాని మధుసూధనరావు, రాజయ్య మొదలుగాగల హేమాహేమీలు అందరూ వున్నారు ఎంతో సంతోషం

ఎకాడమి ప్రభుత్వ మేర్పరచింది గనుక ఆర్థిక బాధకు అంతగా లోనవదు. ఎకాడమి ఎనలేని సహాయం చిత్రకారులకు చేస్తుందని ఆశిస్తాం. ఎలా చేయాలి, ఎవరెవరికి చెయ్యాలి అనేది ఎకాడమిలోని సమర్థులైన సభ్యులే నిర్ణయిస్తారు. కాని తప్పనిసరిగా ఎకాడమిలో సమర్థులైనవారిని మరికొంతమందిని చేర్చుకోవాలి. ఎంతోమందినివదలివేసిన ఏ ఎకాడమి సడక అయినా నిండుగా, అందంగా సాగదు. తప్పక సభ్యుల సంఖ్యను పెంచుతారని కళాభిమానులందరు ఆశిస్తున్నారు.



ప్రణయం
చిత్రకారుడు: కె. రాజయ్య

మన మూడు యూనివర్శిటీలను కూడగట్టుకొని, చిత్రశిల్ప కళలకు స్థానం కల్పించేట్లు చూడడం, ఆంధ్ర చిత్రకారులకు ఉచిత స్థానాలను యూనివర్శిటీలలో కల్పించేట్లు చూడడం ఎంతో ముఖ్యమైనపని ఇది సాధించేందుకు ఎంతైనా కృషి మన ఎకాడమి చేయవలసివుంది మన యూనివర్శిటీలు యిప్పుడైనా ఆర్ట్ కోర్సులు ప్రారంభిస్తే ప్రజల్లో మరల సరియైన కళాజిజ్ఞాస ఉద్భవిస్తుంది ఆర్థికంగా చితికిపోతున్న చిత్రకారులకు కొస్త అండ కలుగుతుంది చిత్రకారుల్ని పూర్వం అయితే ఏ రాజులో, జమీందారులో పోషించేవారు. ఈనాడు ప్రజలు, ప్రభుత్వమే పోషించాలి కళల్ని. అందుకే మన ఎకాడమి ఎంత త్వరగా ప్రజల్లోకి చొచ్చుకుపోతే, అంత త్వరగా అటు ప్రజలకు, ఇటు చిత్రకారులకు మేలు కలుగుతుంది చిత్రకారులందరం మనం ఎకాడమిపై పెట్టుకున్న ఆశలన్నీ ఫలిస్తాయేమో! ★

# మీ యింట్లో నొప్పి అనే మాట లేకుండా చేయుటకు

# సారిడన్ వాడండి















మీ కుటుంబములోనివారు ఎవరైనా తలనొప్పి, ఒళ్లునొప్పి, పంటినొప్పి జ్వరముగా ఉండుట, మామూలు అస్వస్థతలు మొదలగు వాటితో బాధపడుతూ ఉంటే వారికి సారిడన్ యివ్వండి దానితో వారికి త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా స్వస్థత కలుగుతుంది. సారిడన్ పేర దేరుస్తుంది మరియు నవోత్సాహమును కూడ చేకూరుస్తుంది! ఒక సారిడన్ బిళ్ల పెద్దవారికి పూర్తి మోతాదు. పిల్లలకు ¼ నుండి ½ బిళ్ల చాలును.




ఒకే బిళ్ల చాలును

ఒక బిళ్ల ఖరీదు 13 న.పై. మాత్రమే

"రోష్" తయారు) ప్రత్యేక డిస్ట్రిబ్యూటర్లు: వాల్లాస్ లిమిటెడ్

JWT VT 2082

వినపడింది మేం నిలవవున్న వూపిరి వదిలేసి, కొత్తగా గాలి పట్టుకున్నాము రామయ్యకూడా అదే పనిచేసి, "ఆ, యికలెండి పోదాం" అన్నాడు మేం కూడా లేచాము. నిశ్శబ్దంగా వూళ్ళోకి చేరాము. మమ్మల్ని వూటకూళ్ళమ్మ యింటికిచేర్చి రామయ్య "రాత్రికి వస్తా"నంటూ వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

మేము చకచకా భోజనం ముగించుకుని విడిదికి చేరేసరికి రామయ్య అరుగుమీద కూర్చుని చుట్ట కాలుస్తున్నాడు.

"నువ్వొచ్చెంతసేపయ్యింది రామయ్యా" అన్నాను నేను

"ఇంతకుముందే" అన్నాడు రామయ్య

"ఆ ఇప్పుడు చెప్పవయ్యా" అన్నాడు శేషగిరి

మేం ఆరుగురం అతని కెదురుగా రెండో అరుగు మీద కూర్చున్నాము రామయ్య చిన్నగానవ్వి, చుట్ట పారేసి తుపుక్కున వుమ్మి, "వినండి" అన్నాడు. మేము తయారుగా కూర్చుని 'వూ, వూ' అన్నాము.

"మీలో సానామందికి పిశాచాలూ, దయ్యాలూ అంటే నమ్మకంవుందా" అంటూ అందరికేసీచూశాడు. ఆ మాటతో మేము ఉలిక్కిపడి, వీపులు చరుచుకున్నాము. రామయ్య ప్రారంభించాడు.

"వినండి—యిప్పటికి చాన్నాళ్ళక్రితంనుంచీ ఈ ఊళ్ళో—యిందాక మనం విన్న. . . . ఎవరదీ. . . ఎవరు కావాలిబాబూ. . . ." అంటూ యీ రామాయణం ఆపి లేచి నించున్నాడు కథాభంగవస్తువు కోసం మేము వీధివైపు చూశాము

అజానుబాహుడైన ఒకవ్యక్తి ఒక తోలుపెట్టే, కొన్ని పంజరాలూ చేతపుచ్చుకుని లోపలకు అడుగు పెట్టాడు. అతనివెనక యింకో మనిషి వచ్చాడు. ఆ వచ్చిన మనిషి రామయ్యతో ఆ నూతన వ్యక్తిని కరణంగారు మాతోపాటు ఉండమన్నారని చెప్పాడు. అతని సామానులన్నీ సావిట్లో సర్దబడ్డాయి అతని వెంట వచ్చిన మనిషి వెళ్ళిపోయాడు ఆ వ్యక్తి లోపల కెళ్ళి బట్టలు మార్చుకునివచ్చి అరుగుమీద కూర్చున్నాడు. నేనులేచి, మా బట్టనంతా అతనికి పరిచయంచేసి, నన్ను కూడా పరిచయం చేసుకున్నాను.

"నన్ను సింగు అంటారు. నేను జంతుశాస్త్రంలో రిసర్చిడిగ్రీ పొందాను.—ఇకపోతే మైగ్రెంట్సు—ఇమీన్—ఒక రకం పక్షుల చరిత్రలకోసం రిసర్చి చేస్తున్నాను" అంటూ ఆ వ్యక్తి తనని పరిచయం చేసుకున్నాడు ఆత్రంపట్టలేని శేషగిరి బుర్రగోక్కుంటూ "నువ్వు కానియ్యవోయ్ రామయ్యా" అన్నాడు రామయ్య తలపాగా విప్పి తిన్నగా కట్టుకుంటూ ఆ కొత్త వ్యక్తికేసి చూశాడు

"ఏవైనా కబుర్లు చెప్పుకుంటే కానివ్వండి" అన్నాడు సింగు రామయ్య గొంతు సవరించుకున్నాడు

"ఆ—ఎందాకా చెప్పా—వూ అవును—నా పుట్టకలకు ముసుపే—యీవూళ్ళో యిందాక మనం విన్న పిలుపు వినబడుతూండేది మనం సందెవేళ కూర్చున్న కొండదగ్గర్నుంచి ఇంకో రెండుమైళ్ళు పైగా వెళితే వో పెద్ద రావిచెట్టుంటుంది. ఆ రావి చెట్టుకి యింకో మైలు దూరంలో వో కొండుంటుంది ఆ చెట్టుదగ్గరికెళితే యీ కూత మామూలుగా వినొస్తుంది. ఆ పిలుపు పక్షి పిలుపులా వుంటుంది—

# చికీర్ష

(9-వ పేజీ తరువాయి)

కాదీ—అది దెయ్యం—పిశాచం పిలుపన్నమాట. . . . అంటూ ఆగాడు.

"బాబోయ్" అంటూ బృందగానం పాడాము మేము

"నాన్సెన్స్" అన్నాడు సింగు.

"వినండి అర్ధరాత్రి పన్నెండింటికి ఆ రావి చెట్టుకిందకనక నించుంటే యీ కూత కానా భయంకరంగా వినపడుతుంది. అప్పుడా కూతకు అదేరకంగా అరుస్తూ సమాధానవిస్తే—వో పక్షి మన—అదే—అరిచిన వాడిమీద మూడుసార్లు ఎగురుతుందిట—అంతే యిక వాడికి వెర్రికం వస్తుందన్న

---

ఒక డాక్టరు రోగి నేత్రములను పరీక్షిస్తూ దూరంగా వ్రేలాడుతున్న అట్టపై ఉన్న అక్షరములను చదువమన్నాడు ఏదో ఆలోచిస్తూ.

రోగి:-కనుపించటం లేదండి!

డాక్టరు:-అయితే కళ్ళజోడు వాడితే ప్రయోజనం లేదు. ఆపరేషన్ చెయ్యాలి.

రోగి:--ముందు మీరు ప్రక్కగా నిలబడాలి. నాకు అడ్డంగా నిలబడితే ఎలా కనిపిస్తుంది?

మంజులూరి వెంకటేశ్వరరావు
(మచిలీపట్నం)

---

మాట—తర్వాత ఆ పక్షి ఆమ్మాయిఆయి వీణ్ణి లాక్కెళుతుందిట—అంతే— తెల్లారి ఆ మడిసి శవం ఆతట్టు కొండకిందుంటుంది" అంటూ మాకేసి చూశాడు

"ఏమీ—నిజవే, నిజంగానా" అన్నాము మేము

"నాన్సెన్స్—ఐడోంట్ బిలీవ్" అన్నాడు సింగు

అదే విషయంమీద మరో పావుగంట చర్చలు జరుపుకున్నాము. ఆ తర్వాత సింగు లేచి, "స్నానానికి నుయ్యెందనుకుంటా" అన్నాడు రామయ్య లేచి అతనికి నుయ్యి చూపించి చక్కా వచ్చాడు వస్తూనే "ఏప్టిబాబూ వాడనేది, నమ్మడటా" అన్నాడు

"అతనికి నమ్మకం లేదుట యిలాటి వాటిల్లో" అన్నాను నేను రామయ్య బొడ్లోంచి పుగాకుతీసి, చుట్ట చుట్టడం ప్రారంభించాడు.

"ధైర్యంవుంటే యీ పిలిగెడ్డపోణ్ణి మూతి పక్కనున్న గదిలో కెళ్ళమనండి" అన్నాడు రామయ్య.

"ఏం ?" అన్నాము మేము రామయ్య తటపటాయించాడు

"ఆ గదిలో కరణంగారి మొదటి పెళ్ళాం వురేసుకుంది—ఆ తల్లి దయ్యమయ్యిందని యీయిల్లు వదిలేశారు" అన్నాడు. ఆసువార్తతో మా గుండెలు ఆగిపోయాయి. 'బాబోయ్' అన్నాం ఉమ్మడిగా. ఇంతలో సింగు వచ్చాడు. వస్తూనే "ఏవిటండి, బాబోయ్ అంటున్నారు" ఇంకా ఏవేవోచెప్పి మిమ్మల్ని భయపెడుతున్నాడా" అన్నాడు నవ్వుతూ. "లేదండి" అంటూ నేను వున్నదంతా చెప్పా.

'ఆ గదిలో కెళ్ళండి చూదాం' అన్నాడు రామయ్య.

సింగు తడిగెడ్డాన్ని గిలకాయించాడు బుర్రగోకున్నాడు. "సరే పదండి" అన్నాడు. అందరం కలిసి దొడ్లో హాజరయ్యాము రామయ్య తాళం తీశాడు. సింగు మా అందరికేసి ఒక్కసారిచూసి గమ్మున తలుపు తోసుకుని లోపల కెళ్ళిపోయాడు. పక్కనేవున్న రామయ్య తలుపులు ధుణోలున లాగేశాడు మేమంతా గాలి కూడా పీల్చడం మానేసి అలాగే తలుపువంక చూడసాగాము. రెండు నిముషాలు గడిచాయి

మరొక్కక్షణం గడిచింది లోపల్నించి, "టంటం టటంటం" అన్న శబ్దం, "కిర్ర్కిర్" అన్న శబ్దం, వెనువెంట మనిషి దిగ్గనపడి మూల్గినశబ్దం వినబడ్డాయి మా శరీరాలు భగ్గుమన్నాయి భయంతో మేం లుంగ చుట్టుకుపోయాము

"చచ్చాడు గావోల్ను" అన్నాడు రామయ్య. దాంతో మా శరీరాలు చల్లారిపోయాయి "తలుపు తియ్యి రామయ్యా" అన్నాను నేను రామయ్య నెమ్మదిగా తలుపును తోశాడు తలుపు తెరిచీ తెరవడంతో సింగు లుంగ చుట్టుకు బయటపడ్డాడు మేము చల్లా చెదరయ్యి మళ్ళీపోగయ్యాయి ఈలోగా అతను లేచి వళ్ళు సాగదీసుకున్నాడు అతని నుదురుమీద రక్తం మరకలు నా కంటికి స్పష్టంగా కనపడ్డాయి.

"ఏవయ్యిందండీ" అన్నాను నేను యాంత్రికంగా.

"ప్—ప్ఏదీ లేదండి—"అన్నాడు తను నుదురు మీది రక్తం తుడుచుకుంటూ

"మరా రకతం ఏప్టి" అన్నాడు రామయ్య.

"చెప్తా"నంటూ అతను లోపలకువెళ్ళబోయాడు. రామయ్య ఆగది గొళ్ళెం లాగేసి,తాళంవేస్తూ "చెప్పండి" అన్నాడు సింగు మా అందరికేసి చూశాడు చూసి ప్రారంభించాడు

"గదిలో కెళ్ళానా, లోపల వెలుతురస్సలులేదు. అటూ యిటూ తచ్చాడేసరికి కాలికి ఏదో తగిలి పడిపోయాను పైనుంచి పెంకుముక్కో, రాయో నెత్తిమీదపడి తల పగిలింది ఇంతలో మీరు తలుపులు తీశారు—అంతే" అన్నాడు సింగు సింపుల్‌గా మేం అందరం అది నమ్మాలో, నమ్మకూడదో తేల్చుకోలేకపోయాము అందరం కలిసి నిశ్శబ్దంగావచ్చి వీధరుగులమీద కూర్చున్నాము మళ్ళీ చర్చ రగడ ప్రారంభమయ్యింది ఈ చర్చలోంచి పిశాచం చర్చలోకి దిగాము

"నువ్వా దయ్యాన్ని చూశావా రావయ్యా" అన్నాడు సింగు సిగరెట్టు వెలిగిస్తూ.

"ఒక్కగా నొక్కసారి చూశాను సార్ అద్దెనా

# పరీక్ష

కొన్నాళ్ళ క్రితం" అన్నాడు రామయ్య సింగుదట్టంగా సిగరెట్టుపొగ వదిలి, "ఈ రాత్రికి చూద్దావనుందా" అంటూ లేచి నించున్నాడు

"బాబోయ్" అన్నాము మేము.

"ఏంటిబాబూ" అన్నాడు రామయ్య లేస్తూ.

"నే నీరాత్రి ఆ దెయ్యపమ్మాయిని చూడబోతు న్నాను రాదల్చుకున్నవాళ్ళు రండి" అన్నాడు. మేం చకచకా వొకళ్ళకేసి వొకళ్ళం చూసుకుని, కళ్ళతో మాట్లాడుకుని వాటికి సమాధానాలు చెప్పుకుని మౌనంగా వూరుకున్నాము.

"వొద్దుబాబూ! మీమాత్రం ఎవరికీ ధైర్యం లేకగాదు. దెయ్యాలతో, దేవుళ్ళతో, నిప్పుతో, నీళ్ళతో చెలగాటం కూడదని పెద్దలన్నారు బాబూ" అంటూ రామయ్య అతన్ని సమీపించాడు. సింగు కూడా లేచి నించున్నాడు

"ఫరవాలేదోయ్ మనం ఎలాగా చావాల్సినవాళ్ళమే గదా, ఏదోఅనుకున్న పని చేసి చస్తేపోతుంది" అన్నాడు. అని మా అందరికేసి చూశాడు మేము ఎవ్వరం మాట్లాడలేదు సింగు చిన్నగానవ్వి లోపలకువెళ్ళి వో పక్షిని తెచ్చుకు అరుగుమీద కూర్చున్నాడు. మేము లేచి దొడ్లోకివెళ్ళి మా అభిప్రాయాలమీద చర్చ ప్రారంభించాము నాకు వెళ్ళాలన్న కోరిక చాలా బలంగా కలిగింది. కానీ, మాజట్టువాళ్ళు "చస్తే మేం రాం" అన్నారు. నేను శేషగిరిని అడిగాను అతనికి కూడా చూడాలన్న కోర్కెవుందిగానీ, ప్రాణభయం వల్ల "వద్దురా, మా అమ్మా నాన్నకు నే నొక్కణ్ణే కొడుకును" అన్నాడు. మాట్లాడకుండా మేం మళ్ళా వచ్చి అరుగులమీద కూర్చున్నాము.

* *

రాత్రి పదకొండయ్యింది మాలో కొందరు హాయిగా నిద్రపోతున్నారు. నేనూ, శేషగిరీ, సింగూ, రామయ్యా మాత్రం మేల్కొనివున్నాము

బయట పున్నమి వెన్నెల తన గొప్పదనాన్ని చాటు తోంది ప్రశాంత వాతావరణాన్ని ఆధారంగా చేసు కుని కీచురాళ్ళు తమ ధ్వనిని ద్విగుణీకృతం చేస్తు న్నాయి ఉండుండి వీధికుక్కలు అరుస్తూ తమ స్వామిభక్తిని చాటుతున్నాయి.

మాలో ఎవ్వరూ ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడు కోటంలేదు మరో కాస్సేపటికి సింగులేచి, "నేను వెళ్తున్నాను. రామయ్యా—ఆ గుర్తులు మరోసారి చెప్పు" అన్నాడు

"నామాటవినండి బాబూ" అన్నాడు రామయ్య

"నామాట వినవోయ్" అన్నాడు సింగు నవ్వుతూ.

రామయ్య మారుమాట్లాడకుండా గుర్తులు చెప్పాడు సింగు లోపలికివెళ్ళి నల్లని సూటు ధరించి జేబులో పిస్తోలు వేసుకుని "నేను వస్తానండీ" అంటూ చకచకా వెళ్ళిపోయాడు

మేం ముగ్గురం అతను వెళ్ళిపోయినవైపు ఒక్కసారిచూసి ఒకళ్ళకేసొకళ్ళం చూసుకున్నాము.

"చెయ్యాలన్నపని చేస్తేగాని కొందరికి నిద్ర పట్టదు అలాటివాడే సింగు" అన్నాను నేను

"ఏమో, యిలాటివాళ్ళే ఎంతపనైనా చేస్తారు. యిలవెళ్ళి ఆ దెయ్యాన్ని—వుంటే సంగతి—చంపి పారేస్తాడనే నమ్మకంవుంది నాకు" అన్నాడు శేషగిరి

"ఆ—కుదరదు బాబూ, దయ్యాన్ని ఎలా చంపు తారు? లాభంలేదు. ఆ మారాజు పోయినట్టే" అన్నాడు రామయ్య

"అలా చావగా ఎందర్ని చూశావు రామయ్యా" అన్నాను నేను

"ఇద్దర్ని బాబూ. వాళ్ళిద్దరే ధైర్యం చేశారు. ఇద్దరు సచ్చారు పదేళ్ళనాడొకడూ, అంతకుముందు మరోడూ" అన్నాడు రామయ్య

నేను ఆలోచించాను ఆ విషయం చూద్దామనే వుబలాటం నాలో ఎక్కువయ్యింది ఏమైనాసరే చూద్దాం అనుకుని, "రామయ్యా మనం కూడా వెళ్ళి చూద్దామోయ్" అన్నాను నేను లేచి నించుంటూ.

"ఏరోయ్—బుద్ధి లేదా" అన్నాడు శేషగిరి.

"వద్దుబాబూ" అన్నాడు రామయ్య.

నేను మాట్లాడకుండా లోపలకెళ్ళి బూట్లు తొడుక్కుని మఫ్లరు తలకి చుట్టుకుని బయటికి వచ్చాను. కాస్సేపు నన్ను శాసించి, యిక లాభం లేదని శేషగిరి తయారయ్యాడు. రామయ్య కూడా లేచాడు

* * *

చకచకా నడుచుకుంటూ మేము ఆ రావిచెట్టు దగ్గరికి చేరేసరికి సింగు అక్కడ మాకు కనిపించాడు. అతను నిలబడితూర్పువైపు చూస్తున్నాడు మమ్మల్ని చూడలేదు మేము అతనికి తెలియకుండా రావిచెట్టు వెనక దాక్కున్నాము ఇంతలో ఆ పిలుపు లీలగా వినబడింది. రామయ్య మా యిద్దరి చేతులూ గట్టిగా పట్టుకున్నాడు

"ఓహ్వా"—యీసారి ఆ కూత స్పష్టంగా వినబడింది.

"ఓహ్వా"—అన్నాడు సింగు

భయంతో మేము రావిచెట్టుకు యింకా కరుచుకు పోయాము మళ్ళీ ఆ కేక వినపడింది ఈసారి యింకా స్పష్టంగా వినబడింది సింగు మళ్ళీ 'ఓహ్వా" అన్నాడు. కొండ మారుమ్రోగింది

రామయ్య మా చేతుల్ని యింకా గట్టిగా నొక్కి పట్టుకున్నాడు

"హోహ్వా"—ఆ కేక యీసారి చాలా దగ్గర్నుంచి వచ్చింది

"ఒహ్వా" అన్నాడు సింగు

రెండు కేకల ప్రతిధ్వనులూ పోట్లాడుకున్నాయి. మూడుసార్లు అయిపోయింది మేము చెట్టుపక్క నుంచి తొంగిచూశాము సింగు పెద్ద విగ్రహంలా హుందాగా నిలబడివున్నాడు అతని చేతిలో పిస్తోలు రెడీగావుంది మేము గుండె శబ్దాలు లెక్కపెట్ట సాగాము

పక్కగావున్న పొదలోంచి ఒక నల్లటిపక్షి రివ్వున సింగుమీదనుంచి ఎగిరింది ఆ పక్షి ఆడుగు పొడు గున సన్నగా వుంది సింగు నించున్న చోటునుంచి అటూ యిటూ నాలుగడుగులు వేశాడు తలపైకి ఎత్తి చూస్తూ ఆ పక్షి మళ్ళీ అతనిమీంచి ఎగిరింది. యీసారి అతని చేతిలో పిస్తోలు "ఢాం" అని పేలింది. పక్షిమాత్రం మూడోసారి ఎరగడం మాన లేదు.

మూడోసారి కూడా అతనిమీంచి ఆ పక్షి ఎగిరి ఎదురుగావున్న పుంతల్లోకిపోయింది. సింగు పిస్తోలు "డాం, డాం" అని పేల్చాడు. మేము ముగ్గురం భయంతో కట్టకట్టుకుపోయాము.

మరొక్క క్షణంలో పుంతలో ఒక ఆకారం లీలగా మెదిలింది. నాకు ముచ్చెమటలు పోశాయి. కళ్ళు గట్టిగా, భయంతో మూసుకున్నాను. శేషగిరి కుంచో లేక కూర్చొని గజగజ వణుకుతున్నాడు. రామయ్య గుడ్లప్పజెప్పి చూస్తున్నాడు.

ఆ ఆకారం నెమ్మదిగా పుంతల్లోంచి యివతలకు వచ్చింది. ఆ ఆకారం ఒక అందమైన స్త్రీని పోలి వుంది. జుట్టు విరబోసుకుని వుంది. రూపం మానవరూపంలా స్పష్టంగా, కనబడక, అలికినట్లు అస్పష్టంగా, లీలగామాత్రమే కనుపించింది. మేము భయంతో కళ్ళు మూసుకుని చెట్టు వెనక్కి వెళ్ళిపోయాము. సింగుచేతిలో పిస్టలు మరోసారి పేలింది. మేము కళ్ళు తెరిచి చూసేనరికి ఆ ఆకారం అక్కడే ఉంది.

సింగు నాలుగడుగులు వెనక్కివేసి ఆరడుగులు ముందుకు వేశాడు. ఆ ఆకారం అతనివేపు కదలడం ప్రారంభించింది. పడవకుండా ఆమె, శకటాలు కదిలినట్లు కదిలి రాసాగింది. కాళ్ళు వెనక్కి తిరిగివున్నాయోమో అని నేను చూశాను కానీ ఆమె చీర కుచ్చిళ్ళు కిందగా వుండడంవల్ల కాళ్ళు కనపడలేదు. ఆమె సింగును బాగా దగ్గిరిగా సమీపించేసరికి అతను 'డాం డాం' అని మళ్ళీ పిస్టలు పేల్చాడు. కానీ ఆమె చెక్కు చెదరలేదు

"ఓహ్హా" అంది జుట్టు మునివేళ్ళతో వెనక్కి నెట్టుకుంటూ.

"ఎవర్నువ్వు" అన్నాడు సింగు దిక్కులు దద్దరిల్లే అంత గట్టిగా.

ఆమె ఫక్కున నవ్వింది ఆ నవ్వు వెన్నెలకన్నా తెల్లగావుంది. నవ్వు శబ్దానికి ప్రతిధ్వని గింగురుమంది ఆ నవ్వులో ఏదో భయం తోచింది మాకు. మరోసారి ఆమె యికిలించింది మా శరీరాలు గజగజలాడాయి.

"ఓహ్హా" అందామె మళ్ళీ.

"ఓహ్హా" అన్నాడు సింగు

"ఓహ్హా" అందామె మళ్ళీ యీసారి ఆమె శరీరం కొంచెంగా నల్లబడి మళ్ళీ తెల్లబడింది. ఆమె శరీరంలోంచి పొంతలూ, చెట్లూ చేమలూ కనిపిస్తున్నాయి ఆమె శరీరం మానవ ధర్మాన్ని పొందలేదు అనుకున్నాను.

మరోసారి ఆమె నవ్వి వచ్చిన తోవనే వెళ్ళిపోయింది. సింగు చకచకా ఆమెను అనుసరించాడు ఆమె వెడుతూంటే పరిసరాలు ఆమె శరీరంలోంచి కనుపించసాగాయి. చూస్తుండగానే వాళ్ళిద్దరూ మాకు కనుమరుగయ్యారు

"బాబూ, వెనక్కిపోదాం యిక" అన్నాడు రామయ్య చాలా నెమ్మదిగా.

"ఒరే పోదాంరా" అన్నాడు శేషగిరి.

కానీ, నాకు పోవాలనిలేదు ఏమైనాసరే ఏమవుతుందో చూడాలన్నకోరిక హెచ్చు అయిపోయింది

"వొద్దు రామయ్యా. చూద్దాం పదండి ఏం జరుగుతుందో" అన్నాను నేను. రామయ్య మారు మాట్లాడకుండా, "అయితే పదండి గమ్మున" అంటూ లేచాడు. శేషగిరి బాధగా జుట్టు పీక్కున్నాడు. ముగ్గురం మళ్ళీ వాళ్ళు వెళ్ళినవైపు చకచకా నడక ప్రారంభించాము మేము కొండక్రింద భాగానికి చేరేసరికి వాళ్ళు చాలా పైకి వెళ్ళిపోయారు. గబగబా మేము కొండ ఎక్కాము. మేము కొండ సగంపైగా ఎక్కేసరికి భయంకరమైన నవ్వు వినపడింది. ఆ శబ్దం వచ్చినవైపు చెల్లాచెదురుగా పరుగెత్తేము. కొంతసేపటికి మా కంటికి వాళ్ళిద్దరూ కనుపించారు. సింగు నిటారుగానించుని వూగిసలాడుతున్నాడు. మేము దగ్గిరగావున్న వొక కొండరాయి వెనక దాక్కుని చూడసాగాము.

"బాబాయ్" అంటూ సింగు భూమ్యాకాశాలు దద్దరిల్లేలా అరిచాడు. అతని ఎదురుగా ఆ స్త్రీ ఆకారం ఒక వెలుగులా వుంది. సింగు గట్టిగా మూలగసాగాడు.

ఉన్నట్టుండి ఆ 'వెలుగు' మాయమైపోయింది సింగుమరోసారి "బాబోయ్" అని అరిచాడు. శరీరమంతా కత్తులతో కోస్తుంటే బాధ భరించలేక అరిచినట్టు ఆ అరుపు వినిపించింది మేము భయంతో కట్టకట్టుకుపోయాము.

సింగు నేలమీదపడి గిలగిల తన్నుకోసాగాడు. మరో నిముషంలో లేచాడు. గాలిలో చేతులు గిర్రున వూపాడు మనిషి గాలిలో రెండు అడుగులమేర లేచాడు నేను ఆశ్చర్యంతో కళ్ళు నులుపుకుని చూశాను. ఈసారి అతను యింకా ఎత్తుకులేచి అడ్డం తిరిగి గిలగిల్లాడసాగాడు నేను మోకాళ్ళమీద లేచి చూడసాగాను శేషగిరి తెగ వణుకుతున్నాడు. రామయ్య కళ్ళు గట్టి మూసుకున్నాడు

"ఓహ్హా" అన్న ఆ స్త్రీ కేక యీసారి వికృతంగా, భయంకరంగా వినిపించింది. సింగు యింకా గాలిలోనే తన్నుకుంటున్నాడు. చిన్నగా మూలుగుతున్నాడు.

మరో కాస్సేపటికి అతను ధాం అని నేలమీద పడిపోయాడు భయంకరమైన కేకతో నేలమీంచి మళ్ళీ గాలిలో ఎగిరాడు అంతే మరు క్షణానికి భయంకరమైన మరో కేకతో కొండమీంచి క్రిందపడిపోయాడు ఎక్కడో ఒక గుడ్లగూబ అంతకన్నా భయంకరంగా కేకవేసింది.నా కళ్ళు చీకట్లు కమ్మాయి. ఒళ్ళు తూలిపోయింది. నిలదొక్కుకోలేక నేలమీద పడిపోయాను.

కళ్ళు తెరిచి చూసేనరికి లీలగా తెలతెలవారుతున్నట్లు గ్రహించాను గమ్మునలేచి, రాత్రి సంఘటన గుర్తు తెచ్చుకుని పక్కకు చూశాను. రామయ్య బొమ్మలా అలాగే చూస్తున్నాడు శేషగిరికి యింకా స్పృహరాలేదు





# న్యూఢిల్లీ లేఖ

(7-వ పేజీ తరువాయి)

విశ్వవిద్యాలయంలో 70% మంది ముస్లింలనీ, ప్రతి ఏడు నూటికి 80 మంది ముస్లింపట్టభద్రులు పాకిస్తాన్ వెళతారని ఢిల్లీ వర్గాలవారి అంచనా. అంటే కాంగ్రెస్ ప్రభుత్వమాని, ఉద్యోగాలకు సుశిక్షితులైన పట్టభద్రులను పంపి భారత దేశం పాకిస్తాన్‌కు అదుకొంటున్నదన్నమాట. పోనీ ఇలా పట్టభద్రుల నిరంతర ప్రవాహం వల్లనైనా భారత పాకిస్తాన్ సంబంధాలు చక్కబడ్డాయా అంటే అదీలేదు. విభజనకు ముందెంతో ఇప్పుడూ అంతే ....

మత కల్లోలాలు ప్రబలిన వెంటనే కేంద్ర రైల్వేల ఉపమంత్రి శ్రీ షా నవాజ్ ఖాన్ స్వయంగా పరిశీలించేందుకు అలీఘర్‌కు వెళ్లారు. విద్యాశాఖ ఉపమంత్రో, దేశీయాంగశాఖ ఉపమంత్రో ఓ రైల్వే ప్రమాదం జరిగినచోట స్వయంగా పరిశీలించేందుకు పరిగెత్తితే రైల్వే ఉపమంత్రిగాని, వారి అధిపతి శ్రీ జగ్జీవన్‌రాం గానీ ఎలా అనుకుంటారు? ఇంతకీ శ్రీ షానవాజ్ ఖాన్ ముసల్మానైనందువల్ల పార్లమెంటరీ ప్రజాస్వామ్య సూత్రాలకు జవాబుదారీకాదా? అంతేకాక శ్రీ షానవాజ్ ఇటీవల ఒక ప్రకటనచేశారు. జమయుత్ ఉల్ ఉలేమా ఇహింద్ కాంగ్రెసుకు అండగా చాలాకాలంనుంచి ఉంటోందనీ, స్వర్గీయ ఆజాద్ ఆ సంస్థ సభ్యుడనీ, కారణాలు ఆధారంగా సమర్థించారు. ఇప్పుడు రెండుసమస్యలు ఉత్పన్నం అవుతున్నాయి. మొదటిది: ఈసంస్థ సభ్యులు కాంగ్రెస్‌కు అండగానిలచిఉండవచ్చు. కాని దేశవిభజనను నిరోధించ గలిగారా? మౌలానా ఆజాద్ జీవితచరిత్రలో నుండి ఈ కఠోరసత్యం బయటపడుతుంది. దేశ విభజనకు అంగీకరించినందుకు ఆజాద్ ప్రధాన మంత్రినీ, ఆయన హిందూ సహచరులను దుమ్మెత్తిపోశారు ఆపుస్తకంలో; అయితే భారతదేశంలో ముసల్మానులను సమైక్యపరచి, దేశ విభజనకు ముస్లింలీగ్‌కు వ్యతిరేకంగా నిలిపేందుకు మౌలానా గానీ, జమయుత్ ఉలేమా గాని చేసిన ప్రయత్నాలను గూర్చి మాత్రం అందులో ఉండకపోవటం.

ఇక రెండో విషయం: పేరులో నైతేనేమి, కార్యక్రమాలవల్లనైతేనేమి, జమయుత్ మతసంస్థే. ముస్లిం మతప్రచారకులను తయారుచేయుటం మహమ్మదీయేతరులను ముస్లిములుగా మార్చటం ఈ సంస్థ ప్రధానలక్ష్యాలు. ఈ కార్యక్రమాలలో అభ్యంతర పెట్టతగిందిగాని, అభ్యంతరపెట్టాల్సిందిగాని ఏమీలేదు. దేశరాజకీయాల్లో ఐక్యం కలిగించుకుంటున్నారని ఒక వంక క్రైస్తవ మతప్రచారకులను నిందిస్తున్నప్పుడు, జమయత్ విషయంలో ప్రత్యేక సదుపాయాలుకావాలనటం ఏమంత సబబు? కాంగ్రెసు ప్రభుత్వమూ అంటూ, మౌలానా, మౌల్వీ, ముసల్మానుల ప్రాతినిధ్య గౌరవం జమయుత్‌కు దక్కింది. మత, ఆర్థిక, రాజకీయ విషయాల్లో ముస్లింల ఏకైక ప్రతినిధిగా వ్యవహరిస్తున్నది. జమయుత్ నాయకుడు హిఫ్జుర్ రహమాన్‌ను కాంగ్రెస్ క్వాదే ఆజాంను చేసింది గదా!

అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు శ్రీ జైదీ ప్రధానమంత్రిని సందర్శించారు. ఒకానొక పత్రికకు ఇంటర్వ్యూ ఇచ్చారు. ఇందులో ఆయన తాను ప్రధాన మంత్రికి చెప్పిన విషయాలు కూడా వివరించారు. అలీఘర్ విద్యార్థులంతా అమాయకులు పసిపాపలట. విద్యార్థుల ప్రతినిధివర్గంకూడా ప్రధానమంత్రిని కలుసుకొన్నారు. తమ దోషమేలేదని వీరు ఆ తరువాత ఒక పత్రికలో ప్రకటించారు.

అసలీ గంద్రగోళం ఎలా ప్రారంభమైంది? విద్యార్థిసంఘ అధ్యక్షపదవికి ఎన్నికలు జరిగాయి. ఒక హిందువు, ఒక ముస్లిం ఇద్దరూ పోటీ చేశారు. తామెంత మత విద్వేషరహిత దృక్పథంలో ఉన్నారో శ్రీ నెహ్రూకు నిరూపించేందుకు గావోసు, అలీఘర్ విశ్వవిద్యాలయంలోని విద్యార్థులు (70% ముసల్మానులే లెండి) ముసల్మాన్ అభ్యర్థినే ఎన్నుకున్నారు. ఇదీ చాలక తమ విశాల దృక్పథం ప్రదర్శించటం కోసం వీరంతా, ఎన్నికల్లో ఓడిన హిందూ అభ్యర్థి గడ్డిబొమ్మలతో, పెద్ద వూరేగింపు లేవదీశారు. అయితే "పాపం ఈ విద్యార్థుల తప్పేం లేదండీ! అసలీ వూరేగింపును విశ్వవిద్యాలయం అధ్యాపకులో, అలీఘర్ ప్రజలో లేవదీసి ఉంటారు" అని శ్రీ జైదీ అభిప్రాయం.

పైన, నే వ్యాఖ్యానించినట్లు, భారతదేశం నడిబొడ్డున ఇంకో పాకిస్తాన్‌ను కాంగ్రెస్ సృష్టి చేయదలుచుకొంటే తప్ప, అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయాన్ని తిరిగి కట్టుదిట్టం చేయాల్సి ఉంటుంది. దేశ సమైక్యతదృష్ట్యా ఈ విశ్వవిద్యాలయ అధ్యాపకులను, విద్యార్థులను దేశంలోని యితర విశ్వవిద్యాలయాలకు పంపించివేయాలి. అన్నిటికన్న త్వరగా శ్రీ జైదీని పంపివేసి, ఆయన బదులు ఒక మహమ్మదీయేతరుణ్ణి (ఉదాహరణకు క్రైస్తవుణ్ణి) నియమించాలి 

# గళ్లనుడికట్టు-77



## అడ్డం

1. రాశి లక్షణము రాయి
3. ఉత.
4. తనయులో 'అతని' అర్థమా ?
6. పొగడినచో ఎల్ల దొరకును.
8. నీరు.
10. 22 అడ్డం కూడా ఇదే !
12. ఇటికలు మొదలైనవాటికి సంబంధించినదా?
14. స్వర్గము.
16. ముందు పుట్టినవాడా ?
17. కొండు బోలలు!
18. 4 అడ్డానికి బహువచనం,
20. ప్రభాతము.
21. రహస్యము!
22. పొడవు కానిది.
23. చేతి దివ్వెటి.
24. వారి పటంలో పీలు కనిపిస్తున్నదా ?
25. ఈ పప్పు కలగాపులగమై పోయింది.
26. వక్రమే కాని, తిరగబడినది.
28. ఒకప్పుడు పావులాలో సగం.
29. వాడుకలో పేర్చిన గడ్డి.
30. బుషి.
32. ఇంద్రుని భార్య.
34. కడుపులో ఉండేదా ?
35. అట్టు.
37. పెట్టు గుంపు.
38. స్వామము, పెదములోనేగా ఉన్నది!
40. తలకి సంబంధించినది!
41. తలక్రిందులయిన సంతోషమే కాని, క్రియగా చూస్తే 'పెద్దదవు' అని అర్థం.

---

## 76-వ గళ్లనుడికట్టుకు జవాబు



## నిలువు

2. భుజాలపైనది తిరగబడితే తీగ.
3 తడికాదులెండి !
5 వనములో సరిక్రొత్త దురద !
6. మెత్తకాదు!
7. వైదిక శాస్త్ర వృత్తము.
9. వైవాహసంబంధము కల వృత్తము చూ
10. పున్నాగము.
11. సర్వాంగలేకుండా అతని పనులు!
13. మనుపురంగు కల లేదము తాగబడినదా ?
15. నివేకించుట. చివరి మూడు మార్చాలి.
16. తాంబ.
17. సిక్కు వంటిదే స్నానము కూడా!
19. తలమీదది ఏమిటి ? కిరీటమా ?
21. పొగాకు బెల్లములో ఉంచగా వచ్చేది—గుడార ముసకు వెతికి చూడండి.
24. నగరములో ఒక భాగము.
27. కోరిక.
28. ఇది సరికాదు!
29. సెంటయిరే కాని మాట్లాడు!
31. సినిమాలో రాత్రి.
33. సంకటము.
34. గొప్పకాదు.
36. కీడే కాని ఇక్కడ తలక్రిందులుగా
37. ధూమమే !
39. 'ఇదం జగత్' ఇది స్ఫురింపచేసేది ఏమిటి?



ఒకచోట హరికథ జరుగుచున్నది. మామూలుగా హరిదాసు "జై ఇందిరారమణ గోవిందా" అని గట్టిగా అరిచాడు. ఇక అందరు "గోవింద" అని, నిశ్శబ్దముగా వుండిరి. అంతలో అట్టుప్రక్క నిద్ర మత్తులో ఉన్న ఒకతను లేచి "నాకు స్వామీ" అంటూ హరిదాసు దగ్గరికి చేతులు చాచుకుంటూ వచ్చాడు.

హరిదాసు :- ఏమిటయ్యా, ఏమిటి?

అతను :- ప్రసాదము స్వామీ.

సభంతా గొల్లుమంది.

ఎస్. జి. రామారావు, (మద్రాసు-1)

## పొట్టి కథ

### ఇక్కడ బట్టలు అమ్మబడును

ఆ వూరిలో శివరామయ్య గారికి పెద్ద బట్టలకొట్టు ఉన్నది. ఆయన తన దుకాణము ముందు నైన 'శివరామ్ క్లాత్ షాపు' అని తెలుగులోను ఇంగ్లీషు లోను పెయింటు చేయించిన బోర్డు కట్టించాడు. దాని క్రిందనే 'ఇక్కడ బట్టలు అమ్మబడును' అని చిన్న బోర్డు వ్రేలాడదీశాడు.

ఒకరోజున ఒక డాక్టరుగారు కారులో ఆ కొట్టుకు వచ్చారు. ఆయన కొట్టులోనికి వస్తూ, 'ఇక్కడ బట్టలు అమ్మబడును' అనే చిన్నబోర్డును చూశాడు. ఆయన శివరామయ్యతో "అదేమిటోయ్, ఆ బోర్డుమీద 'ఇక్కడ' అని వ్రాయించావు. బట్టలు బోర్డు కట్టినచోట కాక విడిగా ఎక్కడో అమ్ముతారా? ఆ బోర్డుమీద 'ఇక్కడ' అని వ్రాయించటం అనవసరం" అని విమర్శించి, తనకు కావాలిసిన గుడ్డలు కొనుక్కొని వెళ్ళిపోయాడు.

డాక్టరు వెళ్ళిన తరువాత శివరామయ్య బోర్డును పరిశీలించాడు. ఆయనకు కూడా 'ఇక్కడ' అనే పదం అనవసరం అని తోచింది. వెంటనే పెయింటర్‌ని పిలిపించి, 'ఇక్కడ' అనేమాట తీసివేసి, 'బట్టలు అమ్మబడును' అని వ్రాయించాడు.

రెండు, మూడు రోజులు పోయిన తరువాత ఒక కాలేజి విద్యార్థి శివరామయ్యగారి కొట్టుకు వచ్చాడు. అతగాడు తన పంట్లాంకు కావలసిన గుడ్డ కొనుక్కొని వెళ్ళిపోతూ 'బట్టలు అమ్మబడును' అన్న బోర్డు చూచాడు. చూచినవాడు ఊరుకోక "ఇందులో 'అమ్మబడును' అని వ్రాయించా లెందుకండీ. మీరు బట్టలు అమ్మడానికి కాక వాడుకోటానికి కొన్నారా ? ఆమాట తీసివేయించండి" అని ఆయనకు సలహాచెప్పి, వెళ్ళిపోయాడు.

శివరామయ్యకు ఇదీకూడ సమంజసంగానే కనిపించింది. ఆరోజు సాయంకాలమే పెయింటర్‌ని పిలిపించి, ఆ బోర్డుమీద మళ్ళీ శుభ్రంగా రంగుపూయించి, 'బట్టలు' అని వ్రాయించాడు.

మళ్ళీ వారంరోజుల తర్వాత ఒక ముసలాయన ధోవతి కొనుక్కొనడానికి ఆ కొట్టుకువచ్చాడు. ఆయన వస్తూనే 'బట్టలు' అని వ్రాసిన బోర్డుచూసి, శివరామయ్యతో "అందులో 'బట్టలు' అని వ్రాయించావేమిటయ్యా, బట్టలషాపులో బట్టలు కాక చేపలు, కూరగాయలు ఉంటాయా. ఆమాట కూడ అనవసరం" అని వ్యాఖ్యానించి, తనకు కావలిసిన ధోవతి కొనుక్కొని వెళ్ళిపోయాడు.

ఆసాయంకాలం పెయింటర్ వచ్చి ఆమాటను కూడా చెరిపివేశాడు. మరునాడు శివరామయ్య కొట్టుకురాగానే, ఖాళీగా ఉన్న చిన్నబోర్డు కనిపించింది. ఈ ఖాళీ బోర్డు మాత్రం ఎందుకని, తీసి, కొట్లో మూలకు విసిరివేశాడు.

'రాజబాబు' (విలాసు)



[illegible] Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street,



గగనవీధిలో

ఫొటో: ఎన్. జి. శేషగిరి (కోయంబత్తూరు)




నేడే చూడండి!

STUDIO SARMA V.S







వాణీ రిలీజ్